ఎం.ఎస్. రాజలింగంగారు మాటలోనూ, చేతలోనూ పరమసాత్త్వికులు. వారి జనకులైన వీరేశలింగశాస్త్రి దగ్గర నుంచి వచ్చిన వారసత్వం ఇది. నాంటా 60 సంవత్సరాల జీవన కాలంలో వారు సంయమనం కోలుపోయి, నిరంకుశంగా కాని, క్రోధంగాకానీ మాట్లాడిన ఘట్టాన్ని నేను చూడలేదు. ఇంత మాత్రమే కాదు, వారు ఒకరకంగా స్థితప్రజ్ఞులు కూడా అతి బాల్యంలోనే మాతృవియోగాన్ని అనుభవించారు. చలించలేదు. సంతాన నష్టమూ అయింది. ఐనమా చలించలేదు. వారి రాజకీయ జీవితంలోను ఎగుళ్ళుకన్నా దిగుళ్ళే అత్యధికం. ఎన్నికలలో ఒకటి రెండు సార్లు ఓడిపోయారు. అయినా నీరుగారి పోలేదు! చిన్ననాడు వారు అనుభవించిన దుర్భర దారిద్ర్యం ఊహించలేనిది. దాని నుంచి నిప్పులు చిమ్ముకుంటూ నింగికి ఎగిసినారే తప్ప ఢీలా పడిపోలేదు. ఆధ్యాత్మిక సంపత్తికల తల్లిదండ్రులు, మాతామహులూ ఇచ్చిన వారసత్వం ఇది. ఏదైనా సామాజిక వ్యవస్థ, ప్రభుత్వమూ కారణమైనప్పుడే వారు ప్రతిస్పందించారు తప్ప వ్యక్తుల దుశ్చర్యల మీద కాదు. ఇట్లాంటి వారసత్వాన్ని వారు మహాత్ముని నుంచి అందుకున్నారు. ఇట్లాంటి ఘట్టాలలో వారి కార్యాచరణకు ఇది కాంగ్రెస్ పార్టీ కార్యక్రమమా? లేక కమ్యూనిస్టు పార్టీ కార్యక్రమమా? అన్న వ్యర్థ ఆలోచనలు అడ్డం రాలేదు. గాంధీ ఆశ్రమం నుంచి తిరిగి వచ్చాక కరీంనగర్ జిల్లాలోని ముస్తాబాద్‌లో బద్దం ఎల్లారెడ్డి గారు, వారి సోదరుల నాయకత్వంలో వెట్టిచాకిరికీ వ్యతిరేకంగా ఉద్యమం సాగుతుండగా అది కమ్యూనిస్టుల ఉద్యమమని దూరంగా ఉండక, రాజలింగంగారు దాన్లో పాల్గొన్నారు. రాజలింగంగారికి తాను ఎన్నుకొన్న ఆదర్శాన్ని సాధించడమే ముఖ్యంకాని, దాన్ని ఏ గ్రూపు సాధిస్తోంది? అందులో మనం ఉండవచ్చునా? అన్న సంకుచిత ఆలోచనలు ఉండవు. అది వారి స్వభావం.

సత్త్వమూర్తులకు సాధారణంగా తీవ్ర ప్రతిఘటనోద్యమాలలో పాల్గొనాలనిపించదు, కాని గాంధీజీ పుణ్యాన, ఇలాంటి వారికీ ఒకదారి దొరికింది. రాజలింగంగారు గాంధీజీ ఆశ్రమంలో శిక్షణ పొందినవాడు. గాంధీజీ ఆదర్శాలతో, ఆచరణలతో స్వబుద్ధిని ప్రయోగించకుండా ఒప్పుకున్నాడనికాదు కాని స్థూలంగా ఆయనవి గాంధీజీ ఆశయాలే. ఆయన మార్గం గాంధీ మార్గమే. సత్యాహింసలు ఆయనకు ఊపిరులే.

అయితే గాంధీని అనుసరించడానికి ముందు నుంచీ, విద్యార్థి దశలో ఉన్నప్పుడే ఒకటి రెండు సంఘటనలు దేశ స్వాతంత్ర్య విషయంగా ఆయనను ఆలోచించేటట్లు చేశాయి. ఈవేళ మనం హైదరాబాద్‌లో చూస్తున్న కింగ్‌కోఠి (ఇప్పుడది హాస్పిటల్ అయినది) నిజాం నవాబు ఉన్న రాజసౌధం. ఈ సౌధానికి ప్రధాన ముఖద్వారానికి బట్టతో ఒక తెర బిగించి ఉండేది. ఈ ప్రాసాదమున్న వీధిలోంచి మనలాంటి ప్రజలెవరైనా వెళ్తుంటే వంగి నడవాలి. చెప్పులు చేతపట్టుకొని నడవాలి. ఆ తెర వైపుకి చూడకుండా నడవాలి. రాజలింగంగారు ఈ మూడు నియమాలలో ఒకదానిని ఉల్లంఘించారు. దానితో పోలీసులు అమానుషంగా వారిని బాదినారు. ఈ సంఘటన రాజలింగంగారిలో పెద్ద సంచలనాన్ని కల్గించింది. దక్షిణాఫ్రికాలో తెల్లవారి చేతుల్లో పొందిన అవమానమే గాంధీజీని ఎట్లా తయారు చేసిందో, ఈ సంఘటనా అట్లాగే రాజలింగంగారిని తయారు చేసింది. తర్వాత వారి రాజకీయ జీవితానికి ఈ అవమానభారమే కారణమనుకుంటాను.

దారిద్ర్యమనుభవిస్తున్న రోజుల్లో వారు సికింద్రాబాద్‌లోని ముదిగొండ శంకరయ్యగారి మఠంలో ఒక గదిలో ఉండి చదువుకునేవారు. అక్కడి నుండి నిజాం కళాశాల దాకా నడిచి వెళ్ళేవారు. ఆ కాలేజీలో వీరు ఆ రోజుల్లో ఒక సారస్వత సంచిక తీయాలనుకొని నిజాం కాలేజీ ఆంధ్ర విద్యార్థి సారస్వత సంచిక అన్న పేరు నిర్ణయించగా, అప్పటి ప్రిన్సిపాల్ ఆంధ్ర విద్యార్థి అనకుండా తెలుగు విద్యార్థి అనమని సవరించాడు. దీని కారణం ఆంధ్ర అన్న శబ్దానికి అప్పటి చారిత్రక పరిస్థితులలో రాజకీయ నేపథ్యం ఉండడం. అయితే రాజలింగంగారు దాన్ని తెలుగుగా మార్చకుండా నిజాంకాలేజీ- ఆంధ్ర విద్యార్థి సారస్వత సంచిక అన్న పేరుతోనే హైదరాబాద్‌లోని ముదిగొండ బుచ్చయ్యశాస్త్రిగారి ప్రెస్సులో అచ్చువేశారు. (ప్రింటర్ ఆ శాస్త్రిగారు తర్వాత పోలీసు వేధింపులకు లోను కావలసివచ్చింది). ఇట్లాంటి చిన్నచిన్న కార్యక్రమాలన్నీ రాజలింగంగారి రాజకీయ జీవితానికి నేపథ్యంగా నిలిచినవి. నిజాం ప్రభుత్వం సాంఘికమైన మార్పుల కోసం జరుగుతున్న ఉద్యమాలను గూడా (రాజకీయ చైతన్యానికి తర్వాత అవి కారణమవుతాయన్న భయంతో కావచ్చు) తీవ్రంగా అణచివేసేది. రజస్వలానంతర వివాహ సమర్థన చేసిన లక్కినేని నర్సయ్యను ఆ ప్రభుత్వం వేధించడం ఇందుకొక ఉదాహరణ.

రాజలింగంగారి ప్రమేయం ఉన్నదన్న సాంస్కృతిక కార్యక్రమాలలో సైతం అప్పుడు వెలుగులో వున్న కొందరు మేధావుల బహిరంగంగా సాయం చేయడానికి జంకేవాళ్ళు. గుబ్బివీరన్న థియేటర్ ద్వారా కురుక్షేత్రం నాటకం ఆడించడానికి ( ఒక లక్ష రూపాయల కాంట్రాక్ట్‌తో) పై సంచిక కోసం రాజలింగంగారు పూనుకొనగా ప్రఖ్యాతి వహించిన ఒక మహాకవి ఒక్క రూపాయి చందానిచ్చి తన పేరెక్కడా నోట్ చేయవద్దన్నాడు. నిజాం దయతో ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఉద్యోగం సంపాదించుకున్న వాడిట్లా కాక ఎట్లా ప్రవర్తిస్తాడు ! ఉన్నదంతా ఉర్దూనే ఆయె, మిగిలింది అంగ్రేజాయె – ఇంకా తెలుగు ఖదరెక్కడ అని మరొకాయన అన్నాడు.

ఇట్లాంటి రాజలింగంగారు రాజకీయ సామాజిక లక్ష్యాలను ఏర్పరచుకొని శిక్షణ పొందింది బాపూజీ ఆశ్రమంలో. చెన్నూరు నియోజకవర్గంలో కేవలం 150 ఓట్లతోనే ఎన్నికయినప్పుడూ, వరంగల్లు మునిసిపల్ కౌన్సిల్ ఎన్నికలలో తన శిష్యుడి చేతులలోనే ఓడిపోయినప్పుడూ, పదవీరహితంగా దశాబ్దాల కాలం ఉండాల్సి వచ్చినప్పుడూ ఒక మనీషిగా ప్రవర్తించే సంస్కారాన్ని ఈ ఆశ్రమ జీవనమే కల్గించిందని నా అభిప్రాయం. పరిశోధనలు చేసి ఒక డాక్టరేట్‌ని పొందగల్గిన రాజలింగంగారి మేధ సమాజపరం కావడానికి కేవలం గాంధీజీ ఆశ్రమ జీవనమే కారణం.

మనకింత వరకు ఇట్లాంటి గ్రంథం రాలేదు. రాజలింగంగారి లాగానే గాంధీజీ ఆశ్రమంలో ఉన్న తెలుగువాళ్ళు మరికొందరున్నారు కూడా. ప్రభాకర్‌జీ అందులో ప్రముఖుడు. వారందరి అనుభవాలకు జోడింపుగా రాజలింగంగారి ఈ గ్రంథాన్ని భావించినప్పటికీ ఇందులో కొత్త విషయాలు, ఈనాటి యువతరానికి ప్రేరణ కల్గించేవి అనేకం ఉన్నాయి. ఇది అవడానికి చిన్న పుస్తకమే అయినప్పటికీ ఇది కల్గించే ప్రేరణ అధికమే.

ఈ బాపు–నేను గ్రంథాన్ని రాజలింగంగారు తమ 82వ ఏట రాశారు. అందువల్ల 82 మందితో ఈ గ్రంథాన్ని చదివించి వారందరి అభిప్రాయాలను ఇట్లా విడిగా మూల గ్రంథానికి ఒక అనుబంధంగా ఇప్పుడు వేస్తున్నారు. ఈ 82 మంది పెద్దలూ అనేకానేక వృత్తులవారూ, అభిరుచుల వారూ. వీరిలోని ఏ ఇద్దరూ ఒకే మార్గానికీ, ప్రవృత్తికీ

చెందినవారు కాదు. జీవన్‌రెడ్డిగారిలాంటి న్యాయమూర్తులు ఉన్నారు. చలపతిరావుగారి వంటి విద్యా శాఖాదికారులూ ఉన్నారు. నారాయణరెడ్డిగారి లాంటి మహాకవులూ ఉన్నారు. జి.వి.సుబ్రహ్మణ్యంగారి లాంటి విమర్శకులూ వున్నారు. శివప్రసాద్‌గారి లాంటి నవలాకారులూ ఉన్నారు. సంపత్కుమారాచార్యులవారి వంటి పరిశోధక విద్యాంసులూ ఉన్నారు. పి.వి.వంటి రాజకీయ నాయకులూ ఉన్నారు. పొత్తూరి వేంకటేశ్వరరావుగారి లాంటి పత్రికా సంపాదకులూ ఉన్నారు. గాంధిజీయే వీరందరినీ ఈ గ్రంథంలో బంధించారనడం అతిశయోక్తి కాదు. ఇంకా గాంధీజీ సజీవుడే అన్న అభిప్రాయం కల్గుతుంది – వీరందరూ ఈ పుస్తకంపై వెలిబుచ్చిన అభిప్రాయాలను చదువుతుంటే !

అసెంబ్లీల ముందరా, పార్లమెంటు ముందరా గాంధీజీయే తన జీవిత కాలంలో ఎన్నడూ ఊహించనంత పరిమాణంలో గాంధీజీ విగ్రహాలు ప్రతిష్ఠాపించారు. కాని నిజమైన మహాత్మాగాంధీ మూర్తి మనకు బాపు–నేను అన్న ఇలాంటి గ్రంథాల ద్వారానే మూర్తి కట్టుతుంది. ఇట్లాంటి గ్రంథం మీద 82 మంది మేధావులు, న్యాయమూర్తులు, న్యాయవాదులూ, అధ్యాపకులూ, వైద్యులు, అధికారులు ఇత్యాదులు తమ తమ అభిప్రాయాలను వెలిబుచ్చి 82 సంవత్సరాల వృద్ధులైన రాజలింగంగారిని ప్రోత్సహిస్తున్నారా? అది చిన్నమాట. అంతకన్నా పెద్దది ఈ తరానికి వీరంతా ఒక గొప్ప ప్రేరణను, కొన్ని సద్విలువల మీద విశ్వాసాన్ని కల్గిస్తున్నారన్నదే నిజం. ఎం.ఎస్.రాజలింగంగారి రచనయే ఇందుకు హేతువు కావడం సంతోషించదగిన విషయం. మూలగ్రంథమైన బాపు–నేను ఎట్లా చరిత్రలో నిలిచే గ్రంథమో దాని అనుబంధంగా వచ్చిన ఈ గ్రంథమూ అట్లాగే చరిత్రలో నిలుస్తుంది.

తెలుగు సాహితి (తెలుగుశాఖ)
హైదరాబాదు విశ్వవిద్యాలయం
కేంద్ర విశ్వవిద్యాలయం
హైదరాబాదు – 500 134.

ముదిగొండ వీరభద్రయ్య.

# ఆశీస్సులు



సద్గురు శివానంద మూర్తి

నాకు ఆప్తమిత్రులు, అత్యంత గౌరవనీయులు అయిన శ్రీ ఎం.ఎస్. రాజలింగం గారి రచన, బాపు - నేను అనే గ్రంథాన్ని వారు నాకు దయతో పంపినారు. ఈ గ్రంథాన్ని చివరిదాకా చదివినాను. చాలా చాలా ఆసక్తికరమైన గ్రంథము.

ఈ శతాబ్దంలో మొదటిసగం ;భారతదేశంలో మహామహులు అన్ని రంగాలలోనూ చరిత్రకెక్కిన గొప్ప వ్యక్తులు జీవించినకాలమది. ఆ కాలంలో జీవించి నేడు వృద్ధులైన వారిలో చాలామందికి కొన్ని విషయాలు జ్ఞాపకం ఉండ ఉండవచ్చు. ఆ తరువాత తరాలవారికి ఆనాటి వ్యక్తుల పేర్లు మాత్రం తెలిసియుండవచ్చు. ఆ వ్యక్తుల ఆలోచనా సరళి, మాటలు, చేతలు, సంఘటనలు చాలా మందికి తెలియనే తెలియవు. గాంధీజీని గురించి ఆయనగారి రచనలతో సహా ఓ లక్ష పేజీలు అచ్చయ్యి ఉండవచ్చు. చదివినది కొద్దిమందే. వారేకాక అనేకమంది వ్యక్తులు, ప్రముఖులు, వారిమాటలు, చిన్న చిన్న సంమటనలతో వారి వారి వ్యక్తిత్వాల ప్రకటన, ఇవన్నీ చాలామందిక తెలియని విషయాలు. అవన్నీ మరొకాసారి జ్ఞాపకం చేయడం అంటే మనకు తెలియని విషయాలు చెప్పడము అనేపని ఈ చిన్న గ్రంథంలో జరిగింది. శ్రీ రాజలింగం గారు వ్రాసిన చిన్న చిన్న వ్యాసాలు చదువుతూ ఉంటే వారి ప్రక్కన కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ వారి జ్ఞాపకాలు వింటున్నట్లు ఉంది.

కొన్ని కొన్ని విషయాలు మనల్ని ఆలోచింపజేస్తాయి. గాంధీజి హింసన ఒప్పుకోలేదు. స్టేట్స్‌మెన్ సంపాదకుడు ఆర్థర్ కూపర్ బయటకి కన్పించెడి చెడు మాత్రమే అని వాదించినా బాపూజీ యుద్ధం హింసేనని వక్కాణించారు. గాంధీజీ, శత్రువు ఎదురు పడినప్పుడు బలవంతుడైన శత్రువు నెదిరించి చావడమే మేలని చెప్పి పిరికితనాన్ని గర్హించారు. బ్రిటీష్ అధికారులను చంపి ఉరికంబమెక్కిన దత్తు, భగత్‌సింగ్, సుఖదేవ్, రాజ్‌గురులను దేశభక్తులుగా మనం ఆరాధనాభావంతోనే చూస్తాము. వారు చేసిన పనిని గాంధీవంటివారు ఆమోదించారని కాదు. . గాంధీజీ తన హిందుత్వాన్ని విడనాడలేదు. దానిలోంచే ఇతర మతాలను గౌరవిస్తానని చెప్పినారు. విగ్రహారాధన మరొకరికి విశ్వాసపాత్రమైతే తానది చేయకపోయినా దానిని ఆయన మన్నించారు. ఇట్లాంటి విషయాలు ఈ చిన్న గ్రంథంలో మనకు తెలుస్తాయి.

ఈ రచనలో శ్రీరాజలింగంగారి వ్యక్తిత్వం కూడా గోచరిస్తుంది. ఆయన జందెము, ఇష్టలింగపూజ గాంధీజీ ఆశ్రమంలో కూడా వదలలేదు. తన ఆదర్శ రాజకీయ జీవితానికి అడ్డువచ్చేది ఏదైనా వదలగలనని స్పష్టం చేసారు. ఆయన మంత్రి పదవి తర్వాత ఇక ఎలక్షన్లూ, పదవులు, పార్టీ వాదోపవాదాలు, వాటి జోలికి పోలేదు. శ్రీ రాజలింగంగారికి శివభక్తి తర్వాత గాంధీ మార్గమే జీవనమార్గమైనది. రాజకీయం వదలి గాంధీమార్గంలో జీవించారు. ఇది నిజమైన త్యాగం, ఆదర్శ జీవనం. ఎందుకంటే శ్రీ పి.వి.నరసింహారావు గారు ఒక ఉపన్యాసంలో అన్నారు : శ్రీ రాజలింగంగారు రాజకీయాలలో ఉంటే ఎంతటి పదవినైనా చేరుకుని ఉండేవారు. కాని ఆయన గాంధీ మార్గ ప్రచారంలో జీవిస్తున్నారు. ఇంతకంటే శ్రీ రాజలింగం గారి గురించిన సత్యం ఎవరు చెప్పగలరు? వీరివంటి వ్యక్తులు చాలా అరుదు.

ఈ గ్రంథం బహుళ ప్రచారంలో అత్యంత ఆదరణీయమైనదయి, నేటి తరానికి స్ఫూర్తిదాయకము కాగలదు.

ఆనంద నిలయం
భీమునిపట్నం, పశ్చిమ గోదావరి జిల్లా.
ఫోన్ : 331163

కం. శివానందమూర్తి

# మున్నుడి

1934, 35 లగాయితు వరంగల్లులో హైస్కూలు విద్యార్థులుగా ఉన్నప్పటి నుంచి నాకన్న రెండేళ్ళు సీనియరు విద్యార్థిగాను, తరువాత గాంధీగారి నిర్మాణ కార్యక్రమంలో అనేక ఫలితాలు సాధించిన మేటి కార్యకర్తగాను, తదుపరి వరంగల్ నుండి 1952 ఎన్నికల్లో ఆనాటి కమ్యూనిస్టు ఝుంఝావాతంలో కూడ కాంగ్రెస్ అభ్యర్థిగా గెలిచి వచ్చి బూర్గుల రామకృష్ణారావు గారి మంత్రివర్గంలో చేర్చబడిన మంత్రిగాను, నాటికీ నేటికీ సన్నిహిత మిత్రుల్లో నాకు ఆదరపాత్రులుగాను, ఆదర్శప్రాయులుగాను, ఉన్న ఎం.ఎస్. రాజలింగం గారు నాకు చిరపరిచితులు. ఐతే ఈ చిన్ని పుస్తకం చదివినప్పుడు వారు నావంటి అనేకులకన్న ఔన్నత్యంలోనూ అనుభవంలోనూ ఎంత అద్వితీయులో ప్రప్రథమంగా నాకు తెలిసి వచ్చింది. నాకు తెలిసినంత వరకు నా సహచర బృందంలో మహాత్మా గాంధీతో ప్రత్యక్ష సాన్నిహిత్యం ఈ మేరకు సంపాదించిన వ్యక్తి మరొకరు లేరు. ఆశ్చర్యమేమంటే ఆయనకు సంబంధించిన అనేక రాజకీయాది వివరాలు తెలిసిన నాకు, ఆయనను గురించిన ఈ మహోజ్జ్వల కాలఖండం ఇదివరలో ఇంత విపులంగా తెలియలేదు. వరంగల్ సమీపంలో రభంపల్లి, నా సొంత జిల్లాలోని ముస్తాబాద్ మొదలైన గ్రామాలలో రాజలింగంగారు గ్రామీణ పరిశ్రమలు నిర్వహించిన విషయం నాకు తెలుసు. ఆనాడెందరో కార్యకర్తలు నిర్మాణ కార్యక్రమంలో పాల్గొన్నారు. నేను స్వయంగా హిందీ ప్రచారం, ఖాదీ వీటిలో పని చేశాను. కాని మహాత్మా గాంధీ సాన్నిహిత్యం నాకు లభించలేదు. వందేమాతరం సమ్మెలో హైదరాబాదులో పాల్గొని నాగపూర్‌లో విద్యార్థులుగా ఉన్న రోజుల్లో ఒకనాడు బాపూ దర్శనానికి కొందరం వెళ్ళిరావడం తప్ప ఏ నుచే వ్యక్తిగతానుభవమూ నాకు లేదు. కాబట్టి మా తరం వారిలో రాజలింగంగారిది అపూర్వ వ్యక్తిత్వమనడంలో నాకేలాంటి సందేహం లేదు.

గాంధీగారి సాన్నిహిత్యం ఎంత అమూల్యమైనదో దైనందిన సంఘటనల ద్వారానూ, మనసుకు హత్తుకుపోయే చిన్న చిన్న మాటలద్వారానూ, అక్కడక్కడ హాస్యరసం చిందేలాగానూ, స్వానుభవం నుండి వర్ణించిన భాగాలు రాజలింగంగారి చిత్తశుద్ధికీ సూక్ష్మావలోకన శక్తికీ అద్దం పడుతున్నాయి. మహానుభావులు చర్చించే ప్రతివిషయం అనన్యసామాన్యమై ఉండాలన్న నియమమేదీ లేదనీ, ఐతే ఎంత క్షుద్ర విషయమైనా సరే మహాత్ముల అవలోకన మాత్రాననే ఒక అనన్య వివేకాన్ని సంతరించుకుంటుందని ఈ ఉదంతాల వల్ల తేటతెల్లమౌతుంది.

గాంధీగారి సరళతాసౌందర్యం (Beatury in simplicity) సర్వ విదితమైనది. అనితర సాధ్యమైనది. ఆయన మాటలుకానీ, రాతలు కానీ, ప్రసాదగుణానికి ఉత్కృష్టమైన ఉదాహరణలు.

ఈ కొద్ది పుటల్లోనే గాంధీ ఆశ్రమజీవితంలోని సమగ్రతను రాజలింగంగారు కన్నులకు కట్టినట్టు వర్ణించారు. వెన్నలో నుంచి ఎక్కువ నెయ్యి ఎలా తీయాలన్న పరిశోధన ప్రారంభించి గాంధీ-జిన్నా భేటీ వరకు, రుచులను త్యజించడం నుంచి ప్రపంచ మహాయుద్ధాల వంటి జటిల సమస్యల వరకు, ఆనాటి ముఖ్యాంశాలన్నింటినీ మామూలు మాటల్లో ఉగ్గడించారు రాజలింగంగారు.

ఆనాడు గాంధీ ఆశ్రమంలో నివసించిన వారిలోనే వారి వారి ఆశయాల మధ్య కనపడిన వ్యత్యాసాలను రాజలింగంగారు స్పష్టీకరించారు. ఒక మహామనీషి సాన్నిధ్యంలో గురుభావంతోనూ సంపూర్ణ సమర్పణ భావంతోనూ, ఉన్న వ్యక్తులకున్నూ, అధ్యయన పరిశీలనల ఉద్దేశంతో ఆశ్రమవాసం చేస్తూ తాము తలపెట్టిన రాజకీయ కార్యక్రమాన్ని కాపాడుకుంటూ ఉండిన కార్యకర్తలకూ మధ్య తేడాని వివరించారు. అహింసను గురించి ఆ రోజుల్లో విద్యార్థుల్లోనూ యువకుల్లోనూ మేధావుల్లోనూ నిరంతరం చర్చలు జరుగుతుండేవి. ఒకవైపు అత్యంత సాహసోపేతమైన హింసాయుత కార్యక్రమాలు దేశ స్వాతంత్ర్యం కొరకు సాగించిన భగత్‌సింగు వంటి వీరుల గాథలు విని పులకించని యువకుడు లేడు. మరోవైపు గాంధీగారి ప్రేరణతో లక్షలాది సంఖ్యలో ప్రజావాహిని కదలి ప్రపంచంలో ఆనాటి వరకెన్నడూ కనీ విని యెరుగని అహింసాయుత మహోద్యమాన్ని నడిపిస్తుంటే దాని మహిమను కళ్ళారా చూస్తూ, దానిలో పాల్గొంటూ, ఈ నూతన మార్గంలోని గుప్తపటిమ (Potential) ను అంచనా వేసుకుంటున్న కార్యకర్తల ఆశ్చర్యోత్సాహాలు మరువరానివి. తుపాకి గుండ్లకు నిర్భయంగా ఎదురు నిలచిన మహానాయకుల దేశప్రేమ బ్రిటిష్ ప్రభుత్వాన్ని కంపింపజేసిన సందర్భాలు నేటికీ గగుర్పాటు కలిగిస్తాయి. ఉభయ పక్షాలనూ రాజలింగంగారు ఈ పుస్తకంలో అభివర్ణించారు.

గాంధీమహాత్ముని సర్వతోముఖ కార్యక్రమం కార్యకర్తలనందరినీ ఏదో ఒక నిర్మాణపంథాలో నిడిపిస్తూ రాజకీయోద్యమంతో పాటు నిర్మాణకార్యక్రమాన్ని జోడించి వారి సమగ్ర వ్యక్తిత్వ వికాసానికి దోహదం చేసింది. నిష్క్రియత్వ ప్రమాదాన్ని పదే పదే తప్పించింది. ఏ ఒక్క ఉద్యమాన్నీ దీర్ఘకాలం వరకు నడపడం సాధ్యపడదు. సముద్రంలో కెరటాలకు వలే ఆటూ

పోటూ ఉండక తప్పదు. అందుకని రెండు ఉద్యమాల మధ్య మానసికంగా ఎడం(gap) రాకుండా దేశసేవాశృంఖలను అవిచ్ఛిన్నంగా సంఘటితపరచారు గాంధీజీ.

ఏ ఉద్యమంలోనూ నియమహీనతనూ క్రమశిక్షణ రాహిత్యాన్నీ గాంధీజీ సహించలేదు. యుద్ధంలో సేనానాయకుని ఆదేశాన్ని ధిక్కరిస్తే పరాభవం తప్ప మిగిలేదేమిటి? దేశమంతటా మహోత్తేజాన్ని కలిగించిన సత్యాగ్రహోత్యమాన్ని, చౌరీచౌరా వంటి ఒక్క హింసోదంతం ఆధారంగా క్షణమాత్రంలో ఉపసంహరించి, ఉద్యమాలు ప్రారంభించడం మాత్రమేకాని ఆపడమెలాగో తెలియని నాయకులనేకులకు గాంధీజీ నాయకత్వ పద్ధతిని చూపించారు. దైనందిన సంఘటనల ద్వారా ఈ నియమబద్ధతను ఆశ్రమ జీవితంలో ఎలా పాటించింది రాజలింగంగారు చాలా బాగా వర్ణించారు. ఉద్యమాల చరిత్రలో గాంధీజీ అచంచల నాయకత్వం అద్వితీయమైనది.

గాంధీజీ తమ అనన్య శైలిలో కొన్ని చిరస్మరమీయ సూత్రాలు చెప్పారు:-

1. నా జీవిత ప్రణాళికలో లొంగిపోవడానికి అసలే తావులేదు
2. శిక్షించే అధికారం లేచిచోట క్షమ ఒక విడంబన మాత్రమే
3. అహింసా విధానమనేది బహునెమ్మదిగా పెరిగే వృక్షం వంటిది. అది అదృశ్యంగా ఐనప్పటికీ నిశ్చయంగా పెరుగుతుంది.
4. స్వదేశీ నియమంలో స్వార్థం ఉండదు. వ్యక్తిగత స్వార్థాన్ని కుటుంబంకోసం, కుటుంబాన్ని గ్రామంకోసం, గ్రామాన్ని దేశంకోసం, దేశాన్ని మానవత కోసం త్యాగంచేసే లక్షణం అలవడుతుంది. (వ్యక్తి జీవితంలో తటస్థించే ఈ ఏకకేంద్ర వలయాలు Concentric cricles మధ్య ఉత్తరోత్తర సమన్వయాన్ని ఇంతకన్న సులభంగానూ సుందరంగానూ వర్ణించడం అశక్యమనుకుంటాను.)

మనం తరచూ వింటుండే అహింసా, సత్యమస్తేయం, మొదలైన ఏకాదశ సేవలను గురించి రాజలింగంగారు చక్కగా వివరించారు. భారతీయ సంస్కృతిలో నిహితమైయున్న అనేక భావాలను అతి సులభమైన శైలిలో చెప్పారు. ఈ చిన్ని పుస్తకంలో స్పృశించిన అంశాలను లెక్కవేస్తే ఇదొక మహాగ్రంథమనిపిస్తుంది. దీని వెనుక అదృశ్యంగా నిలిచిన తదేక దీక్ష, కృషి, చింతన, నేను కొంతవరకు ఊహించుకోగలిగాను. రాజలింగంగారికి నా నమస్సులు. ఆనాడు ఆశ్రమంలో నివసించిన అన క మహనీయులను గురించి రాజలింగంగారు సంక్షిప్తంగా ఉల్లేఖించారు. వారిలో కొందరితో నాకు కూడ కొద్దిపాటి పరిచయం కలిగింది. నేను పూనాలో

చదువుకుంటున్నప్పుడు ఒకనాడు మా ప్రొఫెసర్‌గారు తమ వద్దకు అతిథిగా వచ్చిన ప్రొఫెసర్ భన్సాలీ గారితో నా పరిచయం చేశారు. భన్సాలీ గారి అద్భుత పరిజ్ఞానం ఆ కొద్ది సమయంలోనే నన్ను ముగ్ధుణ్ణి చేసింది. భన్సాలీగారు వెళ్ళిపోయిన తరువాత ఆయనను గురించి ప్రస్తావిస్తూ మా ప్రొఫెసర్ దేశపాండే గారు – నా జీవితంలో ఇంతటి గట్టి పట్టుదలగల మరోమనిషిని నేను చూడలేదు – అన్నారు. దీనికొక స్వానుభవాన్ని చెబుతూ – ఒకప్పుడు మేమిద్దరం ఒకేచోట ఉండేవారం. భన్సాలీగారికి ఫ్రెంచి బాగా వస్తుంది. ఒకనాడు మాటవరకసు నాకు ఫ్రెంచ్ నేర్చుకోవాలని ఉంది, అన్నాను. తక్షణం నాకు ఫ్రెంచ్ నేర్పడానికి అంగీకరిస్తూ ఎప్పుడు ప్రారంభిద్దాం? అని ఆయన నా వెంటపడ్డారు. నోరు జారినందుకు కాస్త పశ్చాత్తాప పడుతూ, నా పని దృష్ట్యా నాకు సమయం దొరకదేమో, తెల్లవారు ఝూము నుంచి తీరకే లేదాయె, అని గొణిగాను. దానికేముంది? నేనే మీవద్దకు తెల్లవారుఝూము 4 గంటలకు వస్తాను. అని ఆయన ప్రకటించారు. ఆ ఫ్రెంచి భాషాభ్యసనం నుంచి తప్పించుకొని బయట పడడం గగనమైంది – అని వివరించారు. గాంధీ ఆశ్రమ వాసులందరూ ఇలాంటి ఘటికులే –– గాంధీ గారే వారిలో ప్రథములు.

అన్నిటికన్న ముఖ్యమైన విషయమేమంటే నావంటి పాత కార్యకర్తలెందరిలోనో వయసు రీత్యా "యాదమరపుకు" గురైపోయిన అనేక స్మరణీయ ఘట్టాలు నిన్ననో మొన్ననో జరిగాయా అన్నంత తాజాగా గుర్తు చేసినందుకు ఆ తరంవారు రాజలింగంగారికి తప్పక కృతజ్ఞులై ఉంటారు. వారికి మరొకమారు నా కృతజ్ఞతాభివందనములు సమర్పిస్తున్నాను. సెలవు.

జై హింద్.

– తోటి సహచరుడు,

పి. వి. నరసింహారావు.

మాజీ ప్రధానమంత్రి

9, మోతీలాల్ నెహ్రూ మార్గ్

న్యూ ఢిల్లీ

# శివోరక్షతం

ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు అయిన శ్రీ యం. యస్. రాజలింగం గార్కి-

మీరు నాయందలి ప్రేమ గౌరవ భావంతో పంపినా, మీచే రచించబడినట్టియు, బాపు నేను- అనే గ్రంధమును సాఫల్యంగా చదువజాలక పోయినందులకు క్షంతవ్యుడను. నేను స్వయంగా చదువుటకు నా దృష్టి క్షీణించినందువల్లనూ, నాకు అనుకూలమైన సమయమున చదివి వినిపించేవారు దొరకనందు వల్లనూ, నా కొడుకు కుమారుని వివాహపు పనుల వత్తిడి వల్లనూ, నా యొక్క నూటవ జన్మదినపు కార్యక్రమము యొక్క హడావిడి వల్లనూ అప్పుడప్పుడు మాత్రమే చదివించి వినగలిగినాను. అందులకు నన్ను మన్నించగోరెదను. దాదాపు సగం మాత్రమం వరకు వినుట జరిగింది. శైలి చాలా రసవత్తరంగానూ, ఆకర్షణీయంగానూ, చక్కని సులభశైలిలోను వుండినది. మీరు అటువంటి భాషలో, అంతటి మనోహరంగా శక్తి కలిగి వున్నారనే విషయము నాకు కలిగి చాలా చంతోషించాను.

మీరు మహాత్మాగాంధీగారి ఉద్బోదలకు ఆకర్షితులై, మీ విద్యార్థి దశలో, అప్పటి నిజాం రాష్ట్రంలో స్వామి రామానంద తీర్ధ గారి శిష్యులైన కారణంగా, మీపైన పోలీసు నిఘా పట్టిన కారణంచే, ఆ నిఘానుంచి తప్పించుకొనిపోయిన విధమును గమనించినచో అత్యాశ్చర్యముగా వున్నది. పూర్వము దేశప్రముఖ నాయకుడైన శ్రీ సుభాష్ చంద్రబోసుగారు అప్పటి భారతదేశ పాలకులైన బ్రిటీషువారి నిఘానుంచి తప్పించుకొని ఇండియా బయటకు పోయిన విధమును తలపింపజేయుచున్నది. మీ పిన్నవయస్సులో, మీ చేతిలో పైసా కూడా లేకుండా యీ సాహసకృత్యం చేయుట ఏంత ఆశ్చర్యకరము! మీరక్కడ చేరినచోటు ఎంతమాత్రం పరిచయమైనది కాదు. అక్కడ ఒక వ్యక్తిని కలిసి తన విషయమును అతనికి విన్నవించి, తన జీవనమునకు కావలసిన పనిని చూపించవలసిందిగా కోరిన మీదట, ఆయన ఒక వ్యక్తికి పరిచయం చేసినాడు. ఆ వ్యక్తి అక్కడ వున్న గోసేవ సంఘంలో పనిచేస్తున్నటువంటి ఒక పెద్దమనిషి. ఆయన ఈ పిన్న వయస్కుడు గోసేవ సంఘంలో పనిచేస్తే మంచిదని చెప్పినాడు. అందు మీద, అక్కడ పనిచేయు కాలంలో ఆ వ్యక్తి వీరియొక్క పనితీరుని మెచ్చికాబోలు, ఆ సంఘంలో సేవచేయుచున్నట్టియు, మహాత్మగాంధీగారి శిష్యుడైనట్టియు ప్రభాకర్‌జీకి పరిచయం చేసినారు. ప్రభాకర్‌జీ మహాత్మునికి ప్రియ శిష్యులలో ఒకరు. ప్రభాకర్‌జీకి వీరు సన్నిహితులై, మహాత్ముని ఆశ్రమంలో పనిచేయుచు, మహాత్ముని ప్రార్థనా సమయంలో, వారి సానిన్ధ్యంలో, వారి బోధనలచే మిక్కిలి ఆకర్షితులైనారు. వారి బోధనలవల్ల అహింస సిద్ధాంతాలను గూర్చిన సందేహాలన్నీ పటాపంచలైనాయి.

ఆశ్రమంలో వీరున్న సమయంలో ఒక విచిత్రమైన సంఘటన జరిగింది. ఒక గోమాత ప్రసవించలేక చాలా బాధపడుచుండెను. ఆశ్రమవాసులు కొందరు సమీపంలో వున్న పశువైద్యుని తీసుకువచ్చి చూపించినారు. ఆ వైద్యుడు ఆ గోవుకు పొట్టకోసి, శిశువును చంపి బయటకు లాగివేస్తే తప్ప తల్లి జీవించదని స్పష్టమైన అభిప్రాయం చెప్పారు. ఈ సంగతిని మహాత్మునికి చెప్పగా, ఆయన అహింస సిద్ధాంతానికి ఒక పరీక్ష ఏర్పడింది. ఆయన దీర్ఘంగా ఆలోచించినారు. ఇట్టి సమయంలో కొంతసేపు ఆయన దీర్ఘాలోచనలో నిమగ్నుడై ఒక నిర్ణయానికి వచ్చినారు. పెద్దప్రాణం కాపాడటానికి చిన్నప్రాణం యొక్క హింస అహింస సిద్ధాంతానికి అది విరుద్ధం కాదు, అనే సిద్ధాంతానికి వచ్చినారు. ఈ విషయంపై రాజలింగంగారికి సంశయ విచ్ఛిత్తి అయినది. అప్పటినుంచి అహింస సిద్ధాంతం మీద వీరికి సంశయాలు తొలగినవి. ఈ విధంగా మహాత్ముని ఆశ్రమంలో వున్న కాలంలో ఆయన యొక్క ప్రభోదములు చాలా విని ఆయన పుణ్యాత్ముడైనాడని నా అభిప్రాయం. చదువుతుంటే శరీరం జల్లుమన్నది. ఇది మీ పూర్వ జన్మ పుణ్య విశేషం. మీరు ధన్యులు.

తరువాత మీరు భారతదేశ స్వాతంత్ర్య సంగ్రామంలో వహించిన పాత్రయును, కాంగ్రేస్ సంఘంలో నెరవేర్చిన పాత్రయును, చేసిన సేవయును భారత పౌరులకు తెలిసినవే కదా! మీరు సర్వదా ధన్యాత్ములు.

అభివందనములతో,

కా. పూర్ణమల్లికార్జునుడు.

ఎక్స్. ఎం.పి.

**Dr. C. RANGARAJAN**



GOVERNOR
ANDHRA PRADESH

RAJ BHAVAN
HYDERABAD-500 041

August 28, 2000.

Dear Shri Rajalingam,

Many thanks for sending me a copy of your Telugu book "Bapu and Nenu". I have read the opinion given in English by Prof. I.V.Chalapati Rao. From the English introduction, I am able to gather how closely you were associated with Gandhiji not only in the freedom struggle but also in several aspects of social reforms initiated by Gandhiji. In that sense, Gandhi was not only a political leader but a philosopher. We need more of such writings, since there is an urgent need that the teachings of Gandhi need to sink into our conscience. I congratulate you on your writing which you have been able to do despite your age.

With regards,

Yours sincerely,

C Rangarajan

**(C. Rangarajan)**

Shri M.S.Rajalingam,
Former Minister,
Lalitha Bhavan,
H.No: 1-1-336/18,
Chikkadpally,
Hyderabad – 500 020.

# విషయ సూచిక

# A Glimpse

Shri M.S.Rajalingam is the President of the Freedom Fighters Organisation of Andhra Pradesh and formerly a Minister of P.W.D. and Labour. As a Gandhian, he has an ardent desire to share his experiences concerning Gandhiji's life and teachings when he lived close to him in Sevagram Ashram. As an Octogenarian he goes down the memory lane and recollects those good old days when he along with like-souled patriots forsook higher studies and comfortable life to join the freedom movement under the leadershiup of Gandhiji. He has written this book in the hope that it will influence and inspire the younger generation of today so tht they may realise Gandhiji's greatness and lead useful and value-based lives and serve our mother land. It is pre-eminently proper that the title of this semi-autobiographical book is "Bapu and I" (Bapu - Nenu).

To grasp the full import of this book, to realise its value and know how far away we have drifted from Gandhiji's hopes and expectations, we have to assess the current state of affairs. Gandhiji, the Father of the Nation, used to say that Independence should lead not only to political freedom but also to social equality and economic justice. He believed in the goal of education and health for all and empowerment of the poor and the under dog. We too dreamed that the millennium was round the corner and Independence would usher in the long-looked for Golden Age. Unfortunately India still remained poor inspite of the availability of all the resources required for progress and prosperity - man power, capital, natural wealth, science and technology.

It is all the more deplorable that after 53 years of Independence we are lagging behind even small countries like Korea, Vietnam, Taiwan and Singapore. Apart from unchecked population boom, deep-rooted corruption is one of the evils eating into the vitals of our nation. We have drastically deviated from the path of Gndhiji, Lal Bahadur Sastry and Vinoba Bhave who had led simple lives, practiced Truth and Non-Violence and set a shining example in personal rectitude. Never before in history scams and scandals of such magnitude rocked our nation as those we witnessed during the recent years. The rise of common criminals in political life causes no surprise in the present context of value inversions.

During the last five decades our nation was hijacked into a culture of consumerism comonly known as Five-Star Hotel culture. Contractors,

middle men, scamsters and Wheeler-dealers had a gay time. Opportunistic and unscrupulous politicians climbed to the total pole of power and amassed wealth beyond known resources and their siblings enjoyed unearned privileages. Today our culture leaders are matiny idols of the celluloid and show-biz world.

It is in this context that we appreciate the value of the lives of freedom-fighters like Sri Rajalingam who in his twenty second year plunged into the non-violent struggle for independence and the practice of Gandhian principles by joining the service camps in Wardha and Sevagram. He had to wear a disguise to go to Wardha without attracting the notice of the police. He met Swami Ramanand Tirtha, a well-known freedom-fighter who gave him a letter of introduction to some one in Wardha. He had to get on with a scholarship of Rs.10 per month from Bajaj Trust. His training in J.C.Kumarappa's Rural School and Parnikar's Diary farm gave him knowledge of constructive work, rural economies and Gandhinan concept of Decentralisation. Earlier as a boy he was influenced by the stories about revolutionary heroes like Bhagat Singh, Dutt, Sukh Dev, Raj Guru and Vir Savarkar. Now he was directly under the spell of Gandhiji's non-violence and constructive programmes.

Sri Rajalingam's experiences in Wardha and Sevagram Ashram will have educative value to the student. He could get an opportunity to come in touch with great national leaders like Jawaharlal Nehru, Satyagrahis like Vinobha Bhave and selfless workers like Prabhakarji. He served and tended the cows, choose a hut for his dwelling place, lived with the so-called 'untouchables', ate a meagre meal and slept a semi-sleep. It was a period of hard training which ushered him into closer contact with Gandhiji and Kasturba. He even did long-hand writing for pyarelal who had to draft important letters for Gandhiji. Although he followed Gandhiji implicitly, he maintained his individuality. In a true spirit of service he cheerfully did even street sweeping, scavenging and massageing of the lepors. In fact, Sri Rajalingam's own life should be a lesson to the younger generation. As Gandhiji said, service is true religion and cleanliness is godliness. Service to man is service to God.

In a simple language Sri Rajalingam explains the profundities of Gandhian philosophy and ethics - the meaning of prayer, the significance of fasting, truth, no-violence, non-possession, trusteeship concept, balanced diet, Brahmacharya, Naturopathy, Khadi, Swadeshi, Village sanitation, equality of all religions, respect for all castes and communities, vow of silence, love of God etc. As these are abstract concepts for children to

understand, Sri.Rajalingam quoted instances, incidents and experiences to illustrate them. In support of his statements the author quoted extract, from 'Young India', 'Harijan' etc. He proved that Gandhiji was not always rigid in his thinking. His common sense solutions to intricae and intractable problems often brought to light his inherent qualities of Compassion, imagination and humanity. He always tried to choose the right man for the right job. For example, he selected Vinoba Bhave as the first person for Individual Satyagraha, although Jawaharlal Nehru was his blue-eyed boy !

Some of the chapters are characterised by wit, wisdom and humour etc., Snake in Kasturba's Kitchen, Kala Venkat Rao's complaint against Tanguturi Prakasam, and 'Businessmen are Businessmen' (Hotel Keeper Fateh Singh's behaviour) and Pyarelal's Dictation assignment are a few examples. There is poignancy in some of the parting scenes, especially when Shri Rajalingam had to leave the Ashram to return home with Mrs. Rajalingam. Gandhiji, Kasturba, Prabhakarji and many others tried to dissuade him from carrying out his decision but they could not change his decision. Against the advice of the elders he started a Khadi camp at Mustabad. Subsequently he joined the Quit India Movement in response to the clarion call of Gandhiji.

All things considered, the book "Bapu and I" is a blend of the author's own experiences and the fundamentals and essentials of Gandhiji's teachings. The reader will find miniature portraits of leaders and remarkable persons like Gandhiji, Kasturba, Jawaharlal Nehru, Vinoba Bhave, Prabhakarji, J.C.Kumarappa, Parnikarji, Principal Turner etal.

The principles of Gandhian philosophy are presented in a simple, conversational Telugu to suit the level of comprehension of young readers. The way Gandhiji practiced those precepts is represented in the form of incidents and experiences so as to motivate the readers in the right direction. The book is chapterised into short units to make them pleasant reading. The author makes the servious subject interesting so that we realise that there are no uninteresting subjects but only ininteresting writers !

The book deserves to be on the shelves of all libraries and prescribed as a text book for students.

B4/F10-HIG,
Baghlingampally
Hyderabad.
Phone : 7664682.

**I.V. CHALAPATI RAO**

Editor, "TRIVENI"

# OPINION

*I have read the book "Bapu and I" written by Sri Rajalingam the renowned freedom fighter, President of the Freedom Fighters Organisation and Former Minister in the Andhra Pradesh Government. His biography deals with his intimate association with Mahatma Gandhi. He came in touch also with great persons like Jawaharlal Nehru and Swami Ramananda Tirtha. Following Gandhiji's ideals he did scavenging and massaging of lepers in the true spirit of our ancients " మానవ సేవే మాధవ సేవ". He deals with Gandhiji's philosophy in simple style and makes it look as if it is easy to follow if only one has the will to do so. The book makes very interesting reading. In these days we see eruption of violence every where, and corruption rampant among ministers, MPs and MLAs and bureaucrats. During these fifty years we have forgotten Gandhiji. The older generation has let us down badly. Still I feel, as in the churning of the Ksheera Sagara, when poison emerged first and then only nectar, truth and non-violence will come out victorious in the end. The hope for the future is in the youth. Our Younger generation must be taught the evils of violence and the value of truth and non-violence and the value of truth and non-violence. They must be taught the virtue of simple living and high thinking. In this effort Sri Rajalingam's book "Bapu and I" will be a valuable tool. It must find a place in libraries in every village, town and city and young students in schools and colleges must be encouraged to read this book. Sri Rajalingam deserves the praise of every one who is interested in the future of this country for his valuable work.*

*Hyderabad - 29.*
*Phone : 7664688*

***Alladi Kuppuswami***
*Former Chief Justice, A.P.( Retd. )*

# మహోపకారం

*" My Self and Gandhi "* అన్న పుస్తకము మీరు దయతో పంపినారు. గాంధీగారితో మీరు కలసి సేవాగ్రాంలో, ముఖ్యముగా అచ్చుట న్యాయవాద బృందములతో కలసి పలు అను భవములు గడించి వున్న విషయము ఈ పుస్తకము ద్వారా తెలిసినది. మీ ఉత్కృష్టమయినటువంటి అనుభవములు మమ్ములను ఎంతగానో ఆకట్టుకున్నది. మీరు రాసినటువంటి విషయములు ముఖ్యముగా పాఠకులను స్పందింప చేయడమే గాక ఆకాలపు అనగా స్వాతంత్రోద్యపు అనుభవములన కనులపండుగగా మనకు తెలియచేయబడుట వలన పాఠకులందరికి ఈ పుస్తకము చాలా ఉపయుక్తము కాగలదు. మీ పుస్తకము యొక్క ఇతివృత్తము రాను రాను స్మృతి పథము నుంచి దూరమగు ప్రమాదము ఎంతైనను కలదు. స్వాతంత్రోద్యమ చరిత్ర మెల్లి మెల్లిగా చాలామంది భారతీయుల స్మృతి నుంచి తప్పుకోగల సూచనెంతైననూ వుంది. ముఖ్యముగా ఈ ఆధునిక రాజకీయ వత్తిడిలలో గాంధీగారి త్యాగశీలతగాని, ఆనాటి స్వాతంత్రవీరుల ఘనతగాని, వారు ఆనాడు దేశమునకు చేసినటువంటి అపారసేవ గాని మరువడానికి వీలులేనిది.

శ్రీరాజలింగముగారు రాసినటువంటి ఈ పుస్తకములోని సాతంత్రపు విలువలు ఎంతైనా ఉగ్గడింప తగినవి. ఈ పుస్తకము అచ్చువేసి పాఠకులోకానికి అందించుటలో ఆ పుస్తక ప్రచురణ కర్తలను ప్రశంసించవలసి వున్నది. వారికి నా హృదయ పూర్వకమైనటువంటి అభినందనలు ఈ పుస్తకం వ్రాయుటలో వారు చేసిన మహోపకారము మరువజాము.

**పి. వెంకట రమణ**
అడ్వకేట్ - జనరల్
ఆం. ప్ర. హైకోర్టు

హైదరాబాద్
18-4-2000.

# అభినందన

గాంధీజీ అక్షరాలా యుగపురుషుడు. సత్యాహింసలు ఆయుధాలుగా స్వాతంత్ర్య సంగ్రామం జరిపిన కర్మయోగి. గాంధీజీని చూసిన వాళ్ళు, ఆయనతో కలిసి పనిచేసిన వాళ్ళు ధన్యులు. ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు శ్రీ ఎం.ఎస్. రాజలింగంగారికి 1941 ప్రాంతంలో ఆ ధన్యత కలిగింది.

కళాశాల విద్యాభ్యాసం కాగానే బాపూజీ నీడలో జరుగుతున్న సర్వోదయ మహాయాగంలో పాల్గొనడానికి పయనమయ్యారు రాజలింగంగారు. సేవాగ్రాంలో బాపూజీ నోట తన పేరు పలికిన అమృత సన్నివేశం ఏర్పడింది. అదీ వేపాకు ప్రసాద ఫలితంగా. ఇలాంటి ఘట్టాలెన్నో ఈ పుస్తకంలో పొందుపరిచారు రాజలింగంగారు. బాపూజీ సేవాంకిత జీవన రేఖలతోపాటు సమకాలీన రాజకీయ చిత్రపటాన్ని ఈ గ్రంథంలో గీసి చూపారు. ఎన్నెన్నో ఆసక్తికరమైన అంశాలు ఈ గ్రంథంలో చోటు చేసుకున్నాయి. సేవాగ్రాంలో ప్రవేశించిన పామును ప్రభాకర్‌జీ చూపిస్తే, బాపూజీ, 'సాంప్ బహుత్ సుందర్ హై' అంటూ సాగిపోయిన దృశ్యం ఆ మహావ్యక్తి సమున్నతికి నిదర్శనం. ఇలా ఎన్నెన్నో పార్శ్వాలు మన ముందుంచారు ఎం.ఎస్. రాజలింగంగారు. ఈ పుస్తకంలో వున్నవి వారి ప్రత్యక్ష అనుభవాలు. అయినా ఇవి ఆ తరం వారికి జ్ఞాపికలు, ఈ తరంవారికి మార్గ సూచికలు. మంచి గ్రంథం రచించిన శ్రీ ఎం.ఎస్. రాజలింగంగారిని మనసారా అభినందిస్తున్నాను.

కళాభవన్,
హైదరాబాద్ - 500 004.
ఫోన్ : 272832

**డా. సి. నారాయణరెడ్డి.** జ్ఞానపీఠ అవార్డు గ్రహీత
అధ్యక్షులు,
ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర సాంస్కృతిక మండలి,

# గురువాణి

నేను , నా సహాధ్యాయులు దేవరకొండ శ్రీ పురుషోత్తం, పరిటాల సుబ్బారావు, పహిల్వాన్ రామారావు మొదలైన వాళ్ళం హనుమకొండ హైస్కూల్లో చదువుతున్న దినాలవి. ఆర్యసమాజం, ఆంధ్ర మహాసభ, కాంగ్రెసు పెద్దల సమావేశాలకు ఉపన్యాసాలకు కలిసి పోయేవాళ్ళం. కాళోజీ నారాయణరావు, హయగ్రీవాచార్యులు, మధుసూదనరావు, సత్యనారాయణ ఆనాటి యువ నాయకులు. వారికి తోడుగా అప్పుడప్పుడే మహాత్మాగాంధీగారి సేవాగ్రాంలో శిక్షితులై వరంగల్లుకు తిరిగి వచ్చిన యువకులు ఎం.ఎస్. రాజలింగంగారి అందమైన ఆకారం, నిర్భీకత, విద్యాధికత, సేవాతత్పరత, ఉపన్యాసధోరణి వంటి మేలి గుణాలు మాతరం విద్యార్థులను బాగా ఆకట్టుకున్నవి. శ్రీ రాజలింగంగారు సేవాగ్రాంలో మహాత్మాగాంధీగారితో ఆయన అనుచరులతో కలసిమెలసి ఉండి పండించుకున్న అనుభవాల పంట తరతరాలకు తరగని రాశి. వారు ఆనాడే మాకు కొన్ని సంఘటనలు, అనుభవాలు వినిపించి సదాశయ ప్రేరణ దాతలైనారు. ఇప్పుడు వాటిని నేటి బాలబాలికల కోసం తేటతెలుగు మాటల్లో 'బాపూ-నేను' అనే గ్రంథంగా ప్రచురిస్తున్నారు.

ఈ గ్రంథంలోని అనుభవాలు సంఘటనలు, వాటిని వివరించే మాటలు లోతుగా తరచిచూస్తే ఉపనిషత్తుల్లోని గీతాది శాస్త్రాల్లోని మాటలంత గురువుగాను, బరువుగాను ఉంటవి. ఈ గ్రంథం బాలబాలికలకే కాదు వయోవృద్ధులకు కూడా ఉపాదేయం. శ్రీ రాజలింగంగారు మాకు గురుపుత్రులు. వారి తండ్రిగారు ముదిగొండ వీరేశలింగ శాస్త్రిగారు హనుమకొండలో మాకు తెలుగు సంస్కృతాలు నేర్పిన గురువులు. శ్రీరాజ లింగంగారు రాజకీయ పాఠాలు నేర్పిన గురువులు. ''బాపూ-నేను'' అనే ఈ పుస్తకం యాభై అరవై యేండ్ల క్రింద జాతీయనాయకులు మన కందించిన జీవన మూల్యాల 'గురువాణి'. ఈనాటి తరం వారికి జీవనమూల్యాల మధనానికి ఉద్బోధకము, ప్రేరకము ఈ 'గురువాణి'.

1-8-117/2
చిక్కడపల్లి
హైదరాబాదు-500 020.
ఫోన్ : 7661034

డా. బి. రామరాజు
నేషనల్ రిసెర్చి ప్రొఫెసర్.

మీరు నాపై వున్న ప్రేమాభిమానాలతో పంపిన మీ అనుభవాల ప్రతి అంది ఆనందించినాను. మీకు నాపై ఉన్న సౌజన్యానికి ధన్యవాదములు.

ఈ పని మీరెప్పుడో చేయవలసింది. ఆలస్యంగానైనా చేస్తున్నందులకు సంతోషిస్తున్నాను. అంతేకాక మీ అనుభవాల్ని కేవలం వార్ధా, సేవాగ్రాం వరకే పరిమితం చేయకుండా మొత్తం స్వాతంత్ర్య సంగ్రామంలో ఇతర కార్యక్రమాల్లో మీరు గడించిన అనుభవాలని, అనుభూతులను, మీ కళ్లముందు జరిగిన సన్నివేశాలను, సంఘటలను అక్షరబద్ధం చేయవలసిన అవసరం ఉన్నదని భావిస్తున్నాను. మీరు స్వతహాగా మంచి రచయితలు కనుక ఆ పని మీరు సులువుగా నెరవేర్చగలరు. అదొక విధంగా నిజాం రాష్ట్రాంధ్ర ప్రజల చరిత్ర అవుతుంది. తెలంగాణా ప్రజల స్థితిగతులు తెలియవస్తాయి. సుమారు 45 సంవత్సరాల క్రితం స్వర్గీయ శ్రీ పెండ్యాల చినరాఘవరావు (టీచర్) గారు మీ 'అహింస' అనే గ్రంథాన్ని నాకిచ్చారు. అది ఎంతో ఆసక్తికరంగా వుంది. కనుక మీ జీవితంలోని ప్రధాన ఘట్టాలను, శిర్యమాలను, స్వాతంత్ర్యోద్యమ చరిత్రనూ వివరిస్తూ ఒక విపులమైన గ్రంథం రచించవలసిందిగా కోరుతున్నాను.

'బాపు-నేను' గ్రంథం నేను వార్ధా గ్రామీణ విశ్వవిద్యాలయంలోను, సేవాగ్రాంలోను జరిగిన అనుభవాల్ని, బాపూజీతో మీకు కలిగిన అనుబంధాల్నీ, ఇతర ప్రముఖులతో మీకు గల సాన్నిహిత్యాన్ని అత్యంత ఆసక్తిదాయకంగా వివరించారు. పాఠకుల కెన్నో కొత్త విషయాలు తెలియవస్తున్నారు. మీరు సేవాగ్రాంను వదిలిపెట్టి వచ్చిన సన్నివేశం కూడ చాలా ఆశ్చర్యాన్ని గలిగిస్తుంది. బాపూజీ ఆశయం ఆదర్శాలు ఈ చిన్ని గ్రంథంలో చాలావరకు ప్రతిబింబిస్తున్నారు. వార్దా గ్రామీణ విశ్వవిద్యాలయం, సేవాగ్రాంల కార్యకలాపాలు గూర్చి ఒక అవగాహన కలుగుతున్నది.

ఇది మంచి ప్రయత్నం. ఆసక్తికరమైన ఈ పుస్తకం నేటి యువతరానికి ఎంతో అవసరమైనది.

1-8-126, మిథిలానగర్,
హనుమకొండ - 506 001.
ఫోన్ : 78392

డా. పేర్వారం జగన్నాథం
మాజీ వైస్ ఛాన్సలర్
తెలుగు యూనివర్శిటి

# ఎం.ఎస్. ద్వారా బాపు

ఇప్పటి వారికి అవన్నీ పాతసినిమా కథలు. అనుభవంలో లేనివి. విన్నవి కూడా కాదు. కాని అప్పటి వారి త్యాగాల ఫలితాన్ని మనం ఇప్పుడనుభవిస్తున్న స్వాతంత్ర్యం అని ఒకసారి గుర్తు చేసుకోకతప్పదు. ఆనాటి స్వాతంత్ర్య వారసత్వానికి ఉజ్వల, సజీవ నిదర్శనం ఎం.ఎస్. రాజలింగంగారు.

ఎం.ఎస్. రాజలింగం గారి 'బాపు-నేను' గ్రంథాన్ని చదువుతుంటే అలనాటి సంగతులన్నీ దొంతరలు దొంతరలుగా ఎదురొచ్చినట్లనిపించింది. తాను యువకుడిగా వున్నప్పుడు ఇక్కడ్నించి వార్ధాకు వెళ్ళిపోయినప్పటి నుంచి చాలా విషయాలనే ఆయన ఇందులో రాశారు. ఎక్కువభాగం బాపూజీ సన్నిధిలో సేవాగ్రాంలో ఎం.ఎస్. గడిపిన ఆశ్రమవాసం ఇందులో ఉంది. ఎం.ఎస్. 1941లో వార్ధాలో జరిగిన అఖిల భారత కాంగ్రెస్ కార్యవర్గసమావేశంలో మొదిసారిగా జవహర్‌లాల్ నెహ్రూను చూశారు. దేశ స్వాతంత్ర్యం కోసం శాంతియుత పోరాటాన్ని, సాయుధ పోరాటాన్ని రెంటినీ చూశారు. వీరయోధుల త్యాగాలకు వివశుడైన తాను ఆమార్గంపట్ల మొగ్గటం సరైనదా? మరోవైపు గాంధీజీ చూపిన సత్యాహింసా మార్గమే శరణ్యమా! సంఘర్షణ పడ్డారు. గాంధీజీ మార్గాన్ని శాశ్వతమని నమ్మారు. వార్ధాలో వినోబాభావే జైలులో ఉండగా తన అనుచరులతో ఆయనను చూపించమని ఆందోళన జరిపారు. కస్తూరిబా వచ్చిసముదాయించారు. ఆ తర్వాత ఎం.ఎస్. సేవాగ్రాం చేరుకున్నారు. సేవాగ్రాంలో గాంధీజీకి అత్యంత సన్నిహితంగా కఠోర జీవితం గడిపారు. ఆవిధంగా గాంధీజీ దృష్టిలో పడ్డారు. అక్కడ తన పనితనాన్ని మెచ్చి అఖిల భారత గోసేవా సంఘం, బజాజ్ వారిచ్చిన 10 రూపాయల ఉపకారవేతనాన్ని సైతం సేవాగ్రాంకు సమర్పించిన నిస్వార్థజీవి ఎం.ఎస్.

ఇలా ఆనాటి చరిత్రకు సంబంధించిన అనేక విషయాలను ఆయన ఈ గ్రంథరూపంలో అందిస్తున్నారు. గాంధీజీని చాలా సన్నిహితంగా చూసి అందరికి ఆచరణయోగ్యమైన విషయాన్ని మనకు అందించారు. ఒకసారి కస్తూరిబా వంట

చేస్తున్నప్పుడు పొయ్యి దగ్గర పాము వచ్చింది. ఆమె భయపడకుండా కుండలో పాము దూరడం చూసి మూత పెట్టేసింది. అహింసామూర్తి గాంధీజీ నివసించే చోట విషసర్పాన్నైనా చంపవచ్చునా, చంపక అలాగే వదిలిపెడితే ఎలా? ఇటువంటి సంకటస్థితిని సేవాగ్రాం వాసులెదుర్కొన్నారు. చివరికి ఆపామును గాంధీజీకి సమీపంలో వుంచి చూశారు. ఆయన 'పాము సుందరంగా ఉంది' అన్నారు. ఆ తర్వాత దానికి పాలు పోసి పెంచారు. ఆపాలు పోసే వ్యక్తికే చివరికి ఓపిక లేక పామును అలా క్షేమంగా వదిలిపెట్టారు. అప్పుడు బాపూ 'దానికి విముక్తి లభించిందన్నమాట' అన్నారు. ఇలాంటి అపురూపమైన విషయాలను ఎం.ఎస్. రాజలింగంగారు చాలా నిజాయతీగా, స్వచ్ఛంగా మనకందించారు.

ఎం. ఎస్. బాపూ గురించి తన గురించి ప్రత్యేకంగా చెప్పి తన గొప్ప చాటుకునే ప్రయత్నం చేయలేదు. జరిగింది జరిగినట్లు నిరాడంబరంగా ఉదాత్తంగా చెప్పారు. తన పాత్ర ఎంతో అంతే చెప్పారు. విశేషణాల్లేవు. విశ్లేషణల్లేవు. స్వోత్కర్ష అసలే లేదు. జాతికంతటికీ పిత అయిన బాపూ ఆశ్రమవాసాన్ని మన ముందుంచారు. ప్రభాకర్‌జీ వంటి ఆయన సహచరుల్ని మనకు పరిచయం చేశారు. ఈనాటికీ మన మధ్యవున్న ఈ మహనీయుడు ఆనాడు మహాత్ముని సన్నిధిలో నివసించి తన ఉన్నత లక్షణాలతో ఆయనను ఆకర్షించి ఆ విషయాలను పూసగుచ్చినట్లు మనకందిస్తున్నారు. అందుకుని చదువుకుని మనమూ ఆచరించే ప్రయత్నం చేద్దాం. అపురూపమైన ఈ గ్రంథాన్ని అందుకొమ్మని పాఠకులను కోరుతున్నారు. సులభమైన శైలిలో ఈ గ్రంథాన్ని అందిస్తున్న ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు, మాజీ మంత్రివర్యులు శ్రీ ఎం.ఎస్.రాజలింగం గారికి నమస్కరిస్తున్నాను.

లలితకళాతోరణం,
హైదరాబాద్ - 500 001.
ఫోన్ : 3234815

ఎస్. గోపి
వైస్ ఛాన్సలర్.
తెలుగు యూనివర్శిటి

# జాతి ప్రబోధ గ్రంథం

మీరు పంపిన పుస్తకం 'బాపు–నేను' అందినది. మీరు దయతో నాకు పంపిన గ్రంథాన్ని ఎంతో ఆసక్తితోను, శ్రద్ధతోను చదివాను స్వాతంత్ర్య ఉద్యమకాలంలో వెనుకబడిన తెలంగాణాప్రాంతం చైతన్యవంతం కావడానికి మీలాంటి సమరయోధులు చేసిన కృషి, త్యాగం అనన్య సామాన్యం. ఆర్థిక, సాంఘిక, విద్యావరంగా వెనుకబడిన నైజాం రాష్ట్రంలో అత్యంత వెనుకబడిన తెలంగాణా ఉండి విద్యావంతులు బ్రిటిష్ అధీన భారత ప్రాంతాలలో జాతీయోద్యమ నాయకులచే స్ఫూర్తి పొంది, శిక్షణ పొంది, తమ ప్రాంతాలకు తిరిగి వచ్చి, ఇక్కడ నిరంకుశ నైజాం ప్రభుత్వాన్ని, ఫ్యూడల్ ఆర్థిక, సాంఘిక వ్యవస్థను ఎదిరించి, జనజాగరణకు నిరంతర కృషి సల్పారు. అట్టి సమరయోధుల చరిత్ర, జీవితానుభవాలు మన నేటి యువతరానికి స్ఫూర్తినిచ్చి, జాతి నిర్మాణ కార్యక్రమంలో దేశభక్తితో పాల్గొని నూతన యుగనిర్మాతలుగా తీర్చిదిద్దుతాయనడంలో ఏమాత్రం సందేహం లేదు.

మీరు విద్యాభ్యాసానంతరం జీవితాన్ని జాతిసేవకు అంకితం చేయడం, సాక్షాత్తూ జాతిపిత బాపూజీ ఆశ్రమంలో ఋషిలాంటి జాతీయ నాయకుని కనుసన్నలలో మెలిగి తగిన శిక్షణ పొంది మేటి స్వాతంత్ర్యవీరులుగా రూపొందడం ఎంతో ముదావహం. మీ తరం నాయకుల జీవితాలే ఆనాటి జాతీయోద్యమ ఘట్టాలుగా తీర్చబడ్డాయి. మీరే భారతదేశం, భారతదేశమే మీరుగా మమైక్యం చెందిన మీ వ్యక్తిత్వం ఎప్పుడూ భాసిస్తూనే వుంటుంది. అంతేకాక బాపూజీతో మీ జీవనయాత్రలో నేటితరం తెలుసుకోవలసిన ప్రాచీన భారతీయ విలువలు, సంస్కృతి, వాటిపైన సరియైన అవగాహన ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. స్వాతంత్ర్యంకలకాలం కళకళలాడాలంటే జాతి స్వావలంబన అలవరచుకోవలసి వస్తుంది. నేటి మితిమీరిన భౌతికవాదం, వాణిజ్యవాదం, వినిమయ వైఖరి, అనారోగ్యకరమైన పోటీ, కుల, మతవాదాలు, దోపిడీవిధానాలు, లంచగొండితనం, స్వార్థపూరిత రాజకీయాలు, ఉగ్రవాదధోరణులు ఇలా చెబుతూపోతే మనను బాధించే సమస్యలెన్నో. వాటిని సమూలంగా తొలగించాలంటే మీ తరంనాటి యువతరం తిరిగి ఆవిర్భవించాల్సి వుంటుంది. సత్శీలానికి, సత్యానికి, త్యాగానికి, ధైర్యానికి, నిస్వార్థతకు ప్రతీకలుగా నిలిచి భారతదేశ ప్రాచీన ఔన్నత్యాన్ని పునః ప్రతిష్ట చేయాల్సి వుంటుంది. అందుకు మీ జీవిత గ్రంథాలు, జ్ఞాపకాలు, మార్గదర్శకాలుగా నిలుస్తాయి. మీ పుస్తకం ఆ కోవకు చెందిన జాతి ప్రబోధ గ్రంథం అవుతుందని నా ఆకాంక్ష.

**ప్రొఫెసర్ విద్యావతి**
వైస్ ఛాన్సలర్.
కాకతీయ యూనివర్సిటీ, వరంగల్.

# కరదీపిక

ఇరవయ్యో శతాబ్దిలో మన దేశ ప్రజల ప్రేమాభిమానాలను, గౌరవాన్ని అందరికంటే ఎక్కువగా పొందిన జాతీయ నాయకుడు మహాత్మాగాంధీ. వంద సంవత్సరాల గతంలోకి దృష్టి సారిస్తే శిఖరాయమానంగా కనిపించే మూర్తిమత్వాలలో ఆయన మేరువు. స్వతంత్ర భారతావతరణలో ఆయనది అనితర సాధ్యమైన పాత్ర అందుకే ఆయనను జాతిపిత (ఫాదర్ ఆఫ్ నేషన్) అని పులుచుకొంటున్నాము. తరచు జ్ఞాపకం చేసుకొని అంజలి ఘటిస్తున్నాము.

గాంధీజీ తనను ప్రజలు ''జాతిపిత'' అనడం గురించి ఇలా అన్నారు.

''నన్ను జాతిపిత అంటున్నారంటే అది ఒక విధంగా నిజం. 1915లో దక్షిణాఫ్రికా నుంచి తిరిగి వచ్చాక కాంగ్రెస్ ఇంతటి స్థితిలోకి రావడంలో నేను పాత్ర వహించాను. అంటే నేను జాతిని చాలా ప్రభావితం చేశాను.''

గాంధీజీ ఈ మాటలు పలికినది 1947 నవంబర్ 14వ తేదీన ఒక ప్రార్థన సభలో. దేశం స్వతంత్రమై అప్పటికి మూడంటే మూడే నెలలయింది. తన ప్రసంగాన్ని కొనసాగిస్తూ ఆయన ఇంకా ఇలా అన్నారు.

''కాని, ఈవేళ, నేను అదే విధంగా జాతిని ప్రభావితం చేస్తున్నానని చెప్పలేను. అలాగని దాన్ని గురించి నేను చింతించడం కూడా లేదు, చింతించకూడదు. మనందరం విద్యుక్త ధర్మాన్ని నెరవేర్చి ఫలితాన్ని దేవుడికి వదిలి వేయాలి. దైవసంకల్పం లేకుండా ఏమీ కాదు. కృషి చేయడమే మనవంతు....''

స్వాతంత్ర్యం సంపాదించుకొన్న మూడు నెలలలోనే తన ప్రభావం తగ్గుతున్న వాస్తవాన్ని గాంధీజీ గుర్తించారు. గాంధీజీ మరణం తరువాత ఆయన ప్రభావం మరింత తగ్గడం మనందరం చూస్తున్నదే.

గాంధీజీ ప్రభావం తగ్గుతున్నదని అనుకొంటున్నామే గాని అది పూర్తిగా పోయిందనిగాని, ఆయనను విస్మరిస్తున్నామనిగాని అనుకోవడంలేదు, అనడం లేదు. ప్రభావం తగ్గడంవేరు, మనిషినే మరచిపోవడంవేరు. కొత్త సహస్రాబ్దిలో అడుగిడుతన్న ఈ

తరుణంలో గాంధీజీ పాత్రను సమీక్షించుకొని, ఆయన ప్రభావాన్ని అంచనావేసే ప్రయత్నాలు మన దేశంలోనూ ఇతర దేశాలలోనూ అక్కడక్కడ జరుగుతున్నాయి.

గాంధీజీ కేవలం రాజకీయ నాయకుడు మాత్రమే కారు, స్వాతంత్ర్యోద్యమ నేత మాత్రమే కాదు. రాజకీయ, ఆర్థిక రంగాలకే ఆయన పాత్ర పరిమితం కాలేదు. సాంఘిక, నైతిక రంగాలలోనూ ఆయన విశిష్ట కృషి ఉంది. నిజానికి ఈ రంగాలన్నింటిని ఆయన వేర్వేరుగా చూడలేదు. అన్నింటి మధ్య ఆయన పరస్పరసంబంధాన్ని చూశారు. తదనుగుణంగానే ఆయన ప్రజోద్యమాలను నడిపించారు. అస్పృశ్యతను, అలాంటి మరికొన్ని మూఢాచారాలను ఆయన నిరసించి, ప్రతిఘటించి, వాటికి వ్యతిరేకంగా పోరాడారు. సత్యం, అహింస, నీతిబద్ధమైన జీవితం ఆయన ఆదర్శాలు. పరివర్తన పరమావధిగా ప్రబోధాలు కావించారు, ఉద్యమాలు సాగించారు. రాట్నం వడకమని, కుటీర పరిశ్రమలు నడుపుకొనవలసిందని ఆయన సూచించిన పరిష్కారాలు కాలానుగుణం కావని కొందరు కొట్టి పారవేయవచ్చునేమోగాని ఆయన ప్రబోధించిన నీతిని నేడే కాదు, ఇకముందు కూడా ఎవరూ వ్యతిరేకించరు. అవి సార్వకాలిక నైతిక సూత్రాలు. కనుకనే గాంధీజీని మనదేశంలోనే కాదు, ఇతర దేశాలలో సైతం జ్ఞాపకం చేసుకొంటున్నారు. రాజకీయ, ఆర్థికరంగాలతో సహా వివిధ జీవనరంగాలకు సంబంధించి, ఆయన సూచించిన పరిష్కారాల సమీక్ష ఇప్పుడు జరుగుతున్నది. కొన్ని తరాల తరువాత ఆయన ప్రబోధాలే శరణ్యమని కొందరు భావిస్తే ఆశ్చర్యపడనవసరం లేదు. కాని ఈ క్షణాన మాత్రం ఆయన బోధనలను పుస్తకాలకు పరిమితం చేస్తున్నాము.

శతాబ్ది చివరికొచ్చి ఈ సమయంలో గాంధీజీ జీవితాన్ని, ఆయన బోధనలను అధ్యయనం చేసి, తమ తమ దృక్కోణాలనుంచి పరిశీలించి, అంచనా వేసి, వివిధ దేశాలలో పరిశోధకులు పుస్తకాలు రాసి ప్రచురిస్తున్నారు. మనదేశంలోనే అవి తక్కువ. ప్రత్యేకించి తెలుగులో చాలా తక్కువ పుస్తకాలు వెలువడుతున్నాయి. ఈ విషయం మీద ఆసక్తి ఉండి రాసేవాళ్ళు బహుతక్కువ.

మరో సహస్రాబ్దిలో ప్రవేశిస్తున్న ఈవేళ గాంధీజీని చూసినవాళ్ళ సంఖ్యే స్వల్పం. ఆయన బలిదానం తరువాత అర్ధశతాబ్ది గడిచిపోయింది. ఆయనను సన్నిహితంగా తెలిసినవారు, ఆయనతో కొన్నాళ్ళు గడిపినవారు ఇప్పుడు చాలా తక్కువమంది కనిపిస్తారు.

మన రాష్ట్రంలోనైతే వేళ్ళపై లెక్కించదగినంత మంధైనా ఉన్నారో లేదో. అలాంటి బహుకొద్ది మందిలో శ్రీ ఎం.ఎస్. రాజలింగంగారొకరు.

బూర్గుల రామకృష్ణరావుగారి మంత్రివర్గంలో పనిచేసిన అనుభవం వుండి, అదృష్టవశాత్తు ఇప్పుడు మన మధ్య ఉన్న పెద్దలు గాంధీజీ అంతేవాసి శ్రీ రాజలింగం గారొక్కరే.

రాజలింగం గారు యువకుడుగా కొంతకాలం సేవాగ్రామ్‌లో గాంధీజీ శుశ్రూష చేశారు. గాంధీజీ తనను పేరుపెట్టి పిలిచేటంత పరిచయం ఏర్పరచుకొన్నారు. గాంధీజీ మూర్తిమత్వాన్ని అర్థంచేసుకోవడానికి దోహదపడే అనేక సంఘటనలను స్వయంగా చూశారు. గాంధీజీ ప్రసంగాలను, సంభాషణవశాత్తు ఒలికించే ఆణిముత్యాలను సేకరించుకొన్నారు, గుర్తుంచుకొన్నారు. ఆ పిన్నవయసులో అలా విశ్వవిద్యాలయ స్థాయికి మించిన విద్యను ఆర్జించుకొనే అవకాశం రాజలింగంగారికి కలగటం నిజంగా అదృష్టమే.

''యంగ్ ఇండియా''లో, ''హరిజన్''లో బాపూజీ రాసిన అనేక వ్యాసాలను, అభిప్రాయాలను రాజలింగంగారు సేకరించి, భద్రపరచుకొన్నారు.

జాతీయస్థాయిలో సురేంద్రనాథ్ బెనర్జీలాంటి నాయకులను, ఆ కాలంలో ఆంధ్ర రాజకీయాల ఉద్దండ పిడుగులైన డాక్టర్ పట్టాభి, శ్రీ కళా వెంకట్రావు మొదలైన వారిని రాజలింగంగారు సేవాగ్రామ్‌లో కలుసుకొన్నారు. వారందరికి చేతనైన సహాయం, సేవ చేసారు. ఆ నాయకులను వారి వ్యూహాలను, విధానాలను, వ్యక్తిత్వాలను అర్థం చేసుకొనడానికి అక్కడ అనుభవాలు ఆయనకు తోడ్పడ్డాయి.

శ్రీ రాజలింగం తమ జీవితానుభావాలను గ్రంథస్థం చేసి ప్రచురించడం ఇటీవలే ప్రారంభించారు. అందులో ఒకటి ''గాంధీతో నా అనుభవాలు''. వార్ధా- సేవాగ్రామ్‌లో ఆయన స్వయంగా చూసిన సంఘటనలు విని, చదివి గుర్తుంచుకొన్న ప్రసంగ భాగాల సమాహారం ఈ గ్రంథం. ఇందులోని సంఘటనల్లో ప్రతి ఒక్కటి ఏదో ఒక నీతిని అందిస్తుంది.

తనది అల్ప సంఖ్యాక వర్గం అభిప్రాయమైనా నిరాహారదీక్ష అనే ఆయుధంతో అధిక సంఖ్యాకులను తన దారికి తెచ్చుకొనగలిగిన బాపూజీ తనకు వ్యతిరేకంగా ఒకరు నిరాహారదీక్ష

హెచ్చరించినప్పుడు సైతం తన మాటనే నెగ్గించుకొన్నారు. రెండు వారాలు కఠిన ఉపవాసాలు చేసిన ఒక నిజాయితీపరుడైన కార్యకర్త తుదకు దీక్షను విరమించుకొనవలసి వచ్చిందే గాని గాంధీజీ దిగిరాలేదు. ఎందుకిలా జరిగిందంటే, ''స్వార్థపూరితమైన ఉపవాసానికి శిక్షే ఉంటుంది గాని ఫలితం ఉండదు'' అని బాపూజీ సమాధానమిచ్చారట.

గాంధీజీ తత్త్వాన్ని అర్థం చేసుకోవాలంటే ఆయన వివిధ విషయాలపై రాసిన వ్యాసాలను చదవడం, చేసిన ప్రసంగాలు వినడం తప్పనిసరి. బ్రహ్మచర్యం అంటే ఏమిటి? సత్యం, అహింస సిద్ధాంతాలను ఎలా అర్థం చేసుకోవాలి? మొదలైన ప్రశ్నలకు సమాధానం తెలుసుకోవాలంటే సంపుటాలుగా వెలువడిన గాంధీజీ సాహిత్యాన్ని అధ్యయనం చేయవలసి ఉంటుంది. అలా అక్కరలేకుండా, వివిధ విషయాలపై మహాత్ముని అభిప్రాయాలను సంక్షిప్తీకరించి శ్రీరాజలింగంగారు ఒకచోట చేర్చారు.

చదివించే అనేకానేక ఆసక్తికర సంఘటనల వివరాలు, బాపూజీ సూక్తులు, వ్యాస భాగాల క్రోడీకరణ, ఈ ''గాంధీ-నేను'' పుస్తకం.

గాంధీజీ జీవిత చరిత్ర సంపుటాలలో సైతం కనబడని అనేక సంఘటనలను గురించి ఈ చిరు గ్రంథం తెలియజేస్తుంది.

పుస్తకం చిన్నదైనా, గాంధీజీ సాహిత్యాభిమానులను అలరింపజేసే చిరుగ్రంథం. గాంధేయ సిద్ధాంతాలలో విశ్వాసం ఉన్న ఎవరికైనా కరదీపికగా ఉపయోగపడే ఈ చిరు గ్రంథం చిరకాలం నిలుస్తుందని నా విశ్వాసం.

**పొత్తూరి వెంకటేశ్వర్రావు.**
ఆం.ప్ర. ప్రెస్ అకాడమి అధ్యక్షులు
ఫోన్ : 3344288

# మార్గ దర్శకులు

మన జీవనకాలంలో మహాత్ములను దర్శించడము, వారి మాటలు వినడం, వారు నడచిన ధూళిని శిరసున ధరించడం పుణ్యప్రదమనుకుంటాం. అలాంటిది స్వయంగా అలాంటి మహా వ్యక్తుల సన్నిహిత ప్రేమాదరాలను, ఆశీస్సులను, పొందగలగడం, వారి నిత్య జీవన రహస్యాన్ని ఆకళించుకోగల అవకాశం పొందడం నిజంకా సుకృతమే.

శ్రీ యం. యస్. రాజలింగంగారికి అలాంటి సదవకాశం మహాత్మాగాంధీజీ సహచర్య రూపంలో లభించింది.

శ్రీ రాజలింగం గారు తమ అనుభవాలను, సిద్ధాంతపరంగా కొన్ని విశ్వాసాలను, బాపూజీ ఆలోచనా సరళిని, వివిధ విషయాలలో బాపూజీ అభిప్రాయాలను స్మరిస్తూ, ఆ మహావ్యక్తి ఎలా ఎవరితో ఆచరించేవారో సూచించారు. అది మహనీయులు వ్యక్తిత్వ దర్శనానికి అద్దంలో కన్పిస్తుంది.

ఆశ్రమం విడిచి చివరికి వరంగల్ వచ్చి, శ్రీరాజలింగంగారు నిర్మాణ కార్యక్రమాలు ప్రారంభించారు. అప్పుడు వారితో నా బాల్యంలోనే నాకు పరిచయం ఏర్పడింది. దేశాన్ని గురించి, దేశభక్తిని గురించి, కర్మపాఠాన్ని గురించి, మా యింటతొలి పాఠం నేర్పింది మా పెద్దన్నగారు శ్రీ భండారు వీరమల్లు ప్రసాదరావు గారు, మలి మార్గదర్శకులు శ్రీ రాజలింగంగారు, ఆ తరువాత సిద్ధాంతరీత్యా మార్గాలు వేరైనా, వారిపట్ల ఆనాటి నుండి నేటివరకు నాకు ఆదే ఆదరం ఉన్నది.

పూర్వం **All over a Congress Ticket** ( ఇదంతా కాంగ్రెస్ టిక్కెట్టుకెగా) అని వారొక గ్రంథం వ్రాశారు. అది వారి రాజకీయ మరో విశ్లేషణకు ఉదాహరణైతే, ఈ ప్రస్తుత రచన వారి జీవనంలో ఆదర్శ పథోన్ముఖంగా అడుగు వేయడానికి లభించిన సంస్కార సముచ్చయానికి కరదీపిక లాంటిది.

శ్రీ రాజలింగంగారు అదృష్టవంతులు, వారు తమ స్మరణికల్లో మహాత్ముల మనోగతాలను దర్శింప చేశారు. చక్కగా చదువుకోదగ్గ రచనను అందించిన శ్రీ రాజలింగం గారికి నా నమస్సులర్పించి, ఈ నాలుగు మాటలు వ్రాయడానికి నన్ను ప్రేరేపించిన వారి వాత్సల్యాన్ని పదిల పరచుకుంటున్నాను.

**భండారు సదాశివరావు,** అడ్వొకేటు
అధ్యక్షులు, అఖిలభారతీయ సాహిత్య పరిషత్

మహాత్మాగాంధి హాస్పటల్ ఎదురుగా,
వరంగల్లు. ఫోన్-615730

# బంగారు అద్దం

దేశం కోసం, నమ్మిన సిద్ధాంతాలకోసం ప్రాణాల్ని సైతం పరిత్యాగం చేసే సువర్ణకాలం అది ! గాంధీజీగారు దేశం కోసం ఆయన ప్రకటించిన సత్యమైన ఆగ్రహాలు, నడిపిన ఉద్యమాలు, వాటి యొక్క తీరుతెన్నులు తెలిసి అందులో నిలువెల్లా నిండి ప్రవహించిన ఒక ధార్మిక తేజము శ్రీ ఎమ్.ఎస్.రాజలింగం గారు. ఎనభయ్యేవ పడిలో పడిన శ్రీ రాజలింగంగారు యెనిమిదేళ్ల పసికూనలకు గాంధీజీ దీప్తి, ఆనాటి ఉద్యమస్ఫూర్తి, అప్పటి దేశభక్తి యివన్నీ తెలియాలనే వుద్దేశంతో ఈ రచన చేశారు.

నాలుకను జయించడానికి రుచిలేని ఆహారం తినాలి అన్న అత్యంత సూక్ష్మమైన విషయం దగ్గర్నుంచి, మతాన్ని సహించడం దాకా ఈ ఏకాదశ సూత్రాలు, పిల్లల మనస్సులకు హత్తుకునేటట్లుగా శ్రీ రాజలింగంగారు పొందుపరిచారు. స్వాతంత్ర్య జీవన సమర గమనంలో తారసపడిన ఆయా వ్యక్తుల, అనుభవాల, సంఘటనల విశేషాలను ఉన్నదున్నట్లుగా, సంక్షిప్తంగా, సరళంగా శ్రీ రాజలింగంగారు ఈ పుస్తకంలో చెబుతూ వుంటే –

ఆహా మన పూర్వులు యింత గొప్పవాళ్ళా ! ఇంత స్వచ్ఛమైన వాళ్ళా !
ఇంత నిర్భీకులా ! – అని ఎంతో సంతోషం కలుగుతుంది.

గాంధీజీగారు నా జీవితమే నా సందేశం అని చాటిన మహాపురుషులు. ''నేనేదీ కొత్త సిద్ధాంతం చెప్పడం లేదు. మామూలుగా మనిషి ఎలా బ్రతకాలో చెప్పాలని ఆరాటపడుతున్నవాడిని. యిందులో ఏ యిజం వుండటం నిజం కాదు'' అన్నంత నిరాడంబర సాధుమూర్తి శ్రీ గాంధీజీ. అటువంటి మహాపురుషుని సాంగత్యంలో తనని తాను మలుచుకున్న పూర్ణపురుషుడు శ్రీ రాజలింగం గారు.

ఈ పుస్తకము ఆధునిక సమాజంలో తుఫాను వేగాన్ని మించిన వేగంతో పరిగెడుతున్న బాల్యానికి గమ్యం తెలిపే – ముందు వెనుకలు చూసుకోగలిగిన దృష్టి ప్రసాదించే ఒక బంగారు అద్దం. శ్రీ రాజలింగంగారికి ఆ వాగ్దేవి నిరంతర ఆయురారోగ్య భోగ్యములు ప్రసాదించాలనీ శుభాశంసన చేస్తున్నాను.

మాడుగుల నాగఫణి శర్మ
అధ్యక్షులు.
అధికారభాషా సంఘం,

హైదరాబాద్.
ఫోన్ : 3452339

# చారిత్రాత్మక గ్రంథం

పుస్తక ప్రపంచంలో అనేక గ్రంథాలు వెలువడుతున్నాయి. ఆధునిక కాలంలో సాహిత్యం, రాజకీయం, వైద్యం, జ్యోతిషం, సేవా పథకాలు ఇలా ఎన్నో విషయాల గురించి.

కాని రాజలింగంగారు, 'బాపూ-నేను' అని వ్రాసిన ఈ గ్రంథం ఒక విశిష్టత కలిగి వుంది. బాపూజీని ఈ కాలంలో జనం మర్చిపోయారంటే ఆశ్చర్యం కాదు. ఆయన సిద్ధాంతాలు, ప్రవచనాలు స్వాతంత్ర్య పూర్వకాలంలో చాలామందికి ఆదర్శం. ఆయన మహాత్ముడు అని వేయి నోళ్ళ అందరూ ప్రస్తుతించారు. కాని వారు చనిపోయిన తరువాత వారి జన్మదిన, మరణదినం జ్ఞప్తికి చేయడమేకాని, బాపూజీ సిద్ధాంతాలు ఏవీ అమలు జరుపుటలేదు.

రాజలింగంగారు బూర్గుల రామకృష్ణారావు మంత్రి వర్గంలో మంత్రిగా ఉండడం తెలుసు. అప్పుడు నేను మంత్రి బసవరాజు వద్ద పి.ఏ.గా వున్నాను. ఆ మంత్రికి వార్ధా అనుభూతులు ఎన్నో ఉన్నాయని నాకు ఇప్పుడే తెలిసింది. ఎన్నో ముఖ్యపనులున్నా అదే కాలంలో డా. మెల్కోటే పి.డబ్ల్యు., లేబర్ శాఖకు మంత్రిగా వారు విదేశాలకు పోయినప్పుడు రాజలింగంగారు వారి శాఖలకు ఇన్‌ఛార్జిగా వుండి మంత్రి విధులను నిర్వహించారు.

సేవాగ్రాంలో గాంధీజీ ఒక చరిత్రాత్మక వ్యక్తి. ఆయన మాట, నడక, చూపు, కోట్లమంది పరిశీలించి అర్థాలు తీసిచూచి, ఆచరణలో పెట్టడం గౌరవంగా భావించేవారు. అటువంటిది, రాజలింగంగారు బాపూజీ కనుసన్నలలో మెలిగిన సన్నిహితులుగా జీవించారు. ఆయన అదృష్టం. ఆయన వ్రాసిన 'బాపూ-పాము' సంఘటన బాపూజీ అహింసా సూత్రాలకు ప్రాణం పోసింది. శాస్త్రీజీ-కుష్టువ్యాధి అయినా గాంధీజీనే సేవచేయడం, ఇతరులు, రాజలింగంగారు కూడా ఆయనను అనుసరించడం ఒక వినూత్న ఆధ్యాత్మిక అనుభవం మానవసేవే మాధవసేవ అని గాంధీజీ ఆచరణలో చూపారు.

వార్ధా వాతావరణంలో, అందలిగాంధీజీ సూత్రాలూ, ప్రభావం, ఆశ్రమవాసుల క్రమశిక్షణ, గాంధీపై భక్తి చదువరులను కూడా కుదిపేస్తుంది. గాంధీ ప్రపంచాన్నే కుదిపివేసారు ! సామాన్య మానవులు ఎంత ?

అటువంటి వాతావరణంలో లిప్త కాలం ఉన్నా అదృష్టమే. అటువంటిది రాజలింగంగారు వార్ధా ఆశ్రమంలో చిరకాలం గడిపి, అనేక అనుభూతులు పొంది పునరుజ్జీవనం పొందారు. ఈ పునాది అనుభవాలే ఆయన జీవితంలో క్రొత్తమక్కానిగా పరించి, 'బాపూ–నేను' గ్రంథం చదివినవారు ఆత్మ పరిశోధన చేసుకొనగలరు.

గాంధీ జీని స్వయంగా నేను చూశాను. కలిసాను. కాకినాడలో విద్యార్థి కాంగ్రెస్ అధ్యక్షుడుగా. గాంధీజీ ట్రైన్‌లో మద్రాసు వెళుతున్నప్పుడు నవ్విన తీరు చూసాను, కాస్త మాట్లాడాను. ఆ సంఘటన నాలో ఎంతో ప్రభావం కలిగించింది. రాజలింగంగారి పుస్తకం చదివాక నాలో ఎన్నో పురాతన స్మృతులు కదలాడాయి.

'బాపూ–నేను' ఒక ఉద్గ్రంథం. చారిత్రక గ్రంథం. స్వాతంత్ర్యావతరణ ప్రతిబింబించే గ్రంథం. బాపూజీ అంతర్గత ఆలోచనాసరళి తెలిపే గ్రంథం. ఈ స్మృతులు రాజలింగంగారి పుస్తకంలో అందించడం ద్వారా భారతదేశానికి, సర్వ మానవలోకానికి ఒక మహోత్తర సేవ చేసినవారైనారు. దానికి నా హృదయపూర్వక అభినందనాలు.

సాహితీచైతన్య, భారత భాషా బహుకళా ప్రపూర్ణ,
**పోతుకూచి సాంబశివరావు,**
కేంద్ర సాహిత్య అకాడమీ సభ్యులు,
ప్రాంతీయ ఫిల్మ్ సెన్సారు బోర్డు మెంబరు.

1-3-1/18, కవాడిగూడా,
సికింద్రాబాదు-500 080.
ఫోన్ : 7533177



# నేటి తరానికి 'సత్యవాణి'

మాన్యులు శ్రీ యం. రాజలింగంగారు నేటి పరిస్థితులలో 'గాంధీజీ - నేను' పుస్తకాన్ని వ్రాయడం, ప్రచురించడం ఎంతో సాహసకార్యంగా భావించవలసి వుంటుంది. ఇర్వై ఒకటవ శతాబ్దంలో మహాత్మాగాంధీ జీవన సందేశం ప్రాముఖ్యత వహించగలదని కొందరు భావిస్తుంటే, నేటి ఆర్థిక సంస్కరణల రణగొణల మధ్య గాంధీజీ ప్రాధాన్యత ఉండడానికి అవకాశం లేదని మరికొందరు ఆధునికులమనుకునేవారు అంటూనే ఉన్నారు. అయితే స్వాతంత్ర్యోద్యమ సమయంలో మహాత్మాగాంధీజీ ఈ దేశంలోని ఆబాల గోపాలాన్ని తన అహింసాయుత విధానాల ద్వారా ప్రభావితం చేయగలిగారు. ఆనాడు ఆయన స్వీకరించిన విధానాలు, ఆయన జీవనశైలి ఒక ప్రత్యేకతను సంతరింపచేసుకొని వున్నది. ఆ విధానాల పట్ల ఆకర్షితులైన అనేకమంది యువకులు ఆనాటి రోజులలో వార్ధా ఆశ్రమంలోనే వుండి తాము స్వయంగా నిర్మాణాత్మక కృషిలో ఎంతో సంతృప్తిగా భాగస్వామ్యాన్ని పంచుకున్నారు. ఆ విధంగా ఎంతో త్యాగమయభావంతో సేవావ్రతులుగా అక్కడ పనిచేసిన వారిలో ఎం.ఎస్.రాజలింగంగారు అగ్రగణ్యులలో ఒకరు కావడం, ఆనాటి అనుభవాలను నేటి తరానికి చెప్పడానికి ప్రయత్నించడం తెలుగువారందరకూ గర్వకారణం. ఆనాడు అంతటి కఠోర పరిశ్రమ చేసినవారు కనుకనే నేటికీ ఆయన గాంధేయవాదిగానే మిగిలిపోయారు.

ఆయన గాంధేయవాదంలో శాక్తేయం కూడా మిళితమైవున్నది. అందువలననే వార్ధా ఆశ్రమంలో కూడా తన స్వతంత్ర నిర్భీక ప్రవృత్తిని నిలబెట్టుకొనగలిగారు. అదే ప్రవృత్తిలో ఆ తర్వాత కూడా జీవించడం వలన నేడు తన శక్తిసామర్థ్యాలకు, త్యాగసేవాభావాలకు తగిన స్థానాన్ని పొందలేకపోయారనేది కాలం చెప్పే కఠోర వాస్తవం. అందుకు ఆయన ఎప్పుడూ కించిత్ బాధపడినట్లు కూడా దాఖలాలు కనపడడం లేదు. అలాంటివారు స్వాతంత్ర్య పోరాట సమయంలోనూ, ఆ తర్వాత కూడా జరిగిన భారత పునర్నిర్మాణంలో తమవంతు బాధ్యతను తమ కర్తవ్యంగా స్వీకరించిన వారెందరో ఉన్నారు. వారిలో ఎవ్వరికీ తమకి సమాజం ఏదో చేయలేదనే బాధలేదు. నిజానికి సమాజమే అందుకు చింతించవలసి వుంటుంది. అయితే నేటి ఆధునిక సామాజిక రాజకీయ వాతావరణంలో అలాంటి భావనకు అవకాశం లేదు.

అయినా శ్రీకృష్ణ భగవానుడు చెప్పినట్లుగా, ''కర్మేణ్యేవాధి కారస్తే మాఫలేషు కదాచన'' భావాన్ని జీర్ణించుకుని మానవ కళ్యాణానికి పనిచేయడం ద్వారా తమ జీవితాలకు ధన్యత చేకూర్చుకుంటున్న మాన్యులు ఎం.ఎస్. రాజలింగంగారి లాంటి వారు నేటి తరానికే కాకుండా భవిష్యత్తరానికి కూడా మార్గదర్శకులు. ఆయన ఈ వయస్సులో కూడా ఎంతో శ్రమపడి బాపూజీ ఆశ్రమంలో తన అనుభవాలను గ్రంథస్థం చేశారు. మహాత్మాగాంధీజీలాంటి వారి జీవితంలోని ప్రతి కదలిక, ప్రతి సందేశం నేటి మానవాళికి ఎంతో ఆదర్శవంతమైనట్టిది.

ఈవిధంగా పరిచయ వాక్యాలు వ్రాయడానికి నాకు అంతగా అర్హత లేదని తెలుసు. కానీ మాన్యులు శ్రీ రాజలింగంగారు నాపైగల వాత్సల్యంతో నాకు ఈ మహత్తర బాధ్యతను అప్పగించినందుకు వారికి నా కృతజ్ఞతలు.


**పిరాట్ల వెంకటేశ్వర్లు.**
సంపాదకులు
కృష్ణాపత్రిక

చిక్కడపల్లి,
హైదరాబాదు
ఫోన్ : 7601808

# ఆవశ్యకమైన అభినందనీయ యత్నం

ఆంధ్రావనికి చెందిన, ముఖ్యంగా తెలంగాణీయులైన స్వాతంత్ర్య సమరయోధులలో శ్రీ యం.ఎస్. రాజలింగంగారి స్థానం విశిష్టమైనది. జాతిపిత గాంధీ మహాత్ముని సమక్షంలో నివసించిన అసాధారణ అవకాశాన్ని ఆయన పొందారు. మన ఇతర యే రాజకీయవేత్తకు ఆ అదృష్టం అంతగా కలుగలేదు.

రాజలింగంగారు వ్యవహారదక్షుడు. మేధాసంపన్నుడు, అనర్గళ వక్త కావడం ఆయన రాజకీయ జీవిత సాఫల్యానికి, అమాత్యుడుగా ఆయన విధి నిర్వాహణ రాణించడానికీ దోహదం చేశాయి. జీవిత ఉత్తరార్థంలో న్యావాదిగా, గ్రంథకర్తగా కూడా గణతికెక్కడం ఆయన బహుముఖ ప్రతిభకు నిదర్శనం. రాజలింగంగారి వక్తృత్వ ఆటవానికి పాఠశాల విద్యార్థిదశలోనే నేను చాలా ప్రభావిడనయ్యాను. అయిదు దశాబ్దాల క్రితం నేను మానుకోటలో మొదటిసారిగా విన్న రాజలింగంగారి సుదీర్ఘ గంభీరోపన్యాసం, దానికి క్రిక్కిరిన ప్రేక్షకుల హర్షభరిత స్పందన నాకు మరపురాని ముఖ్య ఘట్టాలలో ఒకటి.

ఎనభైఏళ్ళ జ్ఞానవృద్ధులైన రాజలింగంగారు ఇప్పుడు మహనీయులు. గాంధీజీ ఆశ్రమాలలోనూ, జె.సి. కుమారప్ప శిక్షణ సంస్థలోనూ ఆనాడు గడిపినప్పటి తన కొన్ని జ్ఞాపకాలనూ, అనుభవాలనూ పొందుపరచి నవతరం కోసం 'బాపు–నేను' అన్న పుస్తకాన్ని రూపొందించడం నిజంగా ఒక ఆదర్శప్రాయమైన, అభినందనీయమైన, ఎంతో అవసరమైనది కూడా అయిన చక్కని ప్రయత్నం. ఆయన కేవలం ఈ విశేషాలనే కాకుండా వివిధ అంశాలపై గాంధీజీ వెలిబుచ్చిన అభిప్రాయాలనూ, ఆయన సూక్తులనూ, హితోక్తులనూ, సిద్ధాంతాలను, మరికొందరి సమకాలీన ప్రముఖుల భావాలను కూడా సందర్భోచితంగా ఈ గ్రంథంలో ఉదహరించడం, దీని ప్రయోజనాన్నీ, విలువనూ పెంపొందించాయి. ఇందులో రాజలింగంగారు ఉటంకించిన ఆశ్రమ జీవిత సంఘటనలు తత్సంబంధిత ప్రముఖులు తదితర వ్యక్తుల వైఖరికి, మనోభావాలకు అద్దం పట్టేవిగా ఉన్నాయి. శిష్యుడుగా ఆయనపట్ల అప్పటి నిజాం కాలేజి ప్రిన్సిపాల్ టర్నర్, మగన్‌వాడి శిక్షణ కేంద్రం ప్రధానాచార్యుడు జెసి. కుమారప్పలు చూపిన వాత్సల్యం ఆయన ప్రదర్శించిన గురుభక్తి ఈ పుస్తకం పాఠకులను ఆకర్షించే అంశాలలో పేర్కొనదగినది. భారతీయుల

స్వాయంత్ర్య పోరాటాన్ని అణిచివేస్తున్న సైన్యం అధికారి టర్నర్, ఈ పోరాటంలో పాల్గొంటున్న ప్రియ శిష్యుడు రాజలింగాన్ని, అనూహ్యంగా తారసిల్లినప్పుడు, అరమరికలు లేకుండా ఆప్యాయంగా ఆలింగనం చేసుకోవడం పాఠకుడిని కదిలిస్తుంది. ఈ పుస్తకం యువతరానికి ఉద్దేశించింది కావడంచేత ఆ సన్నివేశం ఇతోధిక ప్రాధాన్యాన్ని సంతరించుకుంది.

నిర్మాణ కార్యక్రమాలను రాజకీయాలతో జోడించరాదన్న తన ఆదేశాన్ని ధిక్కరించినందుకు రాజలింగంని, 'యూ ఆర్ ఏ ఫైర్ టు ది ఇనిస్టిట్యూట్ *(You are a fire of the institution)*, ' అని హెచ్చరించిన జె.సి. కుమారప్ప తన క్రియల ద్వారా ఆయనకు ఎలాంటి హాని కలిగించకపోవడమే కాకుండా, ఆయన అర్థంతరంగా శిక్షణను విరమించి ముస్తాబాద్‌లో శిక్షణ కేంద్రాన్ని నెలకొల్పినప్పుడు హృదయపూర్వకంగా ఆశీర్వదించడం కూడా చదువరులను ఆకర్షిస్తుంది.

గాంధీ మహాత్ముడే కాకుండి ప్రభాకర్జీ, ఆచార్య బన్సాలీ, సురేంద్రనాథ్ బెనర్జీ, కుమారప్ప, ప్యారేలాల్, చిమన్‌లాల్ ప్రభృతుల వ్యక్తిత్వాన్ని కూడా ఈ గ్రంథం ఆవిష్కరిస్తుంది. ఇది పరుచూరి శాస్త్రి, పార్నీకర్‌జీ, భారతానంద్, ఆత్మారాం, ఫతేసింగ్ తదితరుల వృత్తాంతాలను కూడా వివరిస్తుంది.

ఆశ్రమవాసి అర్ధాంగిని సైతం ఒక్క రాత్రికి తలదాచుకోవడానికి కూడా ఆశ్రమ నిర్వాహకులు అనుమతించకపోవడం; పోలీసు అయి కూడా చరఖాను అను నిత్యం ఆడిస్తూ, ఆరాధిస్తూ ఆశ్రమ సభ్యత్వాన్ని ప్రియంగా అభ్యర్థించిన పంత్‌జీ కోర్కెను నిరాకరించడం ఆ వ్యవస్థపట్ల విశ్వాసాన్ని సడలించే సందర్భాలుగా నిలిచిపోతాయన్న భావం నాలాంటి సామాన్యులకు కలుగుతుందనడంలో సందేహం లేదు.

శ్రీ యం.ఎన్. రాజలింగంగారు ఉజ్వలమైన తమ జీవితంలోని అపారమైన అనుభవ సంపత్తిని భావి తరానికి అందించడం కోసం తమ 'ఆత్మకథ'ను రచించి, వెలువరించవలసిన ఆవశ్యకత కూడా ఎంతైనా వుంది.

1-1-/336/20
చిక్కడపల్లి,
హైదరాబాద్-20.
ఫోన్ : 7643230.

**ఎ.వి. జనార్ధనరావు.**
జర్నలిస్టు.

# గాంధీ పదగామి

ఒక తరం పెద్దలంతా గాంధీజీ గురించి మాట్లాడుతారు. స్వర్ణోత్సవ గణతంత్ర భారతదేశంలో నేడు "గాంధీజీ" - విగ్రహాలకు, జ్ఞాపకాలకు పరిమితమై పోయారనీ, . గాంధేయం వర్తమాన హైటెక్ సమాజానికి పాథేయం కాదనీ - అనేవారిని చూస్తుంటే బాధ కలుగుతుంది. ఓ మహాత్మా! ఓ మహర్షీ! ఓ క్షమా పీయూషవర్షీ! ఎక్కడయ్యా నీ అహింస ఎచట నీ కరుణారిరంస, అన్న శ్రీశ్రీ వంటి మహాకవుల ఆర్తి - నేటికీ సత్యనిష్ఠ గురించీ, నిరాడంబర జీవనం గురించీ నిజాయితీగా ఆలోచిస్తున్న వారి హృదంతరాళాల్లో వ్యాప్తి చెందుతూనే వుంది. గాంధీ పేరు చెప్పుకుని లాభపడిన వారు ఎందరున్నా, ఆయన్ని త్రికరణశుద్ధిగా ఆదర్శంగా తీసుకుని జీవనసరళిని మలుచుకున్నవారు తక్కువ. గాంధీని ఒక రాజకీయవేత్తగా, నాయకునిగా చూసిన వారికి మాత్రమే ఆయనతో పనితీరినట్లనిపిస్తుందేమో గానీ, ఒక మహాత్మునిగా, అహింసామూర్తిగా, సత్యజీవన ఆదర్శ శీలిగా, మానవతా తాత్వికజీవిగా సంభవించే వారందరికీ మాత్రం ఆయన ఆదర్శ గురువుగా, ఆరాధ్య దైవంగా నిత్యజీవన మార్గదర్శిగా విరాజిల్లుతూంటారు. సత్య సందర్శనం చేయగోరే ఏ వ్యక్తి కయినా ఆయన సదా అనుసరణీయులే - నాటికీ నేటికీ.

ప్రముఖ గాంధేయ వాదులు, మాజీ అమాత్యులు అయిన శ్రీ ఎం.ఎస్. రాజలింగం గారు - గాంధీ పథగామి. గాంధీగారితో సేవాగ్రాం ఆశ్రమంలో రెండు సంవత్సరాలు వుండి, జీవితాన్ని అనుభవ పరిపూర్ణం చేసుకున్నారాయన.

గాంధీజీ మీద ఇప్పటికి ఎన్నో పుస్తకాలు వెలువడ్డాయి. కానీ ముఖ్యంగా ఈనాటి తరానికి, ముఖ్యంగా పిల్లలకూ, యువకులకూ గాంధేయ అనుభవసూత్రాలనూ, ఆచరణ విధానాలనూ తేలికగా తెలియచెప్పే గ్రంథాలు తక్కువే. ఆ లోటు తీర్చే పుస్తకం ఇది - బాపు-నేను.

తెలంగాణలో పోలీసుల బారినుండి తప్పించుకోవడానిక మారువేషం వేసుకుని వార్ధ చేరి, ఆ తరువాత స్వామిరామానంద తీర్థ ప్రేరణతో గాంధీగారి అహింస, సత్యాగ్రహం మొదలయిన సూత్రాల అధ్యయనం పట్ల జిజ్ఞాస జనించి, పలు సాంఘీక సామాజిక కార్యకలాపాలు మూలకందంగా - గాంధీజీ సేవాశ్రమ వాసం చేసే రెండు సంవత్సరాల అద్భుత అవకాశం కలిగి, అక్కడే జె.సి. కుమారప్ప, ప్రభాకరజీ వంటి పెద్దల సాంగత్యంతో సంచరించి, అతనూ, తన వ్యక్తిత్వాన్ని గాంధేయ మార్గంలో వికసింప జేసుకున్న వారు శ్రీ రాజలింగం గారు.

స్వాయంత్ర్య పోరాటాన్ని అణిచివేస్తున్న సైన్యం అధికారి టర్నర్, ఈ పోరాటంలో పాల్గొంటున్న ప్రియ శిష్యుడు రాజలింగాన్ని, అనూహ్యంగా తారసిల్లినప్పుడు, అరమరికలు లేకుండా ఆప్యాయంగా ఆలింగనం చేసుకోవడం పాఠకుడిని కదిలిస్తుంది. ఈ పుస్తకం యువతరానికి ఉద్దేశించింది కావడంచేత ఆ సన్నివేశం ఇతోధిక ప్రాధాన్యాన్ని సంతరించుకుంది.

నిర్మాణ కార్యక్రమాలను రాజకీయాలతో జోడించరాదన్న తన ఆదేశాన్ని ధిక్కరించినందుకు రాజలింగంని, 'యూ ఆర్ ఏ ఫైర్ టు ది ఇనిస్టిట్యూట్ *(You are a fire of the institution),* ' అని హెచ్చరించిన జె.సి. కుమారప్ప తన క్రియల ద్వారా ఆయనకు ఎలాంటి హాని కలిగించకపోవడమే కాకుండా, ఆయన అర్థంతరంగా శిక్షణను విరమించి ముస్తాబాద్‌లో శిక్షణ కేంద్రాన్ని నెలకొల్పినప్పుడు హృదయపూర్వకంగా ఆశీర్వదించడం కూడా చదువరులను ఆకర్షిస్తుంది.

గాంధీ మహాత్ముడే కాకుండి ప్రభాకర్జీ, ఆచార్య బన్సాలీ, సురేంద్రనాథ్ బెనర్జీ, కుమారప్ప, ప్యారేలాల్, చిమన్‌లాల్ ప్రభృతుల వ్యక్తిత్వాన్ని కూడా ఈ గ్రంథం ఆవిష్కరిస్తుంది. ఇది పరుచూరి శాస్త్రి, పార్నీకర్‌జీ, భారతానంద్, ఆత్మారాం, ఫతేసింగ్ తదితరుల వృత్తాంతాలను కూడా వివరిస్తుంది.

ఆశ్రమవాసి అర్ధాంగిని సైతం ఒక్క రాత్రికి తలదాచుకోవడానికి కూడా ఆశ్రమ నిర్వాహకులు అనుమతించకపోవడం; పోలీసు అయి కూడా చరఖాను అను నిత్యం ఆడిస్తూ, ఆరాధిస్తూ ఆశ్రమ సభ్యత్వాన్ని ప్రియంగా అభ్యర్థించిన పంత్‌జీ కోర్కెను నిరాకరించడం ఆ వ్యవస్థపట్ల విశ్వాసాన్ని సడలించే సందర్భాలుగా నిలిచిపోతాయన్న భావం నాలాంటి సామాన్యులకు కలుగుతుందనడంలో సందేహం లేదు.

శ్రీ యం.ఎస్. రాజలింగంగారు ఉజ్వలమైన తమ జీవితంలోని అపారమైన అనుభవ సంపత్తిని భావి తరానికి అందించడం కోసం తమ 'ఆత్మకథ'ను రచించి, వెలువరించవలసిన ఆవశ్యకత కూడా ఎంతైనా వుంది.

1-1-/336/20
చిక్కడపల్లి,
హైదరాబాద్-20.
ఫోన్ : 7643230.

**ఎ.వి. జనార్ధనరావు.**
జర్నలిస్టు.

ఒక వజ్రం కనిపెట్టడానికి వందలకొద్ది టన్నుల మన్ను తవ్వి శాయశక్తులా ప్రయత్నించాలి. సత్యమనే వజ్రాన్ని అన్వేషించడానికి మనం మనలో వున్న అసత్యమనే మన్ను తొలగించడానికి దీనిలో వెయ్యోవంతయినా శ్రమపడుతున్నామా? అంటారు గాంధీజీ.

అసత్యమూ, హింసా, నేరమూ, అవినీతీ పెరిగిపోతున్న వర్తమాన సమాజపు చీకట్లలో - సత్యజ్యోతిని వెలిగిస్తూ, గాంధీ మార్గమే భావి ప్రపంచానికి కూడా అనుసరణీయం అని చాటిచెప్పేదిగా వుంది రాజలింగంగారి ఈ పుస్తకం.

ఈ తరానికి ఇంత మంచి ఉపాయనాన్ని అందిస్తున్న రాజలింగంగారు అభివందనీయులు. నవతరం దీనిని సమాదరించాలని నా ఆకాంక్ష. సమాదరిస్తుందని విశ్వాసం.

**సుధామ**

ఆకాశవాణి, హైదరాబాద్.
ఫోన్ : (ఇ)4545780; (ఆ)3230094

# విశ్లేషణాత్మకం

శ్రీ రాజలింగంగారు నాకు చిర పరిచితుడు. వారు రచించిన నిర్మాణము, మినోమసాని *"Socialism Reconsidered"* అనువాదము - స్టాలిన్ పల్లి, ఇంగ్లీషులో వ్రాసిన *"All over a Congress Ticket* లోని అంశములు నన్ను ఎంతైనా ఆకర్షించినవి. నిర్మాణాత్మక సూచనలు చేయుటలో వారికి వారే సాటి. *"All over a Congress Ticket* అను పుస్తకము 1962లో వ్రాయబడినది. దాని అనువాదం పూజ్యులు శ్రీ కోదాటి నారాయణరావుగారు తెలుగులో అనువాదము చేశారు. అది మొదటిసారి కృష్ణా పత్రికలో 1962 ప్రాంతంలో సీరియల్‌గా అచ్చువేయబడినది. తిరిగి 1999లో కృష్ణా పత్రికవారు సీరియల్ మరల దానినే ప్రచురించారు. ఈ గ్రంథాన్ని *"Blitz"* పత్రిక 26 మే 1962 లో భాష చాలా బాగున్నదని ఆనాటి అనేక సమస్యలు అందు పొందుపరచబడ్డవని ప్రకటించింది. *"All over a Congress Ticket"* ను 22 మే 1962లో ఆనాటి ఉప రాష్ట్రపతి శ్రీ రాధాక్రిష్ణన్‌గారు, శ్రీ రాజగోపాలచారిగార్ల ప్రశంస లందుకున్నది. ఆనాటి కార్మిక శాఖామంత్రి జి.ఎల్.నందాగారు ఈ పుస్తకం ముట్టిన వారందరూ తగు శ్రద్ధతో చదువుతారని తన నమ్మకమన్నారు. తాను కొంతభాగం చదివానని అన్నారు. ఉర్దూ పత్రికలు గ్రంథకర్తను ప్రశంసించాయి. ఇది చెప్పటంలో ముఖ్య ఉద్దేశ్యము ప్రతి సమస్యను తగు విశ్లేషణ జరిపి సులభశైలిలో ఒక ప్రత్యేక బాణీలో వ్రాయడం వారి ప్రత్యేకత.

ఈ ప్రత్యేక లక్షణాలే వారు ప్రస్తుతం రచించిన "బాపు-నేను" అను గ్రంథంలో కనబడుతున్నాయి. వికేంద్రీకరణ విషయంలోనూ, ఆర్థిక సమానత్వ విషయంలోనూ, వారు గాంధీ ఆశ్రమంలో వివిధ ఘట్టాలలో పొందిన అనుభవాలను గూర్చి వ్రాసిన భాగాలు నన్నెంతో ఆకర్షించినది. ఈ గ్రంథం నేటికీ రేపటికీ గాంధీజీ సజీవుడే అని రుజువు చేస్తున్నది. ఈ ప్రబోధ గ్రంథాన్ని నేటి యువతరానికి, విద్యార్థులకు అందించిన శ్రీ రాజలింగంగారిని అభినందిస్తున్నాను.

**హైదరాబాద్ - 500 034.**
**ఫోన్ : 9848 052944**

**ఆడుసుమల్లి క్రిష్ణమూర్తి**
సంపాదకులు - నవ్యభారతి

# జీవన ప్రయాగ

ఈ శతాబ్దం చివరికి వచ్చాం. అంతేకాదు. కొన్ని వేల సంవత్సరాల చరిత్రలో ధృవతారలుగా నిలచిన కొందరి పేర్లను మనము ప్రాతఃస్మరణీయంగా చేసుకున్నాము. గౌతమ బుద్ధుడు, వర్ధమాన మహావీరుడు, బసవేశ్వరుడు గురునానక్, శంకరుడు, రామానుజుడు, మధ్వుడు ఇలా ఒక పరంపర వుంది. ఈ శతాబ్దంలో జన్మించిన యుగపురుషుని పేరు మోహన్‌దాస్ కరంచంద్ గాంధీజీ. ఆయన పరమసాధకుడు. రాజకీయము ఆయన యోగసాధనలో ఒక భాగము. సహాయ నిరాకరణము వంటి కొత్త ప్రయోగములు అహింసవంటి నైతిక ఆధ్యాత్మిక దృక్పథము రాజకీయములో ప్రయోగించినవాడు గాంధీజీ. నియమనిష్టలు లేని రాజకీయాలు, మానవతలేని శాస్త్ర విజ్ఞానం, అంతఃకరణలేని ఆనందం, త్యాగము లేని పూజ, నీతిలేని వాణిజ్యం, పనిలేని సంపద, శీలంలేని విద్య అనర్థదాయకములు అని గాంధీజీ దృక్పథము. ఆయన జీవితమే ఒక ఎక్స్పెరిమెంట్ విత్ ట్రూత్. సత్యము అహింస, బ్రహ్మచర్యము, జిహ్వ, నిగ్రహము, అస్తేయము, అపరిగ్రహము, శరీరశ్రమ, స్వదేశీ, నిర్భయత్వం, అస్పృశ్యతా నివారణ, మత సహనము ఇవి ''గాంధీగారి ఏకాదశ మంత్రాలు''. బ్రహ్మశ్రీ వేదమూర్తులైన ముదిగొండ సిద్ధవీర రాజలింగం అన్నయ్యగారు గాంధీగారి ప్రత్యక్ష శిష్యులు వార్ధా, సేవాగ్రామ్‌లతో సన్నిహిత సంబంధం కలవారు. గాంధీగారి ప్రేరణతోనే రాజన్న గొప్ప సాధకుడైనాడు. స్వాతంత్ర్య సమరయోధుడైనాడు. తెలంగాణాలోని గత అరవై సంవత్సరాల సామాజిక రాజకీయ చరిత్రలో ఆయన అవిభాజ్యమైన అంగమైనాడు. ఈనాడు జాతి దాదాపు గాంధీగారిని మరచిపోతున్నది. ఆయన స్థానంలో మరెవ్వరినో ప్రతిష్ఠిస్తున్నారు. అలాంటప్పుడు ఆంధ్ర దేశానికి పరిమితమైన రాజలింగంగారి త్యాగమయ జీవనం ఎందరికి తెలుస్తుంది? గాంధీగారి నుండి వేప ప్రసాదం స్వీకరించి జీవితంలోని

చేదును తీపిగా అనుభవించడం నేర్చుకున్న కర్మయోగి ఈయన. ఆ అనుభవాలన్నీ ఈ పుస్తకంలో పొందుపరచబడ్డాయి. ఒకరకంగా చెప్పాలంటే ఇటు విద్యార్థులకే కాదు, అటు విద్యాధికులకు, వయోవృద్ధులకు కూడా స్ఫూర్తి నిస్తుంది. ఆది విలువలు కనుమరుగై, యాంత్రికంగా ఇరవై ఒకటో శతాబ్దంలోకి అడుగుపెడుతున్న మనకు ఈ పుస్తకం ఒక కరదీపిక.

లోగడ గాంధీగారి గురించి దేశవిదేశాలలో కొన్ని వందల గ్రంథాలు వెలువడ్డాయి. దేని ప్రత్యేకత దానిదే. ఇందులో కొండ అద్దంలో కనపడ్డట్టు, బాపూజీ వ్యక్తిత్వం ఆయన శిష్యులలో ఒక యోధుడైన రాజలింగంగారి కర్మయే జీవన రహస్యం, ప్రభాకర్‌జీ, వినోభాజీ, పార్నీకర్‌జీవంటి వారి ప్రత్యక్ష అనుభవాలు ఈ గ్రంథంలో మనకి దర్శనమిస్తాయి. గాంధీగారికి రాట్నం ఒక సాధనం. ఒక సింబల్. స్వదేశీ దాని పరమార్థం. రాజలింగంగారికి పేపరు చేసే కుటీర పరిశ్రమ ఒక సాధనం అయింది. అందులో ఆయన వ్యక్తిత్వం అంతా ఒదిగింది. ఈ శిష్యుణ్ణి తీర్చిదిద్దిన రూపశిల్పి గాంధీజీ. ఈ గ్రంథం సామాజిక, సాంఘిక, చారిత్రక అంశాలతో కూడుకున్నదే అయినా సాహిత్యసౌరభాలతో కూడిన భారత జాతియ జీవన జాహ్నవిలో ఒక పవిత్ర ప్రయాగ అయింది. పాఠకులందరూ ఈ గంగలో మునిగితే ఇరవై ఒకటవ శతాబ్దంలో అర్థవంతమైన ఒక తరాన్ని మళ్ళీ నిర్మింపవచ్చు. ఇతిశం ః

హైదరాబాద్.
ఫోన్ : 7613668

ప్రొ. ముదిగొండ శివప్రసాద్
ఉస్మానియా యూనివర్శిటి,
హైదరాబాద్

# అక్షర సుమాంజలి

మాన్యులు శ్రీ యం. రాజలింగంగారు సత్యాగ్రహశాంతి సైనికులు. దేశంకోసం జీవితాన్ని పణం పెట్టిన త్యాగమూర్తులు. యుగపురుషుడు. జాతిపిత బాపూజీ శంఖారావం విని పులకించి మాతృభూమి సేవలో అంకితమైపోయి తన సుఖాన్నీ, తనవారి సుఖాన్నీ లెక్కచేయకుండా సేవాయోగంలో జీవితాన్ని ఆధునిక ఋషి ప్రస్థానంలా సాగించిన సాత్వికమూర్తి. త్రికరణశుద్ధితో దేశసేవచేసిన ఒక మహత్తర దేశభక్తుల తరానికి చెంది, ఈనాడు ఆ భవ్యస్మృతులకు ఆప్తవాక్యంలా, ఆత్మీయరూపంలో మన ముందున్న మానవతామూర్తి శ్రీ రాజలింగంగారు.

''నియమనిష్ఠలేని రాజకీయాలు, మానవతాదృక్పథం లేని శాస్త్రవిజ్ఞానం, అంతఃకరణలేని ఆనందం, త్యాగంలేని పూజ, నీతిలేని వాణిజ్యం, పనిలేని సంపద, శీలం లేని విద్య వదలాలి' అని పిలుపునిచ్చిన గాంధీజీ మాటలు వేదవాక్యాలుగా నమ్మారు శ్రీ యం.యస్. రాజలింగంగారు. శిష్టాచార కుటుంబంలో పుట్టి, శివారాధనం నిత్యవ్రతంగా సాగించి, శుచిని పాటించే రాజలింగంగారు జగత్తునే కుటుంబంగా భావించారు. జీవుడినే శివునిగా ఆరాధించారు. గాంధీగారి ఆశ్రమంలో పాకీపని నుండి పెద్దలకు ఆహ్వానం పలికేంత వరకూ వారు సాగించిన సేవాసాధన శాంతియజ్ఞంలా సాగింది. మామూలు సేవకుడి స్థాయి నుండి మంత్రి పదవి దాకా సాగిన వారి ప్రస్థానం నిరాడంబరజీవి నిండుగా సాగించిన నిర్మల ధర్మయాత్ర! అందుకే మాతరానికి శ్రీ రాజలింగంగారు గాంధీయుగం అందించిన ఆశాకిరణం!

'బాపూ-నేను', 'కాంగ్రెస్ టిక్కెట్టుకై - ఇదంతా' అనే గ్రంధాలు మాన్యశ్రీ యం.యస్. రాజలింగంగారి రాజకీయ జీవితమనే నాణానికి బొమ్మా-బొరుసా లాంటివి. రాజలింగంగారి వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దిన భవ్యచరిత్రలోని జ్ఞాపకముంచుకోదగిన వెలుగు కిరణాలు 'బాపూ-నేను' లోని అంశాలు. నిజాయితీగల రాజకీయవేత్తగా పరిణతి చెందిన శిక్షణా క్షేత్రానికి చిరస్మరణీయాంశాల చిత్రశాల ఈ గ్రంథం. ఇది శుక్లపక్షం లాంటిది.

'కాంగ్రెస్ టిక్కెట్టుకై-ఇదంతా' కృష్ణపక్షం లాంటిది. రాజకీయాలలో సేవాభావం తగ్గి, స్వార్థం హెచ్చి, ముఠాతత్వం రాజుకొని, వ్యాపారధోరణి ప్రబలి అధికార దాహంతో రాజకీయపక్షం పక్షవాతానికి గురిఅవుతున్న సమయంలో నిజాయితీపరుడైన గాంధీవాది

ఎలా వంచింపబడి, వెనుకకు త్రోయబడ్డాడో చెప్పే ఒక విషాదగాథ ఇది. దేశభక్తులకు పట్టిన రాజకీయ గ్రహణం ఇందులో బాగా చిత్రించబడింది. ఒకప్పుడు పక్షవాతరోగికి తైలం మర్దించి ఆరోగ్యవంతుణ్ణి చేశారు గాంధీగారు, రాజలింగంగారు. ఇప్పుడు పార్టీకి పట్టిన పక్షవాతాన్ని మర్దించే మహాత్ముడు లేడు. అందుకే రాజలింగంగారు (అటువంటివారు కూడా) ఒంటరి వారయ్యారు. ఇది దేశ దౌర్భాగ్యం!

ఈరెండు గ్రంథాలు మాన్యులు శ్రీ రాజలింగంగారి జీవితచరిత్రలోని రెండు అధ్యాయాలే. ఈరెండూ కలిపి చదువుకుంటేనే చరిత్రగతిలో ప్రతిఫలించిన వెలుగునీడలు స్పష్టవగతాలు. స్వాతంత్ర్యపోరాటం నాటి ఉద్యమతేజం ఒకవైపు, స్వాతంత్ర్యానంతరం దేశాన్ని దోచుకోవడానికి రాజకీయం ఆడే ప్రభూతాంత్రంలోని తంతు మరొకవైపు మనకు గోచరిస్తాయి. 'కాంగ్రెస్ టిక్కెట్టుకై-ఇదంతా ( All over a Congress ticket ' - గ్రంథం చదివితే ఒక ప్యారడైజ్ లాస్ (A Paradise Lost ధ్వనిస్తుంది. 'బాపూ-నేను' చదివితే ఒక 'ప్యారడైజ్ రీగైన్డ్' (Paradise regained !) అనిపిస్తుంది. యువతరం చరిత్ర మైదానంలో ఈ గ్రంథాలు మిగిల్చిన పాదముద్రలను చదివి గాంధీయుగాన్ని మరలా ఈ దేశానికి అందిస్తారని ఆశిద్దాం.

నేను విద్యార్థిగా ఉన్ననాటి నుండి మాన్యులు కోదాటి నారాయణరావుగారు, మాన్యులు శ్రీ యం.యస్. రాజలింగంగారు బలరామకృష్ణుల్లాగా కలిసిమెలిసి తిరుగుతూ మా మనోరంగాల్లో ఆదర్శ సాత్త్వికమూర్తులుగా ఆరాధ్యులుగా ఉన్నారు. శ్రీ రాజలింగంగారు ఇంగ్లీషులో రాస్తే, నారాయణరావుగారు తెలుగు చేశారు. అనేకాంశాలను కవితారంగంలో జంటకవుల్లాగా రాజకీయ సాంఘిక సేవారంగంలో వారిద్దరు జంటయోధులు. ఈ గ్రంథాలు వారి అచ్చమైన స్నేహానికి అక్షరోదహరణాలు!

మా తరం వీరి జీవితాలను స్వయంగా చూచి వీరి పట్ల ఎటువంటి ఆదరగౌరవాలను ఏర్పరచుకున్నదో, అలాగే తరతరాల ప్రజలు ఈ గ్రంథాలను చదివి వారిపట్ల పూజ్యభావాన్ని పెంచుకుంటారని ఆశిస్తున్నాను. నాతరం ప్రతినిధిగా ఈ ప్రతిభామూర్తులకు నా వినయాంజలిని ఈ అక్షరసుమాలతో అర్పిస్తున్నాను.

జి. వి. సుబ్రహ్మణ్యం
Prof. of Telugu (Retd.)
Former Deam, School of Humanities
University of Hyderabad

'శ్రీవాణి', 1-8-702/105,
నల్లకుంట,
హైదరాబాదు-500 044.

# సంస్పందన

1944-45 ప్రాంతాల్లో అంటే, దేశం గూర్చి, సమకాలీన సామాజిక, రాజకీయ పరిస్థితుల గూర్చి అంతో ఇంతో చూచాయగా తెలియవస్తూండిన పదకొండు, పన్నెండేళ్ళ చిన్న వయస్సులో నన్ను అమితంగా ప్రభావితం చేసింది శ్రీ ఎం.ఎస్. రాజలింగంగారు. నా ఇప్పటి ఎదలకు ఆ ప్రభావంలోనే తొలి బీజాలు పడినాయి. ఆయన ఉదాత్త భావనారీతి, ఆచరణ నిష్ఠ, ఉద్బోధకతాశక్తి ఫలితాలనే ఆనాడు అనుభవించానుగాని, వాటి స్వరూప స్వభావాలు, గాంభీర్యం ఆ తరువాతి కాలంలోనే నన్ను నేను పరిశీలించుకొన్నపుడు మాత్రమే అవగతమయినాయి.

ఆయన గాంధీగారి సేవాగ్రాం (వార్ధా) నుంచి తిరిగి వచ్చిం తరువాత వరంగల్లులో 'స్వభాను చేతి పరిశ్రమశాల' నెలకొల్పి కాగితం తయారీ, నవారు నేత వంటి వాటిల్లో మాకు తర్ఫీదు నిచ్చేవారు. గాంధీగారి బేసిక్ విద్యావిధానం గూర్చి ఆ తరువాత చదువుకొన్నప్పుడు రాజలింగంగారు ఆ విధానాన్ని ఆ పరిశ్రమశాలలో ఉపయోగించి వుంటారని తెలిసింది. ఆ రోజుల్లో నావంటి పిల్లగాళ్ల నందరిని చేరదీసి ఈ పనులు నేర్పుటే కాక వాళ్ళతో వ్యాసాలు రాయించటం, ఉపన్యాసాలు చెప్పించటం, చర్చలు చేయించటం, 'చర్చా సంఘాలు' మాతోనే నిర్వహింపజేయటం వంటివి విరివిగా చేయించేవారు. దేశంలో ఆనాటి సామాజిక రాజకీయ పరిస్థితుల గురించి, స్వాతంత్ర్యోద్యమం గురించీ, నాయకుల గురించీ మా స్థాయికి అందేట్టుగా ముచ్చట్లు ముచ్చట్లుగా తెలియజెప్పేవారు. నాకానాడు తెలియవచ్చినంతలో రాజకీయ చైతన్యానికి వరంగల్లులో తీవ్రత సాధించింది రాజలింగంగారే. వరంగల్‌కు ఆయన తన క్రియాశీలాన్ని ధారబోసారనటం నావరకు నాకు అతిశయోక్తి కాదు. ఒక సందర్భంలో ఎన్నికలలో ఆయనకు కాంగ్రెసు టికెట్టు ఇవ్వలేదు. అప్పుడు తన కెందుకు టికెట్టు నిరాకరించబడిందంటూ ఆత్మశోధనరీతిలో ఆయన ఆంగ్లంలోనూ, తెలుగులోనూ రాసిన వ్యాసపరంపర (ఇది ఆ తరువాత గ్రంథరూపంలోనూ వచ్చినట్టు గుర్తు) చదివితే ఈ అంశం స్పష్టపడుతుంది.

రాజలింగారు సుప్రసిద్ధ 'దేశనాయకులు' కాకపోవచ్చు. కాని తాము వున్న ప్రాంతాన్ని చైతన్యవంతం చేసి, క్రియాశీలాన్ని పెంపొందించిన నిష్కామయుడయిన వ్యక్తి. నిజానికి ఏ ఉద్యమాలకయినా ఇట్లాంటి మహానుభావులే మూలస్తంభాలు. వీరి జీవితం ఎన్ని ఇబ్బందులయినా తట్టుకొని లక్ష్యసాధన దిశగా అవిశ్రాంత ప్రస్థానం చేస్తుంది. అందుకని ఇట్లాంటి వారి జీవిత అధ్యయనం వ్యక్తిత్వ నిర్మాణానికీ, వికాసానికీ సన్నిహితంగా ప్రేరకమవుతూ వుంటుంది. అందుకని రాజలింగంగారు వివరంగా తమ 'ఆత్మాన్వేషణ' కు అక్షరరూపం యిస్తే బాగుండేదని చాలా కాలంగా అనుకుంటూ వుండేవాడిని. అయితే, ఆయన రచనావ్యాసం పూర్తిగా (?) ఆపి వేసారు. చాలాకాలం తరువాత నేను భావించిన తీరులో కాకపోయినా, ఏదోరూపంలో 'బాపు-నేను' అనే ఈ గ్రంథం ఆయన రచించటం నాకు సంతోషంగా వుంది. ఆయన రాసుకున్న ఎక్సర్‌సైజ్ నోటుబుక్స్‌ల (అవి డైరీలా?) ఒకటి రెండు చదివిన గుర్తు. అవి ప్రస్తుత రచనకు మూలమనుకుంటాను.

బాలబాలికలకు, విద్యార్థులకు గాంధీయ అనుభవసూత్రాలను, ఆచరణ విధానాలనూ తేలికగా తెలియజెప్పే రచన తాను చేయదలచినట్లు ఈ గ్రంథం ఉపోద్ఘాతంలో రాజలింగంగారు సూచించారు. అందుకే అనేక విషయాలు ముచ్చట్లు ముచ్చట్లుగా ఇందులో మనకు అనుభవం కలిగిస్తున్నాయి. ఇందులోని సన్నివేశాల కాలక్రమం కచ్చితంగా ఉద్దేశించినట్లు కన్పించదు. విషయ ప్రధానంగా వ్యక్తుల చిత్రణ కన్పిస్తుంది. అందుకే ఎక్కడో నాలుగయిదు చోట్ల 1941 అని కన్పిస్తుంది గాని కాలక్రమాన్ని, సన్నివేశాల వరుసను తెలిపే తేదీలు వగైరా లేమీ కన్పించవు. ప్రభాకర్‌జీ, శాస్త్రీజీ, వినోబా, పండిత్‌జీ మొదలయిన వారెందరో ఈ ముచ్చట్లల్లో మనకు దర్శనమిస్తూ వుంటారు. ఇందరిందరి ఆలోచనా తత్పరతకూ, ఆచరణ నిష్ఠకు ప్రేరకమూ, ప్రోద్బలకమయినదంటూ బాపూజీ ప్రభావమే. ఆయన ఎవరినీ ఇది చేయి, ఇది వద్దు అని శాసించిట్లుగా ఎక్కడా ఈ ముచ్చట్లలో కన్పించదు. కాని బాపూజీ ఒకచూపు, ఒక చేష్ట, ఒక మాట, ఒక చిరునవ్వు చాలా విచిత్రమయిన రీతిలో ఇందరినీ శాసించటం ఒక అద్భుతమయిన అంశం. ఆయన తీర్చిన తీర్పుతో ఆలోచనకూ, ఆచరణకూ ఆ భేదాన్ని పాటించే నిష్ఠావంతమయిన జీవిత నిర్మాణం మనకు అవగతమవుతుంది.

ఇందులో స్వాతంత్ర్యోద్యమాన్ని గూర్చిగానీ, రాజకీయు/సామాజికాది సిద్ధాంతాలను, వాటికి సంబంధించిన చర్చలకుగానీ ప్రసక్తి కన్పించదు. అవన్నీ ఇక్కడ ప్రధానమయినవి కావు. వ్యక్తి నిర్మాణం, శక్తిమంతమయిన వ్యక్తిత్వ నిర్మాణం ఇందులో అత్యంత ప్రధానమయిన అంశం. అందుకే చాలా వరకు రోజువారీ చర్యలు, ఆహార విధానం మొదలయిన సామాన్య మనిపించే అంశాలు, రకరకాల వ్యక్తుల యొక ప్రవృత్తు, తప్పు చేయటాలూ, సరిదిద్దుకోవటాలూ వంటివే కన్పిస్తాయి. నిర్మాణ కార్యక్రమ ప్రాధాన్యమే కన్పిస్తుంది. బాలబాలికలకూ, విద్యార్థులకూ ఈ విధమయిన వ్యక్తి నిర్మాణం, వ్యక్తిత్వ నిర్మాణం గూర్చి తెలియటం అత్యావసరం. ఉద్యమాలు ఎన్నయినా రావచ్చు. సిద్ధాంతాలు ఏవయినా కావచ్చు. కాని అన్నింటికీ మూలమయింది వ్యక్తిపరమయిన నిష్ఠ. ఇది లేకపోతే ఎన్ని వుండీ దేశానికి, సమాజానికీ ఏ విధమయిన ప్రయోజనమూ వుండదు.

'తా చెడ్డ కోతి వనమెల్ల చెరచింది' అన్నట్లు ఈనాటి రాజకీయాలు తాము చెడి, దేశాన్నీ అన్ని రంగాల్లోనూ చెడగొడుతున్నాయి. జీవితమంటే రాజకీయాలేనన్న దుష్టమయిన భ్రాంతిని కలిగిస్తున్నాయి. వ్యక్తులను ధనాధికార దాహాలకు తద్వారా అవినీతి ప్రవృత్తులకు విపరీతంగా దోహదం కలిగిస్తున్నది. ఈ దుర్దశ నుంచి సమాజం విముక్తి కావాలంటే వ్యక్తి వ్యక్తిత్వ నిర్మాణ దిశగా బలమయిన కృషితో తక్షణ కర్తవ్యమయి యున్నది. సమర్థులు ఈ విషయంగా తమ ఆచరణ ఆలోచనల ద్వారా ఉద్బోధకత ద్వారా ప్రయత్నించకపోతే ఆ దోషం/పాపం వారిదే. కాగా, నిర్మాణాత్మకమయిన వ్యక్తిత్వ నిర్మాణం అత్యంతావశ్యకమయిన వర్తమాన సమయంలో శ్రీ రాజలింగంగారి ఈ రచనకు ఎంతో ప్రాధాన్యం వుంది. అవసరాన్ని గుర్తించి వెలువరిస్తున్న రచన యిది. గ్రంథం చిన్నదే కావచ్చు. దాని లక్ష్యం, ప్రభావం మాత్రం చాలా గొప్పది. రాజలింగంగారి ఈ రచన ఈ దిశగా ఒక పెద్ద ముందడుగు. అందుకు వారికి నా కృతజ్ఞతలు.

ఈ మాత్రం రాయటానికి నన్ను అనుమతించటం నాపై రాజలింగంగారికి గల వాత్సల్యానికి ఒక చిన్న గుర్తు. వారికి పాదాభివందనలతో....

8-8-55/3, గ్రీన్ పార్క్ కాలనీ,
హైదరాబాద్ - 500 035.
ఫోన్ : 4071444.

ప్రొఫెసర్ కోవెల సంపత్కుమారాచార్య

# జీవనదీపిక

మాన్యులు ఎం.ఎస్. రాజలింగంగారు స్వాతంత్ర్య సమరయోధులు, మేధావులు. సామాజిక న్యాయకోవిదులు, పూర్వ సచివులు, స్వచ్ఛందజీవనులు. వారి అభిప్రాయాలు, ఆదర్శాలు సర్వజన శిరోధార్యాలు.

నిజాం కళాశాలలో విద్య ముగించి, ఆంక్షలు విధించిన నాటి ముష్కర ప్రభుత్వం కంటపడకుండా మారువేషంలో వార్ధాచేరి గాంధీజీ అంటే వాసిత్వంలో పవిత్ర జీవితాన్ని అలవరించుకున్నవారు. సేవా కార్యక్రమాల్లో విరివిగా పాల్గొని గాంధేయవాదిగా గణనకెక్కినవారు. మనం స్వతంత్ర్య జీవనులమై స్వర్ణోత్సవాలు జరుపుకున్నా, ఆనాటి సమరయోధుల ఆదర్శాలకూ, ఆశయాలకూ బహుదూరంగా నిలబడి వుంది నేటి భారతజాతి. ఆశలకేగాని ఆశయాలకు అవకాశం లేని కాలమిది. నేటి ప్రయోజనాల దృష్టేగాని, నాటి త్యాగదృష్టి కరువైన కాలమిది. ఇలాంటి సందర్భంలో ఎనభై ఏళ్ళ జీవితంలోని – ముఖ్యంగా గాంధీజీ సన్నిధిలో తమ అనుభవాలను, పరిశీలనలను ఈ గ్రంథరూపంలో వెలువరిస్తున్నారు శ్రీ రాజలింగంగారు. విషయానుగుణమైన స్వచ్ఛత, ప్రసన్నత వారి అనుభవాల వ్యక్తీకరణంలో పదిలంగా గోచరిస్తాయి. ఒక్కొక్క సంఘటన వెనుక ఒక్కొక్క ఉదాత్తజీవన రేఖ స్ఫురిస్తుంది. తమ అనుభవాల కథనంతోపాటు గాంధీజీ అభిప్రాయాలు కొన్నిచోట్ల సమాంతరంగా పొందుపరిచారు. మరికొన్ని 'యంగ్ ఇండియా', 'నవజీవన్' వారి అనువాదాలను కూడా పేర్కొన్నారు.

ఈ గ్రంథంలోని సందర్భాలు, సంఘటనలు గాంధీగారి ఆత్మీయతను ప్రదర్శిస్తాయి. గాంధీగారిలో రాజలింగంగారు గ్రహించిన విషయాలను విశదీకరిస్తాయి. ఆనాడే రాజలింగంగారి హృదయంలో సాయుధ విప్లవాన్ని గురించి, శాంతియుత పోరాటం గురించి పరిశోధన ప్రారంభమయింది. అయినా వారి దృష్టి ప్రధానంగా సేవాగ్రాం వైపు మళ్లింది. గాంధీజీ దైవారాధన చూసి ఆయనను

రాజలింగంగారు భక్తి, జ్ఞాన ప్రబోధకుడుగా భావించారు. గాంధీజీ ఆశ్రమంలో ఏపూజా జరుపకున్నా ఈయన మాత్రం లింగపూజ జరుపుకునేవారు. గ్రామసేవా కార్యక్రమంలో భాగంగా రాజలింగంగారు సురేంద్రనాథ్‌తో కలసి సేవాగ్రాం గ్రామంలో పారిశుధ్య కార్యక్రమాలు నిర్వహించారు. గాంధీజీ ఆశయాలను హృదయపూర్వకంగా అనుష్ఠించారు. ఆ కార్యక్రమాన్ని గురించి వివరిస్తూ, రాజలింగంగారు మానవ మనస్తత్వాలను వివరంగా చిత్రించారు.

ఆశ్రమంలోకి త్రాచుపాము రాకను, దానికి గాంధీజీ ప్రతిస్పందనను వివరిస్తూ, 'సుందరమైన పాము' అని పలికారని పేర్కొన్నారు. సరిగ్గా వినోభా భావే కూడా గీతా ప్రవచనాల్లో పాము చాలా అందమైనదని అంటారు. ఉదాత్తజీవనుల హృదయాల్లో భయానికి తావులేదని ఈ వివరణ తాత్పర్యం. రాజలింగంగారు ఇలాంటి సంఘటనల్ని వివరించిన తీరు హృద్యంగా వుంది.

శ్రీ రాజలింగంగారు ఈ గ్రంథంలో వివిధ సందర్భాల్లో వివిధ సంఘటనల పట్ల గాంధీజీ వైఖరి ఎలా వుండేదో సహజంగా, సరళంగా విశదం చేశారు. క్రమశిక్షణ పట్ల ఆయన మొండితనం, సంరక్షణ కోసం చేసిన ప్రతిఘటన కూడా అహింసయే అనే గాంధీజీ దృక్పథం, చిమన్‌లాల్జీ పట్ల ప్రదర్శించిన వైఖరి మొదలయిన వాటికి శ్రీ రాజలింగంగారు వివరించిన తీరు వారి మహోత్తమ సంస్కార సమత్వానికి నిదర్శనం.

నేటి సమాజానికి అవసరమూ, ఆదర్శమూ కాదగిన ఇలాంటి గ్రంథాన్ని రచించిన పెద్దలు రాజలింగంగారు. వారి కృషి కొందరి హృదయాల్లోనైనా దేశభక్తి దీపం వెలిగిస్తుందని విశ్వాసం.

ప్రొఫెసర్ ఇ. శివారెడ్డి
డిపార్టుమెంట్ ఆఫ్ తెలుగు
ఉస్మానియా యూనివర్సిటీ.

1-1-336/77
చిక్కడపల్లి
హైదరాబాదు-500 020.

# జీవితానికో ధ్యేయం

మహాత్మాగాంధీ జాతిపిత. మహానాయకుడుగా ప్రపంచం గౌరవించింది. ఏ వ్యక్తినైనా ఆ రాష్ట్రం లేక ఆ దేశం గుర్తించి గౌరవిస్తుంది కాని ప్రపంచమంతా ఆ వ్యక్తిని గుర్తించి గౌరవించిందంటే ఆ మహానుభావునిలోని అతీతమైన గుణగణాలే కారణమని అందరు అంగీకరించక తప్పదు. ఆయన సిద్ధాంతాలు ఆచరణ పథకాలు, ఆచరణ యోగ్యంగా అందరిని ఆకట్టుకునే విధంగా ప్రజలకు ఉపయోగకరంగా, వారికి బానిసత్వపు చీకట్లను నశింపచేసి సంపూర్ణ స్వేచ్ఛావిధీతులను ప్రసాదించేవిగా వెలువడ్డాయి. ఒక మహాత్మునిగా, ఒక మహానాయకునిగా ఆయనకు ఆయనే సాటి.

ఎందరో గాంధీగారిని దర్శించడానికి, వారి దృష్టిలోపడటానికి, వారి సిద్ధాంతాలను, ఆశయాల్లను ఆచరించడానికి తహతహలాడుతూ ముందుకు వచ్చారు. చదువులకు, ఉద్యోగాలకు స్వస్తిచెప్పి, సంసారాలు సంపాదనలు వదలి నిస్వార్ధంగా కదలి వచ్చిన యువతరంలో మొదట పేర్కొనదగినవారు శ్రీ ఎం.ఎస్. రాజలింగంగారు. ఒక విద్యార్థిగా, ఒక యువ కార్యకర్తగా, దేశభక్తునిగా ఒక ధ్యేయాన్ని ఏర్పరచుకున్నారు. తండ్రి ఉద్యోగం చేయమన్నా అంగీకరించక, ఆనాటి నిజాం ప్రభుత్వం పెట్టిన ఆంక్షలను ఉల్లంఘిస్తూ, మహాత్మాగాంధీ ఆశ్రమం వైపు కదలిన నిస్వార్థ సేవామూర్తి శ్రీ రాజలింగంగారు.

ఆశ్రమంలో గాంధీజీ, కస్తూరిబాల సాన్నిహిత్యంలో జీవించడం రాజలింగంగారికి జీవితంలో ఒక మహదాశయంగా భావించాలి. గాంధేయవాది, నిస్వార్థ సేవామూర్తి ప్రభాకర్‌జీతో ఆశ్రమ జీవితం గడపడం, జవహర్‌లాల్ నెహ్రూ, రాజగోపాలాచారి, స్వామి రామానంద తీర్థవంటి వారి పరిచయాలు శ్రీ రాజలింగం గారిని ఒక మహావ్యక్తిగా తీర్చిదిద్దాయి. మహాత్ముని ఆశయాలు, సిద్ధాంతాలు పూర్తిగా అర్థం చేసుకున్న రాజలింగంగారు గాంధీయవాదిగా మారే అవకాశం కలిగింది.

గాంధీగారి సిద్ధాంతాల మీద, ఆశయాల మీద వారి పరిచయాలలో వెలువడిన గ్రంథాలు ఎన్నోవున్నాయి. అందరికి ఎంతగానో ఉపకరిస్తున్నాయి కూడా ! కాని భావి భారతపౌరులైన విద్యార్థులకు, యువతరానికి అవసరమయ్యే విధంగా ఈ చిన్ని పుస్తకం రాయాలనే వారి కోరిక వారి మహదాశయానికి తార్కాణం.

ఇందలి శైలి, చిత్రపటాలు, చెప్పే విధానము నిజంగా యువతరాన్ని, విద్యార్థిలోకాన్ని ఆకట్టుకునే విధంగా వుందని చెప్పవచ్చు. ఇద ఒక నవల. కథ కాకపోయినా రాజలింగంగారి అనుభవం, ఒక కథగా మంచి ఆకర్షణీయంగా రచించారు. ఆశయసాధనకు రూపకల్పన చేసారు.

ఈ గ్రంథ ప్రారంభంలో పిట్టలదొర వేషంలో రాజలింగంగారు నిజాం ఆంక్షల నుండి తప్పించుకుని వార్ధా చేరడం ఎంతో ఆకర్షణీయంగా వర్ణించారు. గ్రామీణ విద్యాలయంలో ఆయన గానుగ పరిశ్రమ, తేనెటీగల పరిశ్రమ, కాగితం పరిశ్రమలలో శిక్షణ పొందడం ఎంతగానో ఆకర్షిస్తుంది. నేల విడిచి సాము చేస్తున్న ఈనాటి పథకాలకు కళ్ళు తెరపించే కుటీర పరిశ్రమాభివృద్ధి ఇందులో ద్యోతకమవుతుంది. శ్రీ రాజలింగంగారు పేరు ప్రార్థన రిజిష్టరులో ఏ విధంగా రిజిష్టరయిందో, గాంధీగారిని ఏ విధంగా గురువుగా భావించారో ఈ గ్రంథంలో ఆకర్షణీయంగా వర్ణించారు. పరిసరాలు-పారిశుభ్రత అనే అంశంలో సేవాగ్రామ్‌లో సఫాయి పనిచేసిన తీరును, గ్రామస్థులు నిరసన ప్రకటించిన తీరు, గాంధీగారు వారికి జ్ఞానోదయం కలిగించిన తీరు ఎంతో సమంజసంగా వర్ణించారు. 'కస్తూరిబా-పాము' ఇది కథ కాదు. యథార్థ సంఘటన. వర్ణించిన తీరు గాంధీ ఆశయం చదువరులను ఎంతగానో ఆకట్టుకుంటుంది. గాంధీజీ-జిన్నా భేటీ అనే అంశాన్ని ఎంతో చక్కగా ఈ గ్రంథంలో పొందుపరిచారు. 'తాము తీసిన గోతిలో తామే పడతారు' అనే సామెతను నిరూపించారు.

'పరుచూరిశాస్త్రి - కుష్టువ్యాధి' అనే అంశంలో కుష్టువ్యాధి పీడితుడైన శాస్త్రిగారిలో చావాలనే పట్టుదల. అంతకంటే పట్టుదల గాంధీ స్వభావం చివరకు గాంధీగారి విజయం సాధించిన విషయం ఒక మహానాయకునకు కావలసిన ఆత్మ స్థైర్యంపట్టుదల ఎంతో బాగా చిత్రించారు. 'గోశాల-గోసేవ' అనే అంశంలో గోవుల వల్ల కలిగే ఉపయోగాలు, గోసేవా ఆవశ్యకత ఎంతో బాగా వర్ణించారు. ''బాపు గుడిసె నేటికీ అలాగే వుంది. అచటి నుండే బాపు ఆలోచనలు నేటికి యావత్ ప్రపంచాన్ని ఆకర్షిస్తున్నాయి.'' అని చాటి చెప్పిన వ్యక్తి రాజలింగంగారు. ఇందులో ఆంధ్రా నాయకులైన పట్టాభి సీతారామయ్య, కళా వెంకట్రావుగారల ప్రస్తావన నన్ను ఎంతగానో ఆకట్టుకుంది. నిస్వార్థ సేవామూర్తి, వాక్ చమత్కారి అయిన కళా వెంకట్రావుగారు మా నాన్నగారు కె.సూర్యనారాయణగారికి ఆదర్శప్రాయులు. గాంధీగారి ఆశయాలు, వారి సిద్ధాంతాలు ఆచరణకు వారిలోని పట్టుదల ఈ గ్రంథంలో ఎంతో ఆకర్షణీయంగా వర్ణించారు. వారి అహింసా సిద్ధాంతము, సత్యాగ్రహాలు ప్రపంచానికి ఆదర్శాలు. ఎంతో ఆకర్షణీయంగా వర్ణించబడిన ఈ గ్రంథంలోని అంశాలు చదివి భావితరాలు రామరాజ్య స్థాపన చేయాలనే రచయిత కోరిక నెరవేరుతుందని ఆశిద్దాం. శ్రీ ఎమ్.ఎస్. రాజలింగంగారికి ధన్యవాదాలు.

హైదరాబాద్ - 500 036.
ఫోన్ : 4549198

**డా. వాసా ప్రభావతి**
ప్రాంతీయ ఫిల్మ్ సెన్సార్ బోర్డు మెంబరు.

# అపురూపమైన ఆత్మకథ

గౌరవనీయులు శ్రీ ఎం.ఎస్. రాజలింగంగారు త్యాగశీలియైన రాజకీయవేత్త, వయోధికుడైన విజ్ఞానవేత్త. ప్రజాసేవకు అంకితమైన ఆయన సుదీర్ఘజీవితంలో జాతిపిత పూజ్య బాపూజీ సన్నిధిలో వార్ధాలో సేవాగ్రాంలో గడిపిన కాలం ఆయన నెంతగానో ప్రభావితం చేసింది. విద్యార్థి నాయకుడుగా ఆయన నెరపిన అందోళన కార్యక్రమాల వలన, ఆయన నేదో కేసులో ఇరికించాలని ప్రయత్నించిన పోలీసుల నుండి తప్పించుకోవడానికి 1941లో ఆయన చేసిన వార్ధా ప్రయాణం మహాత్మాగాంధీ సిద్ధాంతాలను, జీవన విధానాన్ని ప్రత్యక్షంగా, పరోక్షంగా అధ్యయనం చేయటానికి దారితీసింది. పర్యవసానంగా ''బాపు-నేను'' అనే ఈ అపురూపమైన ఆత్మకథ వెలువడడం ముదావహం.

మాన్యులు శ్రీ రాజలింగం గారు అంటారు - గాంధీజీ జీవనాన్ని గురించిన పుస్తకాలకు కొరతలేదు, కాని బాలబాలికలకు, విద్యార్థులకు గాంధేయ షనుభవ సూత్రాలను, ఆచరణ విధానాలను తేలికగా తెలియజెప్పు రచనలు లేవనే చెప్పవచ్చును. ఆ లోటు తీర్చుటకై చేసిన ప్రయత్నమే ఈ చిన్ని పుస్తక ప్రచురణం''. ఒక్క ముక్కలో ఆయన ప్రకటించిన ఉద్దేశ్యాలు ఎంతో సమర్థవంతంగా నెరవేరినట్లు గ్రంథంలోని ప్రతి పుటా నిరూపిస్తున్నది.

పుస్తకం చిన్నదే అయినా, సరళ సుందరమైన భాషలో, అనుభవపూర్వకంగా, ఆలోచనాత్మకంగా, చరిత్రాత్మక సంఘటనలకు, బాపూజీ భావధారలను విశ్లేషించిన విశిష్టతను సంతరించుకుంది. ఇందులో చోటు చేసుకున్న విజ్ఞానదాయకమైన అంశాలన్నిటినీ, రచయిత ఎక్కడకక్కడ పతాకశీర్షికలుగా, ఉప శీర్షికలుగా పరచి చూపడం పాఠకుల కెంతో ఉపయుక్తంగా ఉంది. విద్యార్థులకు, చిన్నారులకే కాదు తలపండిన పెద్దలు కూడా తలలూపేటట్లు కథాకథనం సాగింది.

వేపాకు ప్రసాదం, విగ్రహారాధన, పరిసరాలు-పారిశుభ్రత, హింస-అహింస, హరిజనోద్ధరణ, వ్యాపారనీతి, సహిష్ణుత, గ్రామీణ విద్యాలయం, బుద్ధిజీవుని ఆహారం, దారిద్ర్యం, పశు సంరక్షణ, భయరాహిత్యం వంటి మహత్వపూర్ణమైన విషయాలపట్ల

బాపూజీ వెలుబుచ్చిన అమూల్య భావాలను ఉటంకిస్తూ శ్రీ రాజలింగం గారు చేసిన వివేకాత్మక వివేచనం ఈ పుస్తకం నిండా గుబాళిస్తున్నది. అలాగే దేశనాయకుల ప్రస్తావన కూడ ఎంతో ఆసక్తికరంగా, సందర్భోచితంగా కొనసాగింది. గాంధీజీయే ''తన గురువు''గా భావించి సేవించిన ప్రభాకర్‌జీవంటి గాంధేయుల సాహచర్యంలో శ్రీరాజలింగం (రాజా) పొందిన అనుభూతులకు కూడా ఈ పుస్తకం అద్దం పట్టింది. బహుముఖ ప్రతిభాశాలియైన ఈ గ్రంథకర్త ఒక మహోన్నత మానవతావాదిగా, ఉత్తమ రచయితగా, మేటి మేధావిగా దర్శనమిస్తున్నాడు.

గాంధీజీ సిద్ధాంతాలపట్ల, జీవన సూత్రాలపట్ల ప్రపంచవ్యాప్తంగా వినూత్న ఆసక్తి పెంపొందుతున్న ప్రస్తుత నేపథ్యంలో, ''బాపు-నేను'' గ్రంథరాజం యువలోకానికి ఎంతో ఉపయుక్తంగా ఉంటుంది. నేనీ మధ్య మెక్సికో దేశంలోని ''ఆకాపులుకో'' నగర మధ్యంలో నెలకొల్పిన గాంధీజీ కాంస్య విగ్రహం సందర్శించి పులకించాను. సాయుధ విప్లవాలు సాధించలేని సాంఘిక రాజకీయ పరిణామాలను శాంతియుత సంస్కరణ మార్గంలో సాధించిన గాంధీజీ గత సహస్రాబ్దికే ఒక గర్వకారణం. అలాంటి కారణ జన్ముని అనుగ్రహాశీస్సులు పొందిన స్వాతంత్ర్య సమరయోధుడు శ్రీ రాజలింగంగారు నిజంగా ధన్యుడు. ఆయన త్రికరణశుద్ధితో చేస్తున్న కృషిని ఆబాల గోపాలం గుర్తిస్తుందని ఆశిస్తున్నాను. ఆయన ఇలాంటి దేశభక్తి ప్రేరణాలు, ఆత్మవిశ్వాస శక్తి కారకాలైన రచనలెన్నో చేయాలని ఆకాంక్షిస్తూ వినయపూర్వకంగా అభినందిస్తున్నాను.

''ఆరిపోవని వెలుగుచిమ్మి ఆరిపోయిన దీపికా !
వాడిపోవని పూలుపూచి వాడిపోయిన మల్లికా !
నిన్ను కన్నుల చూడలేదు నీ వెలుగు చూచితి మహాత్మా
బ్రతుకు తీవెను గంటి, నీ నవభావ సుమగంధములు బాపూ ! ''

అంటూ నే నేనాడో పాడుకున్న పాటలోని 'వెలుగును' ఈ పుస్తకం ద్వారా మళ్ళీ నాకు చూపించిన శ్రీ రాజలింగంగారికి కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

ప్లాట్-10, రోడ్-5, జూబ్లీ హిల్స్,
హైదరాబాద్ - 500 038.
ఫోన్ : 3608381

**జె. బాపురెడ్డి**
ఐ.ఎ.ఎస్. (రిటైర్డ్)

# అసలైన గాంధేయవాధి

సిసలైన గాంధేయవాధి శ్రీరాజలింగంగారు రచించిన "బాపు-నేను" చాలా ఉత్తేజకరంగా వుంది. జాతిపితతోనూ, వారి సమకాలీనులైన ప్రభాకర్‌జీ, కుమారప్ప, యిత్యాది నాయకులతోనూ సన్నిహిత సహజర్యముచేసి, వారి అనుభవాలను ప్రజలకందించ గలిగిన బహుకొద్దిమందిలో వీరొకరు. వీరి గ్రంథములో సత్యం, నిర్భయత్వం ప్రస్ఫుటంగా కనిపిస్తాయి.

సేవాగ్రాం వదిలి వెళ్ళేటప్పుడు రాజలింగంగారు పెద్దలకు సూచించిన పద్ధతిలోనే నిర్మాణ కార్యక్రమాలలో చిత్తశుద్ధితో పాల్గొన్నారు. వారు గ్రామీణ నిర్మాణ కార్యక్రమాలెన్నో చేపట్టి వుంటారు. కాని వాటిలో పెనుతుఫాను తాకిడికి ఉప్పెనలో చిక్కి ఛిద్రమైన దివిసీమ పునర్నిమాన యజ్ఞములో వారు చూపిన కార్యదీక్ష నన్ను ముగ్ధుణ్ణి చేసింది. కమ్మనవోలు గ్రామాన్ని గాంధీగ్రాంగా పునర్మించిన తీరు అందరికీ ఆదర్శ ప్రాయమైంది.

వారి రచన భారతీయ యువతకు అత్యంత స్ఫూర్తిదాయకం కాగలదనుటలో సందేహాము లేదు.

ఆవుల చెంగప్ప

# పవిత్ర ఆశయంనకు అభినందనలు

శ్రీ యం.ఎస్. సేవాగ్రాంలో గాంధీజీ వ్యక్తిత్వముతో ప్రభావితులై తన అనుభవాలను, సిద్ధాంతాలను అందించే తపనతో రానున్న తరాల వారి బాధ్యతలు, కర్తవ్యం తెలియచేయాలనే దీక్షతో పట్టుదలతో సాధనచేసి సామర్థ్యాన్ని పెంచుకోవాలనే ఉద్బోధగా ఈ రచన గావించారు.

'బాపూజీ' మహాత్మా గాంధీగా ప్రపంచదేశాల్లో అహింస, సత్యమును తన ప్రత్యేక శైలిలో చాటిన ఈ మిలీనియం మహామనీషి.

జటిల సమస్యలను సరళం చేయడంలో ఎదుటివ్యక్తిని నొప్పించకుండా, తాను బాధపడకుండా, తన సంభాషణా చాతుర్యంతో అందరిని మెప్పించే విధము ప్రవర్తించడములో ఆయనకు ఆయనే సాటి. కాబట్టి భారతజాతి అంతటిని ఒకే త్రాటిపై నడిపించి జాతిపిత కాగలిగారు.

ప్రభాకర్‌జీతో సన్నిహితంగా యుండి వారి ఆదరణతో ఆప్యాయతతో గాంధీజీని ఎన్నో దృక్కోణములతో అవగాహన చేసికొని ఈ రచనను సాగించినారు.

సమాజవ్యవస్థలో శాంతి సౌభ్యాలను నెలకొల్పుటకు ఏడు నియమాల ఆవశ్యకతను జ్ఞప్తికి తెచ్చినారు.

స్వదేశీ జండాన్ని తిరిగి ఎగురవేయాలనే ఆకాంక్షతో యున్న శ్రీ యం.ఎస్. రాజలింగంగారు అభినందనీయులు.

ఈ పుస్తకము తొందరగా వెలుగుచూడాలని, యువతరం చేతులలో యుండి మార్గదర్శకంగా దేశాభ్యుదయానికి తోడ్పడాలని, గాంధీజీ నమ్ముకున్న శ్రీరామచంద్రుని మనసారా ప్రార్థించుచున్నాను.

14-2-332/ఎఫ్,
హైదరాబాద్ - 500 012.
ఫోన్ : 46688

**జి. నారాయణరావు**
ఐ.ఎ.ఎస్. (రిటైర్డ్)

# రెండు మాటలు

నిజాం కాలేజీలో బి.యస్సీ చదివినా. గాంధీజీ సిద్ధాంతాల అధ్యయనంలో శాంతి, సుఖం, సంతృప్తి, సంతోషాలు పొందుతూ, మంత్రి పదవి చేపట్టినా నిరాడంబర జీవితాన్నే ఎన్నుకొన్న గాంధేయవాది, ప్రముఖ న్యాయవాది, ప్రచారమే సర్వస్వమనే ప్రపంచంలో ప్రచారమక్కరలేని సాంఘిక, చారిత్రక కార్యక్రమాల్లో, సంఘటనల్లో, సన్నివేశాల్లో పాల్గొన్న పెద్దలు, మాన్యులు స్వాతంత్ర్య సమరయోధులు శ్రీ ఎం.ఎస్. రాజలింగంగారు బాపూతో తన అనుభవాల తీయని అనుభూతిని అక్షరీకరించారు ఈ 'బాపూ–నేను' గ్రంథంలో. ఇది గ్రంథం గాదు – స్ఫూర్తిదాయకమైన జీవనదర్పణం.

ఆనాడు ఆశ్రమంలో వుండేవారు ఎంత చనువున్నా, బాపూతో ఫోటో దిగాలని యత్నం చేయలేదు. ఎంతో అవకాశమున్నా నేను గాంధీజీతో ఫోటో దిగలేదు. ఆ రోజులలో అది చిన్నతనంగా వుండేది''.... ఈనాటి స్థితిగతులకు ఈ మాటలు అన్వయించగలమా? ఎంతటి దిగజారుడుతన మావహించింది?

బాపూను చూడటం, బాపూతో మాట్లాడటం, బాపూతో నాలుగడుగులు కలసి నడవడం ఎంతో అదృష్టంగా భావించేవారి రోజుల్లో నుండి బాపూను దూషించే దిక్కుమాలిన మనుష్యులున్న ఈ రోజుల్లో ఈ గ్రంథం కనువిప్పు కల్గించాలని ఆశిస్తూ – ఈ రెండుమాటలు వ్రాయటం నా సుకృతమేనని భావిస్తూ .....

హైదరాబాద్ – 500 028.
ఫోన్ : 3319272

కె. వి. రమణాచారి ఐ.ఏ.ఎస్
ఆం. ప్ర. ఖాదీ విలేజ్ ఇండస్ట్రీస్ బోర్డ్.

# మార్గదర్శి

1944 సంవత్సరములో నేను వరంగల్ కాలేజీలో ఇంటర్‌మీడియట్ చదవుతున్న రోజులలో నిజాం రాష్ట్రములో తెలంగాణా వెనుకబడిన ప్రాంతమైనా వరంగల్‌జిల్లా రాజకీయంగా చాలా చైతన్యవంతమైనది. నిజాం ప్రభుత్వం వందేమాతరం గీతాలాపన నిషేధించినందుకు పర్యవసానంగా మా ఇంటర్‌మీడియట్ కాలేజీ విద్యార్థులు అంతకు పూర్వం మూడు, నాలుగు సంవత్సరాల ముందు కాలేజీని బహిష్కరించి నాగ్‌పూర్, పూనాలో కాలేజీలో చదువు పూర్తి చేసుకోవటం మా అందరిలో రాజకీయ చైతన్యానికి మూలకారణమయింది. ఆ రోజుల్లో ఖద్దరు బట్టలు ధరించటం ప్రభుత్వం ఒక రాజకీయ నేరంగా పరిగణించేది. ఇట్టి తరుణంలో వరంగల్ వాసియైన శ్రీ ఎం.ఎస్. రాజలింగంగారు వార్ధాలో గాంధీజీ ఆశ్రమంలో తర్ఫీదు పొంది వచ్చారని, మాతోటి విద్యార్థులను సంబోధిస్తారని తెలిసి చిన్న సంచలనం వ్యాపించింది. నిజాం రాష్ట్ర ఆంధ్ర మహాసభల్లో వామపక్షంగా వ్యవహరించిన ఆంధ్ర జాతీయపక్షం నాయకుల్లో వారొకరు. ఈ జాతీయ పక్ష కార్యక్రమాల్లో గాంధీజీ నిర్మాణకార్యక్రమం మరియు ఇతర రాజకీయ సమస్యల గురించి ప్రసంగించేవారు. ఇట్టి మీటింగులకు నేను హాజరయే వాడిని. చేతితో తయారైన కాగితంపై రాజకీయ సమస్యలపై వ్రాసి కరపత్రాలు అచ్చువేయించేవారు. గాంధీజీ వార్ధా ఆశ్రమంలో తర్ఫీదు పొందిన నిర్మాణ కార్యక్రమాన్ని అమలు పరచటానికి వరంగల్ వద్ద నున్న స్థంబంపల్లి గ్రామంలో ఖాదీ, ఇతర గ్రామ పరిశ్రమల కేంద్రాన్ని సర్వోదయ సంఘం పేర స్థాపించి శ్రీ బి.హెచ్. చంద్రమౌళీశ్వరరావు, కే.శే. రంగనాయకులు, మల్లికార్జునరావు, శ్రీరాంచంద్రమౌళి తదితరుల సహాయంతో 20 సంవత్సరాలు నడిపారు.

గాంధీజీ వార్ధా ఆశ్రమములో ప్రముఖ గాంధేయ ఆర్థిక సిద్ధాంతవేత్తయిన డా. జె.సి. కుమారప్పగారి గురించి శ్రీ రాజలింగంగారు చెప్పుతుండేవారు. డా. కుమారప్ప లండన్ స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్‌లో చదివినవారైనా భారతదేశ పరిస్థితుల ననుసరించి కుటీర పరిశ్రమల ప్రాముఖ్యత గురించి సిద్ధాంతపరమైన వ్యాసాలు ఎన్నియో వ్రాశారు. ఆ రోజుల్లో అట్టి ఒకటి రెండు వ్యాసాలను నేను ఉర్దూలో తర్జుమా చేసి ''రహనుమా'' అను వారపత్రికలో వేశాను.

శ్రీ రాజలింగగారు కలిగించిన చైతన్యం, యిచ్చిన స్ఫూర్తితో నేను గత 55 సంవత్సరాల నుండి ఖద్దరు ధరిస్తున్నాను. ఆ చైతన్యంతోనే నేను హైద్రాబాదు స్వాతంత్ర సమరంలో విద్యార్థిదశలోనే కీ.శే. శ్రీ టి.హయగ్రీవాచారి గారి నాయకత్వంలో పాల్గొనటం జరిగినది:

శ్రీ రాజలింగంగారి జీవితం చాలా ఆదర్శవంతమైనది. ఎందరినో ఆదర్శ జీవిత మార్గాన నడిపించుటకు ఉత్తేజపరిచినది.

శ్రీ రాజలింగం గారు రాసిన 'బాపు-నేను' అనే గ్రంథంలో వారు నిర్మాణ కార్యక్రమానికి పునాది అయిన గాంధేయ ఏకాదశ సూత్రాలను పేర్కొన్నారు. నైతిక విలువలు దిగజారుతున్న ఈరోజుల్లో శ్రీ రాజలింగంగారు అందించి ఈ గ్రంథం ముఖ్యముగా రేపు కాబోయే పౌరులయిన యువకులకు, మాకు మాదిరిగానే మార్గదర్శకంగా వుండగలదని, ఆదర్శవంతంగా, నైతిక విలువలకు ప్రాధాన్యత నిచ్చుటకు స్ఫూర్తినీయగలదని నా విశ్వాసం. వారి ఈ ప్రయత్నం ఎంతో శ్లాఘనీయమైనది. వారికి నా ధన్యవాదాలు.

1-10-233/1,
అశోక్‌నగర్,
హైదరాబాద్ - 500 020.
ఫోన్ : 7611494

**సి.హెచ్. కొండయ్య.** ఐ.ఏ.ఎస్. (రిటైర్డ్)
కోశాధికారి
వరంగల్ జిల్లా ఆం.ప్ర. స్వా.స. సంస్థ

# ప్రశంస

తనదంటూ సిద్ధాంతం ఏమీ లేదని సత్యాహింసలు అనాది కాలం నుండి వచ్చినవేనని మహాత్మాగాంధీ పదేపదే చెప్పినప్పటికీ లోకం ఆయనను సత్యాహింసల ప్రవక్తగానే పరిగణిస్తున్నది. ఆయన జీవితాన్ని గురించి ఎన్నో ఉద్గ్రంధాలువెలువడినవి. అయినప్పటికి ఆయన వ్యక్తిగత జీవితంలోని విభిన్న సన్నివేశాలను గురించి లోకానికి అంతగా తెలియదు. సత్యంకోసం సాధనకు జీవితాన్ని ధారపోసిన ఆయన జీవితంలోని ప్రతి అంశము ఎంతో విలువైనది. సామాన్య మానవునికి కాదు - మహామహులకు కూడా జీవితంలో సాధనకు అవి ఎంతో ఉపకరిస్తాయి. అవి చాలామటుకు గ్రంథం కాలేదు.

మిత్రులు శ్రీ యం.యస్.రాజలింగంగారు గాంధీజీ సన్నిధిలో దాదాపు రెండు సంవత్సరాలు ఉన్నారు. వీరికితోడు గాంధీ ఆశ్రమంలో చిరకాలం గడిపిన కీ.శే. ప్రభాకర్‌జీ, అదే సమయంలో గాంధీ సన్నిధిలో ఉన్నారు. వీరు ఉభయులకు తెలిసిన సన్నివేశాలు కొన్నయినా ఈ పుస్తకం ద్వారా మనము తెలుసుకోవచ్చును. వీటిని పాఠకలోకానికి అందించుటకు పూనుకున్న శ్రీ రాజలింగంగారిని ప్రశంసిస్తున్నాను. ఇవే కాకుండా ఇంకా అనేక వృత్తాంతాలు రాజలింగంగారు పాఠకలోకానికి అందిస్తే చాలా గొప్ప మేలు చేసిన వారవుతారు.

1-1-336/16
Chikkadpally
Hyderabad - 500 020.
Phone : 7636980.

డా. కోదాటి నారాయణరావు
కార్యదర్శి
గాంధీ స్మారక నిధి.

# స్మృతిపథం

వేడి వడగాల్పులకు డస్సిన మనసు శరత్కాలపు పౌర్ణమినాటి చల్లని రాత్రిని జ్ఞాపకం తెచ్చుకున్నట్లు
గా హాయి ఆవహించింది మనస్సునిండా... మీ "బాపూ-నేను".
పుస్తకం అందుకొన్న క్షణాన మొదలు పెట్టి... చివరి పేజీ దాకా చదివింపజేసింది మీ "బాపూ "
మీ, "...-నేను" చదువుతూ వుంటే ఒక జ్ఞాపకం నా స్మృతిలో మెదులుతూ వుంది. .....
1977-78 డిశంబర్, జనవరి నాటి సంగతి. సముద్రం పొంగి ఉప్పెనై దివిసీమ దెబ్బతిన్న
రోజులు. వేలమంది బాధితులకు భోజనం, వస్త్రం, వసతి, వీటిని మించిన పరామర్శ, ఆదరణ
అందిస్తున్న మీతోపాటు నేను కూడా రోజుకు 19 గంటలు శ్రమించిన నాటి దృశ్యం... అప్పుడు!
"నాకూ పని చెప్పండి హేమలతదేవి గారూ" అని ఒక పెద్దమనిషి అడిగినప్పుడు.
"లారీల కొలది పాత బట్టలు వచ్చి గోడౌన్ నిండిపోయింది. బాధితలకై, వాటిని విడదీసి
మూటలు కట్టాలి, ... కట్టగలరా?" పని అడిగిన పెద్దమనిషికి పని అప్పగించాను.
ఆ పెద్దమనిషి రోజుకు ఎనిమిది గంటలు (పగలంతా!). పనిచేసి, ఐదురోజుల్లో అప్పగించిన
పని పూర్తి చేశారు నిశ్శబ్దంగా!!
ఆ నిష్కామ కార్యకర్త, ఆ సత్యాగ్రహి, ఆ నిశ్శబ్ద, నిరాడంబర, గాంధేయవాది, ఆ స్వాతంత్ర్య
సమర వీరుడు ... "యం.యస్" అని ఆనాడు నాకు తెలియదు.
ఇవ్వాళ "బాపూ-నేను" అనే యీ డైరీవంటి అహింసాత్మక ఆత్మకథ చదువుతూవుంటే - ఆ
సత్యాగ్రహి నా మనోఫలకం దాటి ఎంతో ఎత్తుగా నా ముందు నిలుచున్న వారి ముందు, ...
నేను "మరుగుజ్జు"నై నిలబడి మనస్కరిస్తున్నాను! అవనత శిరస్కనై!!
.. ఎంచేత? ... ఎందరెందరో త్యాగమూర్తులు, నిరాడంబర సత్యాగ్రహులు, మీవలె తెరచాటుననే
వున్నారే? వారికి - యీనాటి మేము ఎంత గుర్తింపునిస్తున్నాం? ఎంత సన్మానం? ఎంత
కృతజ్ఞత? ... చూపగలుగుతున్నామా? అని.
మీ "బాపూ-నేను" చిన్న పిల్లలూ చదువుతారు. "మహాత్మాగాంధి? బాపూ?" యీ ప్రశ్నలకు
ఈ పుస్తకం పండు ఒలిచి తినిపించినంతగా "బాపూ" అర్థం అవుతారు - చిన్నారులకు కూడా

నమస్కరిస్తూ, మీ సోదరి

**హేమలత**

డైరెక్టరు, జాషువా ఫౌండేషన్

శ్రీనివాస ఎపార్టుమెంట్సు
శ్రీనగర్ కాలని, హైదరాబాదు - 500 073.

# MOVING SPIRIT

I have great pleasure to know about what Sri M.S.Rajalingam has written on his life experience and contact with the leaders of the days when he was in Wardha, Maganwadi village industries Association and also in Sevagram, Gandhi Ashram. I heard him read a few pages of the manuscript, also his version of some of the anecdotes relating to his doings and experiences.

I have known Sri Rajalingam for long when we were associated with Khadi prachar work through Khadi Prachar Sangh, Warangal, a branch of the Sangh Hyderabad State Organisation founded and forwarded by Sri Ramakrishna Dhot of Grama Seva Kendram Shivarampalli, Hyderabad. Sri Rajalingam was the moving spirit of the Warangal branch in association with his collegues Sri Bhandaru Chandramouleshwara Rao, Late Sri Ram Chandramouli, Ranganayakulu and P.Venkataiah. Later, they also collectively worked to establish Sarvodaya Ashram, in Shambampalli on the outskirts of Warangal. During that period I used to visit Sarvodaya Ashram frequently and it was then that I had the pleasant privilege of hearing a number of such anecdotes relating to his life in Maganwadi, wardha, Sevagram ashram and his close association with Late Prabhakarji who was an image of the ashram and served Gandhiji almost till the martyrdom of Mahatma Gandhi. Therefore, I have a real insight into the useful content of the book though I did not chance to peruse it. In Gandhiji's Ashram and all institutions associated with Gandhiji this constructive programme, ashram prayer was done both in morning and evening i.e. while beginning and

closing of the days work. The ashram prayer consisted of Ekadasa (eleven) vratas and they were intended to be not merely repeated but practiced in one's life. As such, it is natural that some of the anecdotes dwell upon those and help readers to understand the importance and imperatives of practicing the Eleven Sutras. As the incidents are of personal experience they are expected to be not only interesting but also instructive.

Hence, I endorse what Pro. I.V.Chalapathi Rao has mentioned about its usefulness to students to study them, understand and appreciate their values and imbribe them in their lives - That is bound to bring about a healthy change in the atmosphere of educational institutions which are now-a-days plagued with corruption, nepotism and violence. I do hope the department of Education of the Govt. of Andhra Pradesh will pay heed to the suggestion of Prof. I.V. Chalapathi Rao, an Educationist of great repute. I also commend the book to the department of Human resources, who m ay arrange for copies of the book to be kept ;in all libraries. I hearily, warmly congratulate Sri M.S.Rajalingam on his efforts and offer him my sincere thanks on behalf of the generations yet to come and who will be immensely be benefited by reading this book.

1-1-336
Chikkadpally,
Hyderabad - 500 020.
Phone : 7631285

**K. VAIDYANADHAN**
Chairman
Acharyakul.

# గాంధీతత్వ భాష్యకారుడు

జాతిపిత మహాత్మాగాంధీ యుగపురుషుడు. ఋషిపుంగవుడు. పరాయి పాలనను అంతమొందించడానికి ఒక్క నెత్తురు చుక్క కూడా చిందని విధంగా శాంతియుతంగా పోరాటాన్ని నడిపిన జాతీయ మహాయోధుడు. నిరాడంబరంగా జీవించి, ఉన్నత ఆదర్శాలను పాటించి సమాజంలో అట్టడుగున వున్న దీనజనావళి సంక్షేమానికి, అభివృద్ధికి, అభ్యుదయానికి అవిరాళ కృషి జరిగిన మానవతావాది.

గాంధీజీ, 1893లో న్యాయవాదిగా సేవలనందించడానికి దక్షిణాఫ్రికాకు వెళ్లవలసి వచ్చింది. అప్పుడక్కడ అధికారంలో వున్న యూరోపియన్లు స్థానిక భారతీయులపట్ల అనుసరించిన అమానుషమైన, అహంకారపూరితమైన విధానాలను ప్రత్యక్షంగా చూసి, స్వయంగా అనుభవించి దిగ్భ్రాంతిని చెందారు. దక్షిణాఫ్రికాలో భారతీయుల హక్కుల సాధన కోసం పోరాటం జరపాలని నిర్ణయించుకున్నారు. ఈ శాంతియుత సమరంలో ప్రయోగించడానికి సత్యాగ్రహమనే అద్వితీయ, అపూర్వ ఆయుధాన్ని కనుగొన్నారు. 1914 వరకు ఆయన అక్కడ సత్యాగ్రహ పోరాటాన్ని జయప్రదంగా జరిపి భారతీయుల న్యాయమైన కోర్కెలను, హక్కులను సాధించగలిగారు. దానిలో 'సత్యాగ్రహం' ఒక అమోఘమైన ఆయుధమని రుజువైంది. ఆకాలంలో ఇది లోకానికి విచిత్రంగా కనిపించింది. భారతదేశంలోకాని, ఇంగ్లాండులోకానీ సత్యాగ్రహమంటే ఏమిటో అప్పటికింకా బోధపడలేదు. అహింసకూ, ఆత్మ సంయమనానికీ, నిశిత క్రమశిక్షణకూ ఆనవాలంగా గాంధీజీ రూపొందించిన ఈ ఆయుధం ఆనాటి వరకూ శత్రువులను ఎదుర్కోవడానికి మానవులు వినియోగించిన శస్త్రాలన్నింటికంటే ప్రభావోపేతమైనదిగా ప్రసిద్ధికెక్కింది.

గాంధీజీ 1915 నుంచి మాతృభూమి భారతదేశంలో బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా అనేక ఉద్యమాలు నిర్వహించారు. ఆయన చేపట్టిన సత్యాగ్రహోద్యమాలు ఆయనను తిరుగులేని నాయకునిగా ఆవిర్భవింపజేశాయి. సహాయనిరాకరణోద్యమం ద్వారా ఆయన భారతీయులలో నూతన ఉత్తేజాన్ని స్ఫూర్తిని కలిగించారు. దేశ

వ్యాపితంగా వేలాది మంది యువతీయువకులు ఈ ఉద్యమంలో ఆయన నాయకత్వంలో పాల్గొన్నారు.

1934 నుండి బాపు జీవితాంతం వరకు సేవాగ్రాం ముఖ్య కేంద్రంగా విరాజిల్లింది. అహింసాయుత సమాజస్థాపన కోసం, సాంఘిక, సామాజిక, ఆర్థిక, విద్య, వైద్య రంగాల పటిష్కీరణ కోసం గాంధీజీ మార్గదర్శకత్వంలో సేవాగ్రాం వివిధ సంస్థలు స్థాపితమయ్యాయి. ఖాదీ, గ్రామీణ పరిశ్రమల సంఘం, గోసేవా సంఘం, గ్రామ సేవా మండలి, నయీ తాలీం సమితి, రాష్ట్ర భాషాప్రచార సమితి, మహారోగి సేవా మండలి, మగన్ సంగ్రహాలయం మొదలైనవి వాటిలో ఇవి కొన్ని మాత్రమే.

ఈపుస్తక రచయిత శ్రీ ఎం. ఎస్. రాజలింగంగారికి సేవాగ్రాం ఆశ్రమంలో బాపూ సన్నిధిలో కొంతకాలంపాటు వుండే అరుదైన మహత్తర అవకాశం లభించింది. ఆ సందర్భంలో ఆయన సిద్ధాంతాలను, ఆశయాలను, ఆదర్శాలను చాలా సాన్నిహిత్యం నుంచి ఆకళింపు చేసుకున్నారు. గాంధీ తత్వాన్ని ప్రస్తుతం సాధికారికంగా, సుబోధకంగా వ్యాఖ్యానించగలిగిన భాష్యకారులలో శ్రీ రాజలింగంగారొకరు. గాంధీయ నిర్మాణ కార్యక్రమ రంగంలో వీరికి విశిష్ట స్థానం వుంది.

దురదృష్టవశాత్తు మహాత్ముని సిద్ధాంతాలను సమాజం విస్మరిస్తున్న ప్రస్తుత కాలంలో శ్రీ రాజలింగంగారు ఈ గ్రంథం రచించి సమాజానికి మహోపకారం చేశారు. వీరి ఈ 'బాపు-నేను' గ్రంథం పరమ పఠనీయమైనదిగా రూపొందింది. గ్రంథకర్త తన అధ్యయనం, చింతన, విశ్లేషణ, వివేచన, నిరూపణల ద్వారా విషయాన్ని వివేకవంతంగా విపులీకరించారు. ఈ పుస్తకం యావదాంధ్ర దేశంలో మేధావులకు ముఖ్యంగా గాంధీజీ మహత్తర జీవితం పట్ల అవగాహన లోపించిన వారికి చాలా ఉపయోగపడగలదనడంలో ఎంత మాత్రం సందేహం లేదు. ఈ వయస్సులో శ్రమించి ఒక ఉత్తమ గ్రంథ రచనకు ఉపక్రమించి సఫలీకృతులైన శ్రీ ఎం.ఎస్. రాజలింగంగారికి నా హృదయపూర్వక నమస్సులు, అభినందనలు తెలుపుకుంటున్నాను.

**సి.వి. చారి**
అధ్యక్షుడు,
ఆం.ప్ర. భూదాన్ బోర్డు.

గాంధీ భవన్,
హైదరాబాద్ - 500 001.

# స్వదేశి వ్రతం

మీరు వ్రాసిన మీ అనుభవాలు వార్ధాలో గాంధిగారి, పూజ్య వినోబాగారి ఆశ్రమాలలో జరిగిన సంఘటనలు విపులంగా వ్రాశారు. కష్టాలలో ఉన్నా సుఖాలను అనుభవించారు. అవి ప్రస్తుత పరిస్థితులలో అంత అర్ధంగాని విషయము. మీ మహా పురుషుల వద్ద ఉన్నప్పుడు మాత్రమే అనుభవించగలరన్న సత్యము, మీ అనుభమములు చాటిచెప్పాయి. త్యాగమన్నప్పుడు చెడ్డగాని, బాధలుగాని కనిపించదు. అన్నీ సుఖంగానే ఆనందంగా ఉండునని తెలుసుకున్నాం. ప్రతి చిన్న విషయము పట్టించుకుని సలహా ఇవ్వగల గాంధిగారితో పరిచయము అనుచరణ అది మీ అదృష్టము. మీరు ప్రభాకర్‌జీతోనూ, పార్నికర్‌గారి వల్ల గోశేవ, గోశాలలో ఉన్న చెడును గాంధీగారివల్ల గ్రహించగలిగారు. గుడిసెలో ఉండగలిగారు. గాంధికారి ప్రార్ధనా రిజిష్టరులో మీ పేరుండడం, కుమారప్పగారి పరిచయము, దేశంలో స్వాతంత్ర సమరయోధులందరి పరిచయం మీ అదృష్టం. బడ్నర్‌తో మీ అనుభవం విద్యార్ధులకు గురువుల మీద, గురువుకు విద్యార్థులమీద ఉన్న అభిమానం మాసిపోదు అని గ్రించగలరు. రుచి ప్రాధాన్యం లేదని, ఆరోగ్యంగా ఉండాలంటే రుచికి ప్రాధాన్యం లేదని గ్రహించగలిగారు.

మీ చిన్న పుస్తకం చదివిన వారికి క్రమశిక్షణ, నియమిత ఆహారం, త్యాగం, ధైర్యము, సహనము, స్వదేశీ అలవడగలదని, కుల ద్వేషము, మత ద్వేషము ఉండదని గ్రహించగలరని ఆసిస్తున్నాను. నిర్మాణ కార్యక్రమాలమీద నాదృష్టి, నాకు వ్రాయడంగాని, చదవడం గాని అలవాటు లేదు. ఎప్పుడు ప్రజోపకారం, నిత్యము అభివృద్ధి కార్యక్రముల మీద ఆలోచన మెండు. అటువంటి నేను మీరు పంపిన దానిని పూర్తిగా చదివాను.

మీరు సరియైన మార్పులు చేయండి.

సి. హెచ్. వి. పి. మూర్తిరాజు
మాజి మంత్రివర్యులు

చిననింద్రకొలను
పశ్చిమగోదావరి జిల్లా.
ఫోన్ : 75827

# భావితరాలకు స్ఫూర్తి

మీరు వ్రాసిన ''బాపు-నేను'' పుస్తకం చదివాను. మాతరంలో గాంధీజీని చూడకపోయినా ఆ మహాత్ముడి మానసిక ఉన్నతిని, ఆనాటి పరిస్థితులను సవివరంగా వ్రాసిన మీరు ధన్యులు. ఈ పుస్తకం భావితరాలకు స్ఫూర్తి నిస్తుంది.

**జి. గంగరాజు**

అధ్యక్షులు

గాంధీ హిల్ ఫౌండేషన్.

విజయవాడ.

# ఉత్తమ గ్రంథం

శ్రీ ఎం.ఎస్. రాజలింగంగారు రెండేళ్ళ వార్ధా ఆశ్రమంలో వుండి, శిక్షణ పొంది వచ్చారు. 82 ఏండ్ల వయస్సులో కూడా నేటికీ సభా సమావేశాలలో ఆనాటి విషయాలను వివరించి, ప్రసంగిస్తూ మన మధ్య నుండడం వారెంతో అభినందనీయులు.

గాంధీజీ, ప్రభాకర్‌జీల సమక్షంలో అప్పట్లో వార్ధా ప్రాంతంలో జరిగిన సమస్యలు, పలువురు పెద్దలతో పరిచయాలు, అనేక సామాజిక విషయాలను గూర్చి వీరు ఇందు చక్కగా వివరించారు. సందర్భోచితంగా మహాత్మాగాంధీగారి నిర్మాణ కార్యక్రమాలును; భావాలను పేర్కొనడం సముచితంగా వుంది.

ఈ పుస్తకాన్ని ఎల్లరూ చదివి·తెలుసుకోవలసిన విషయాలు ఎన్నో వున్నవి. ప్రతి గ్రంథాలయంలోను వుండవలసిన ఉత్తమమైన గ్రంథమిది.

ఈ మంచి పుస్తకాన్ని వ్రాసి మనకు అందజేసిన రాజలింగంగారికి హృదయపూర్వక నమస్కారములు. వారు రచించిన 'స్వీయగ్రంథానికి', ఇది ప్రథమ భాగంగా ఉండగలదు.

అభినందనలతో,

B6/F2
Sanjeevareddynagar
Hyderabad-500 038.

మాదాల వీరభద్రరావు
ప్రముఖ జర్నలిస్ట్
స్వాతంత్ర్య సమరయోధులు

# అభినందనలు

మహాత్మా గాంధీగారు తమ సాహిత్య ప్రచురణ కోసం స్వయంగా స్థాపించిన, నవజీవన ట్రస్టు, అహమ్మదాబాదువారి కోరికపై నేను తెలుగులోకి అనువదించి యివ్వగా, వారు ప్రచురించిన గాంధీగారి తెలుగు ఆత్మకథను చదివి, గుంటూరు, విజయవాడ, ఏలూరుల నుంచి ఒక బాలుడు, ఇద్దరు బాలికలు హైదరాబాదులో వున్న నా ఫోను నెంబరు సంపాదించి, నాకు ఫోను చేసి '' మీరు అనువదించిన తెలుగు ఆత్మకథ మాకు బాగా అర్థమయ్యింది. మా సంతోషాన్ని తెలియజేసేందుకు ఫోను చేస్తున్నాము'' అని చెప్పినప్పుడు నాకు అమితానందం కలిగింది.

మహాత్మాగాంధీగారి జీవన విశేషాలను, వారి సిద్ధాంతాలను సరళభాషలో, స్థాయితగ్గకుండా, ఉన్నదున్నట్లు వ్రాసి పిన్నలకు, పెద్దలకు, స్త్రీలకు, పురుషులకు తెలియజేసేందుకు నేను చేసిన ప్రయత్నమే అందుకు కారణమని భావించాను. ఇప్పుడు మహాత్మాగాంధీగారి తరానికి చెందిన జ్ఞానవృద్ధులు, వయోవృద్ధులు తరిగిపోతున్నారు. గాంధీగారి గురించి కొందరు పెద్దలు, కవులు పెద్దపెద్ద గ్రంథాలు వ్రాస్తున్నారు. వాటిలో తమ గొప్పతనాన్ని, తమ పాండిత్య ప్రతిభను ప్రదర్శించుకొనటకు ప్రయత్నిస్తున్నారు. అందువల్ల అట్టివారు రచించిన గ్రంథాలు, పాఠకులను ఊహించినంతగా ప్రభావితం చేయలేక పోతున్నాయని చెప్పవచ్చు. నిష్కామసేవ, నైతిక విలువలు, సత్యం, అహింస, దాపరికంలేని జీవనం, త్యాగనిరతి, నిజాయితీ, ప్రతిచిన్న విషయంలోను కడు జాగరూకత, భగవంతుని యెడ భక్తి, శ్రద్ధ, విశ్వాసం, దూషణభూషణాలను సమపాళంలో స్వీకరించగల ధీశక్తి, అమిత నిబ్బరం, మహాత్మాగాంధీగారి జీవితంలో ప్రతివారికీ కనబడే సత్యాలు. కనుకనే గాంధీగారు మహాత్ముడు కాగలిగారు.

అట్టి మహాత్మాగాంధీగారి సాన్నిధ్యంలో సేవాగ్రాంలో వుండే సదవకాశం, తాను చేసుకున్న సుకృతం వల్ల, సున్నిత హృదయులు, మహా మనీషి శ్రీ ఎం.ఎస్. రాజలింగం గారికి లభించింది. చాలా సంవత్సరాలు గడిచిన తరువాత, ఆరోజుల్లో తాను కండ్లారా చూచి పొందిన స్పందనను ఇప్పటివరకు తాను గడించిన అనుభవంతో రంగరించి, చక్కని శైలిలో రసగుళికగా

రూపొందించి ఈ పుస్తకం రచించి తమ లక్ష్యంలో విజయం సాధించారు. వారు తమ ఉపోద్ఘాతంలో ''బాలబాలికలకు, విద్యార్థులకు గాంధేయ అనుభవ సూత్రాలను, ఆచరణ విధానాలను తేలికగా చెలియజెప్పు రచనలు లేవనియే చెప్పవచ్చును. ఆలోటు తీర్చుటకై చేసిన ప్రయత్నమే ఈ చిన్ని పుస్తక ప్రచురణము'' అని వ్రాశారు. తాను చూచిన, గమనించిన దృశ్యాలను, ఘట్టాలను, విశేషాలను, తాను పొందిన అనుభూతులను కండ్లకు కట్టినట్లుగా ఈ పుస్తకంలో రచయిత చిత్రించారు.

అవినీతి, లంచగొండితనం, పవిత్రమైన ప్రతి సేవారంగంలోను అక్రమ ధనార్జన, ఉన్నత పదవుల నధిష్ఠించిన వారి అధోగతి, విలయతాండవం చేస్తున్న ఈనాటి భారతదేశాన్ని ఆవరించియున్న గాఢాంధకారంలో ఈ పుస్తకరూపంలో కర్పూరకళికగా చిన్ని దీపాన్ని వెలిగించి, ఆ వెలుగు బాటన పయనించమని ప్రజలను ప్రబోధించిన శ్రీ ఎం.ఎస్. రాజలింగం గారి కృషి అమోఘం, అద్భుతం.

ఈ పుస్తకం చదివి పాఠకులు సాత్విక స్పందన తప్పక పొంది తీరుతారని ఆశిస్తున్నాను. ఈ ఉత్తమ గ్రంథం కొద్దిమంది హృదయాలనైనా నిర్మలం చేయుటకు సహకరించి, విశ్వ శ్రేయసమాహారంగా వెలుగొందగలదని విశ్వసిస్తున్నాను.

ది. 10-10-1999.

కపాడియా నివాస్
సోమాజీ గూడా
ఫోన్ : 3319361
హైదరాబాదు.

వేమూరి రాధాకృష్ణమూర్తి
ప్రముఖ అనువాదకులు
మాజీ ప్రధాన మంత్రి
దక్షిణ భారత హింది మహాసభ

రూపొందించి ఈ పుస్తకం రచించి తమ లక్ష్యంలో విజయం సాధించారు. వారు తమ ఉపోద్ఘాతంలో ''బాలబాలికలకు, విద్యార్థులకు గాంధేయ అనుభవ సూత్రాలను, ఆచరణ విధానాలను తేలికగా చెలియజెప్పు రచనలు లేవనియే చెప్పవచ్చును. ఆలోటు తీర్చుటకై చేసిన ప్రయత్నమే ఈ చిన్ని పుస్తక ప్రచురణము'' అని వ్రాశారు. తాను చూచిన, గమనించిన దృశ్యాలను, ఘట్టాలను, విశేషాలను, తాను పొందిన అనుభూతులను కండ్లకు కట్టినట్లుగా ఈ పుస్తకంలో రచయిత చిత్రించారు.

అవినీతి, లంచగొండితనం, పవిత్రమైన ప్రతి సేవారంగంలోను అక్రమ ధనార్జన, ఉన్నత పదవుల నధిష్ఠించిన వారి అధోగతి, విలయతాండవం చేస్తున్న ఈనాటి భారతదేశాన్ని ఆవరించియున్న గాఢాంధకారంలో ఈ పుస్తకరూపంలో కర్పూరకళికగా చిన్ని దీపాన్ని వెలిగించి, ఆ వెలుగు బాటన పయనించమని ప్రజలను ప్రబోధించిన శ్రీ ఎం.ఎస్. రాజలింగం గారి కృషి అమోఘం, అద్భుతం.

ఈ పుస్తకం చదివి పాఠకులు సాత్విక స్పందన తప్పక పొంది తీరుతారని ఆశిస్తున్నాను. ఈ ఉత్తమ గ్రంథం కొద్దిమంది హృదయాలనైనా నిర్మలం చేయుటకు సహకరించి, విశ్వ శ్రేయసమాహారంగా వెలుగొందగలదని విశ్వసిస్తున్నాను.

ది. 10-10-1999.

వేమూరి రాధాకృష్ణమూర్తి
ప్రముఖ అనువాదకులు
మాజీ ప్రధాన మంత్రి
దక్షిణ భారత హిందీ మహాసభ

కపాడియా నివాస్
సోమాజీ గూడా
ఫోన్ : 3319361
హైదరాబాదు.

# ఓ మహర్షి, ఓ మహాత్మా !

ఇరవయ్యో శతాబ్దిలో విశ్వవ్యాప్తంగా చూసినా గాంధీజీవంటి మహాత్ముడు మరి ఒకరు లేరు. ఇక భారతదేశం ప్రస్తావన ఎందుకు? ఇరవయ్యో శతాబ్దాన్ని ప్రపంచవ్యాప్తంగా ఆయన బాగా ప్రభావితం చేశాడు. ఆయన దివ్యపురుషుడు. సత్యాహింసల ప్రవక్త. ఆధునిక మత సమన్వయ ప్రవర్తకుడు. వేలాది సంవత్సరాల పురాతన భారతీయ మత సంస్కృతులన్నీ, వేదోపనిషద్ భారతీయ జీవనవమౌల్యాలను ఆయన భారతదేశానికీ తద్వారా మళ్ళీ ప్రపంచానికీ ఒకసారి చాటి చెప్పారు. అందుకే వేటూరి ప్రభాకరశాస్త్రిగారి వంటి యోగజీవనులు గాంధీజీని పురుషోత్తముడని అభివర్ణించారు. గాంధీ ఆత్మ శక్తి గొప్పది. అయితే ఆయనలో కూడా లోపాలు చూపేవారు లేకపోలేదు. వెదికితే అవి కనపడవచ్చును కూడా.

మహాభారత వృత్తాంతంలో భీష్ముని నిర్యాణానికి ముందు శ్రీకృష్ణుడు, ధర్మరాజును భీష్ముడి సన్నిధికి తీసుకొనిపోయి ఇటువంటి మహాత్ముడు ఇంతకు ముందు పుట్టలేదు, ఇకముందు పుట్టడు, సమస్త జ్ఞానవిజ్ఞానాలు ఈయనతో కనుమరుగై పోతాయి. కాబట్టి ఈ మహానుభావుడి ద్వారా నీ శక్త్యానుసారంగా లోకనీతులు, రీతులు తెలుసుకో, ఆ విధంగా నడుచుకో అని ధర్మరాజును ఉద్బోధిస్తాడు. కాని ఆ భీష్మునిలోనే ఎన్నదలచుకొంటే లోపాలు ఎన్నవచ్చు. లోకంలో ఎక్కడా ఎప్పుడూ కనీవినీ ఎరుగని పరమ విషాదకర అవమానం ద్రౌపదికి జరుగుతుండగా సమర్థుడై వుండి, కుటుంబపు పెద్ద దిక్కు అయివుండి దాన్ని వారించటానికి ప్రయత్నం చెయ్యలేదు భీష్ముడు. అదీకాక కౌరవుల పక్షాన పదిరోజులు యుద్ధం చేశాడు. పరశురాముడు గురువైనా ఆయనతో అంబకుడి నోడించే విషయమై 23 రోజులు యుద్ధం చేసిన పట్టుదల కౌరవుల అక్రమాలను ధిక్కరించడంలో ఆయనకు ఎందుకు లేకపోయింది?

అట్లానే గాంధీజీలో కూడా రాముడి, కృష్ణుడి, బుద్ధుడిలో కొందరు బుద్ధిమంతులు ఎంచే లోపాలవంటి లోపాలు ఎన్నవచ్చు. అది వేరే విషయం. కాని, గాంధీజీ సత్యాహింసల మానవాకృతి అనడం ఎవరూ కాదనలేరు. భారతకథలో అభిమన్యు వధ లాగానే

ద్విజాతీయ సిద్ధాంతవైపరీత్యంతో భారతదేశ విచ్ఛేదన జరిగింది. స్వతంత్ర్య భారతదేశపు కడగండ్లన్నీ అప్పుడే ప్రారంభమైనాయి. ఇప్పటికీ ఆ రావణకాష్ఠం మండుతూనే వుంది.

గాంధీజీని ఒకసారి చూడగలగటమే జీవిత చరితార్థత, జీవిత సాఫల్యం అని భారతీయులంతా పరమోద్విగ్న భక్తి ప్రపత్తులతో ఆయన్ను ఆరాధించే కాలంలో శ్రీరాజలింగంగారు గాంధీజీ సన్నిధిలో కొంతకాలం గడపటం వారి అనేక జన్మల సుకృతం. గాంధీజీ దినచర్య వృత్తాంతాన్ని రాజలింగంగారు ప్రత్యక్షసాక్షిగా దర్శించారు. ఆయన ఆత్మశక్తిని ఆరాధించారు. విబుధవరుల వలన విన్నంత, కన్నంత, తెలియవచ్చినంత తేటపరుతు అని ఇప్పుడే ప్రయత్నానికి పూనుకున్నారు. కాని ఈ తరం పాఠకులకు మరింత స్పష్టంగా, విశదంగా, సులభంగా, సరళంగా తెలియడానికి సంక్షిప్తంగా ఆనాటి దేశకాల పాత్రలన్ను, తమ జీవితరేఖా ప్రధాన ఘట్ట చిత్రణను కూడా భూమికగా చేకూర్చడం అవసరమని నా మనవి. వారిప్పుడు సహస్ర చంద్ర దర్శన సౌభాగ్యజీవనులు. ఇరవై పాతికేళ్ళు ఇంకా కౌమార వయస్కులకు ఆనాటి సంగతులు చెప్పాలని రాజలింగంగారి కుతూహలం ఈ గ్రంథ సన్నివేశాలలో వారి పొందుపరిచారు. కాని మనవడి తరానికి తాత తరానికీ ఇప్పుడెంతో అంతరం. నడమంతరం వచ్చిపడింది. కాబట్టి ఇప్పటి శైలి కావాలి అని విన్నవిస్తున్నాను.

బి-2, విజయప్రతాప్ అపార్టుమెంట్
6 నెం. వీధి, విద్యానగర్
హైదరాబాద్.
ఫోన్ : 7602352.

డా. అక్కిరాజు రమాపతి రావు

# *Perception and Practice*

*Sri M.S. Rajalingam is a prominent freedom fighter, a prominent Gandhian and Sarvodaya worker, who combines in himself the practical teachings and learnings from Gandhiji and Vinobaji which he imbibed during him prime days, when he spent about two years in Wardha. His book contains unusual insights born out of perception and practice on life and society experienced and observed by him during his stay at Wardha under constant vigil of Gandhiji, Vinobaji, J.C.Kumarappa and other national leaders.*

*What amazes me is his breath of vision and simple presentation, he brings to bear on his experiences at Wartha in this book.*

*Every man endowed with the gift of talent, has an obligation to society to give his best to his countrymen regardless of position. Thus, he has done justice to his constituency - Gandhian school of thought and aaccountability to Daridranarayana to carry the torch of Gandhian thoughts and pass on to the young generation which is his life time ambition.*

*Sri M.S.Rajalingam belongs to that old generation of Gandhians, who adhere to human values. Sri M.S.Rajalingam is worth every page for serious reading.*

*" Where is the Wisdom, we have lost in knowledge*
*Where is the Knowledge, we have lost in information"*

*-- T.S. Eliot.*

1-8-48,Chikkadpally,
Hyderabad - 20.
Phone :

***Dr. B. Baburao Verma***
***Member***
*A.P. Commission for Backward Classes.*

# A treasure of Values

Your book **"Bapu and I" is a treasure of Values.** After reading the same I have developed a concept to popularise these values by various episodes, in Electronic media by introducing characters wherever necessary. These episodes can be dubbed in to many languages too. This is an idea for consideration only.

Film & TV Series
1-5-6/33, Krishna Colony
Hyderabad - 500 020.
Phone : 7616711

**Krishna Rao Keshav**
Producer & Director.

# సజీవ శిల్పం

రసదీప్తి కలిగిన ఒక వాక్యం కావ్యంతో సమానం ! ఆ వ్యక్తి కవి కాడు. కాల్పనికుడూ కాడు. భావానికి భాషని సంతరించి అలంకార హృద్యమైన వాక్యాల్ని నిలిపే శిల్పి కాడు ! పోరాటం నుంచి యేదో చేయాలనే ఆరాటానికి, ఆరాటం నుండి నిర్యాణానికీ, అందులోంచి మంత్రాంస పటిమకి, అక్కడి నుండి సమాజ సింధువులో కణమై స్వేచ్ఛాసీమల వాయువు పీలుస్తూ తను స్పర్శించిన, నమ్మిన "గాంధేయ" స్మృతికి వారసుడుగా నిలచిన ఒక నిగర్వి తన అనుభవ పరంపరను జీవనవాహినిగా చెప్పిన సరళసాహితీ జీవన సుమం ఈ చిన్ని పుస్తకం.

ఈ పదాల మధ్య కథకి నాయకుడైన తను కనిపించడు. నాటి తన భావోద్వేగం మాత్రమే కనిపిస్తుంది. ఈ పుటల మధ్య నాటి సామాజిక రాజకీయ ఆర్థిక జనహిత వాస్తవ స్మృతులు అగోచరంగా గోచరిస్తాయి! చదివే హృదయాల్ని తట్టిలేపి సత్యం అహింస, హింసకి అహింసకి వున్న సున్నితమైన అంతరం మానవ హృదయ సంభంధాలు చూపి మళ్ళీ చదివిస్తాయి! అందుకే యిది అసంభవ కార్యం తన జీవన యాత్రలో తొలి మలి ప్రాంగణమైన కౌమార అమేత్వన మధ్య నుండి ఆరంభమై, ఒడుదుడుకుల పడిలేచిన అనుభవాలతో పక్వించిన "రాజర్షి" చెప్పిన ఉపోద్ఘాతమే దీనికి దర్పణం.

కళ్ళని కాగితం మీద వుంచి పేజీలు త్రిప్పే చదువువరకే కాకుండా మనస్సుతో చదివే మాన్యులకు యిది స్ఫూర్తిదాయకం. ఈ స్రవంతిలో మహాత్ముడైన మహనీయుని కంటికి ఎదురుగా సంఘటనల సాక్షిగా మనం చూడగలుగుతాం. నేడు సమాజం కావాలనుకుంటున్న పాలవుత్పత్తి, స్వదేశీ జాగరణ, గ్రామసీమలకు అధికార వికేంద్రీకరణవంటి ఎన్నో విధానాలకి విప్లవపూరిత నిర్యాణత గోచరిస్తుంది.

ఈ పుస్తకం బాల్యావస్థలో స్ఫూర్తిదాయకం, యేత్నావస్థలో చిరుదీపం ! నిర్యాణావస్థలో విద్యుద్దీపం ! ఈ కథనం గురించి ఈ చిన్ని మాటలు వ్రాయగలగడం నా పూర్వ పుణ్యఫలం. ఒక్క మాటలో చెప్పాలంటే ఈ సజీవ శిల్పాన్ని కళ్ళ ముందు ఆవిష్కరించిన శ్రీ రాజలింగంగారి కలం మరింక యేయే వ్రాయక్కరలేనంత పరిపూర్ణతని సాధించుకున్నది.

డా. ఐ. రామకృష్ణ
గవర్నమెంట్ ఆయుర్వేద మెడికల్ కళాశాల, వరంగల్.
Member of International Society of Asian Systems of Medicine, Newyark.
Hon. Chairman, International Ayurvedic, Katmandu. (Nalap)
Director, Chandra Medical & Health Services, Kakinada.

23-23-60/ఎ,
సత్యనారాయణపురం,
విజయవాడ-11.

# ఓ ఆణిముత్యం గారి ఆత్మకథ

ఎవరిని గురించైనా, దేనిని గురించైనా, తెలుసుకోవడం ప్రారంభించాక; ఇంకా ఇంకా లోతులకు వెళ్ళాలనీ, మరియు ఎత్తులకు ఎదగాలనీ, మరి కాస్త నిశితంగా ఎదగాలనీ, మరి కాస్త నిశితంగా గమనించాలనీ, ఇంకాస్త తెలుసుకోవడం అవసరమనీ, అని పెంచదలిస్తే ఆ ఎవరుగానో, ఆ ఏదిగానో, చాలా ముఖ్యస్థానంలో ఉండి ఉండాలి!

గాంధి గారి పేరు నేను తొలిసారిగా విన్నది, 1940-41 ప్రాంతాలలో నని గుర్తు. మా నాన్నగారు, వెంకట రత్నంగారు, నాగేశ్వర రావు గారు, ముదిగొండ అయ్యవార్లింగం గారు, మరో ఇద్దరు, ముగ్గురు కలసి, మూడురంగుల జెండాను ఎగరేయడం, కల్లు పాకల దగ్గెర అడ్డంగా నిలబడడం, ఊరి వెలుపల ఉన్న గుడిసెలలోకి జొరబడడం, అక్కడ వారి చేతినీళ్ళు తాగడం, అప్పుడప్పుడూ అక్కడే అన్నాలు తినడం, వారిని కూడా ఎప్పుడన్నా ఇండ్లకు రానివ్వడం, అప్పుడప్పుడు వీదులలో నడవనివ్వడం, ఆ రోజుల్లో గొప్ప విప్లవం కిందే లెక్క.

చెరువు కట్టనానుకొన్న బావిలోంచి ఓ అంటరాని వానిచేత నీళ్ళు తోడించి నందుకు, ఊరివారందరూ, ఆ బావిని వెలివేశారు. ముదిగొండ బసవయ్యగారు మంత్రాలు చదివి ఆ పాపాన్ని పరిహరించారు. డాక్టర్ క్షీరసాగరం గారు, నీళ్ళు తోడి తొలిసారిగా తాగారు. ఆ తరువాత మా నాన్నగారు తాగారు. ఆ తరువాత ఊరి వారందరూ నెమ్మదిగా తాగారనుకోండి. ఇలా జరగడం వెనుక మహాత్మాగాంధీ గారున్నారని, లీలగా విన్నాను. ఓ సామాన్య వ్యక్తి, సత్యం, అహింస అన్న రెండే రెండు నినాదాలను ఆధారంచేసుకొని, ఒక మహా సామ్రాజ్యాన్ని కదిలించిపారేసిన సందర్భం గతంలో ఉన్నదేమో నాకు తెలీదు.

సమాజంలోని, భిన్నమతాల వారు, విభిన్న కులాలవారు, మరెన్నో వర్గాలవారు, ఈ ఉద్యమంలో చిత్తశుద్ధితో పాల్గొన్నారని మాత్రం నాకు తెలుసు.

ఆశయాలు ముఖ్యం, ఆచరణ మరీ ముఖ్యం అంటారు బాపుజీ!

నా చిన్నతనంలో నేనెరిగిన గాంధేయవాదులకూ, ఇప్పుడు నేను చూస్తూన్న గాంధేయవాధులకూ, ఎక్కడా పొంతనలు లేవు. అలా పోల్చి చూడడం భావ్యంకాదు!. అన్నారు నాకు బాగా తెలిసిన ఓ గాంధేయవాది. ఈ మధ్యనే!

మహాత్ముని బోధనలు విని, స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్న, ఆనాటి మేటి ముత్యాలన్నీ, క్రమంగా కనుమరుగవుతున్నాయి. అక్కడక్కడా చెదురుమదురుగా ఉన్న

ం: మంచి ముత్యాలను గురించి, ఈ తరంవారికి, తెలియవలసినంతగా తెలియదనుకొంటున్నాను. అలా ఇంకా మిగిలివున్న మంచిముత్యం శ్రీ యం. రాజలింగంగారు.

కొంతమంది తమ ఆశయాలను, అభివ్యక్తీకరించడం వరకు మాత్రమే పరిమితం చేస్తారు. రాజలింగంగారి వంటి వారు వాటిని ఆచరణదాకా తీసుకువస్తారు.

వర్తమాన, సామాజిక, రాజకీయ వాతావరణాన్ని పరిపూర్ణంగా అవగాహన చేసుకోవడానికి, పైపైన తడివి చూస్తే లాభం లేదు. లోపలికంటూ వెళ్ళాలి. అలా– లోపలికి, లోలోపలికి తొంగి చూసేందుకు, ఈ పుస్తకం తోడ్పడుతుంది.

ఇది – రాజలింగంగారి ఆత్మకథ మాత్రమే కాదు, వారి అనుభవాలూ, జ్ఞాపకాలో మాత్రమే కాదు, మహాత్మునికి సంబంధించిన మెరుపులు, చరుపులు సంపుటీకరణం మాత్రమే కాదు, ఆ నాటి వ్యక్తుల దీక్ష, దక్షతలకు దర్పణం మాత్రమే కాదు, అప్పటి సామాజిక వాతావరణంలోని వెలుగు నీడల కలగలుపు మాత్రమే కాదు, సమాజ సంక్షేమంకోసం, వ్యక్తిగత సౌఖ్యాలను కూడా త్యాగం చేసిన వారి చిత్తశుద్ధితో బాటు, అనేకానేక అంశాలను కూడా అక్షరబద్ధం చేసిన మంచి పుస్తకం.

దరిశి చెంచయ్యగారు గొట్టిపాటి బ్రహ్మయ్యగారు, టంగుటూరి ప్రకాశం పంతులుగారు, అయ్యదేవర కాళేశ్వరరావుగారు, ..... ఇంకా చాలా చాలా మంది, తమ తమ అనుభవాలనూ, జ్ఞాపకాలనూ, భావితరాలవారి కోసం భద్రపరిచారు. శ్రీ యం. యస్. రాజలింగం గారు కూడా అలాంటి సత్కార్యమే చేసి వారి కోవలోకే చేరారు.

భావి పరిశోదకులకు – ఈ గ్రంథం ఎంతో ఉపయోగపడుతుంది. ఇంత మంచి విషయాన్ని, ఎంతో మంచి శైలిలో అందించిన మా రాజలింగం అన్నగారిని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

**డా. రావూరి భరద్వాజ**

కాంతాలయం
159/2 ఆర్. టి.
విజయనగర్ కాలని
హైదరాబాద్ – 67.

## *An Insight into Bapu's Philosophy*

The book 'Bapu and Myself' written by Sri M.S.Rajalingam, President of the Freedom Fighters Organisation, Hyderabad is unique in the sense that it brings out not only his personal experiences with Bapuji but also brings to light some of the unreported insights in to Bapu's philosophy and values. When one reads the book it reveals the values, commitment and sacrifices our Freedom Fighters cherished and adhered to. The book will provide enough material for the younger generation to have an insight into Bapu's philosophy and some aspects of Freedom Movement through the personal experience of Sri Rajalingam.

I have been exercising my mind for quite some time as to how we may utilise the experiences of our Freedom Fighters for the National Reconstruction and to awaken the youth of this country. The taks is urgent inview of the advanced age of the Freedom Fighters. Now I am happy that this Book written by Sri M.S.Rajalingam garu is a right step in that direction.

I would like to congratulate Sri Rajalingam garu for his timely attempt in writing this Book.

**Prof.Dr.D.Swaminathan.**
Chairman,
Dr.D.Swaminathan Research Fundation.
Former Member,
Planning Commission, Govt.of India, New Delhi.

Block 6, Gruhakalpa Complex
M.J.Road, Nampally, Hyderabad.
Ph. : 473692, 4736932

# నిర్మాణాత్మక కృషి

శ్రీ యం.ఎస్. రాజలింగంగారిని నేను 50 సం.లకు పైగా ఎరుగుదును. ప్రజాసంస్థలు, ప్రజలు ఎక్కువగా వారిని నిర్మాణ కార్యకర్తగానే గుర్తించారు. కార్యక్రమాలకై నిర్మాణ కార్యక్రమ సిద్ధాంతమే పునాది. భారత సమాజం ద్వారా ఐచ్ఛిక విరాళాలతోనూ, ఐచ్ఛిక శ్రమతోనూ బావులు, రోడ్లు, గుంటలు అనేకం వేయించడం జరిగింది. అది ప్రభుత్వ ఆదాయానికి ఎంతగానో తోడ్పడినవి. వారు మంత్రిగా వున్నప్పుడు ఈ అంశాలను దృష్టిలో పెట్టుకొని వాలంటరీ స్కీమ్ ఐచ్ఛిక ప్రణాళిక అమలులోకి తెచ్చారు. అధికారులను వారి పర్యటనలో ఈ స్కీమ్ అమలు చేయాలని కోరారు. ఈకాలంలో వారు పి.డబ్ల్యు.డి. శాఖకు మినిష్టర్‌గా వుండడం ఈ ప్రణాళికను అమలుచేయడంలో ఎంతైనా తోడ్పడింది. వరదన్నపేట తాలూకాలోని ఇల్లెందు చెరువు రోపేర్లు ఐచ్ఛిక విరాళము శ్రమతో పూర్తి చేయబడినవి. వారి అనుభవాలనే వారు ప్రభుత్వంలో వాలంటరీ స్కీమ్‌లో అందించారు. అంతేగాక వారు పది సంవత్సములపాటు ఎం.ఎల్.ఏ.గా పనిచేశారు. వారి అసెంబ్లీలో మొదటి ప్రశ్న ఫతేమైదాన్‌లో స్టేడియం కట్టుతారా అని ప్రభుత్వాన్ని అడిగారు. **ఆ ప్రశ్నకు ఫలితమే నేటి 'లాల్ బహదూర్ స్టేడియం'**. ఏ పని చేసినా పట్టుదలతో చేయడం వారి ప్రత్యేకత. ఈ 'బాపు–నేను' గ్రంథంలో అక్షరబద్ధం చేయబడిన ప్రతి అంశంలో వారి నిర్మాణాత్మక కృషి కనబడుతుంది. ఈ విషయంలో వారి జిజ్ఞాస మెండు. ఈ గ్రంథం వ్రాయడం ప్రజలకు అందించడం వారి వంతు. వాటిని చదవడం కార్యకర్తల వంతు. ఈ గ్రంథంలో మనకు తెలియనివి అనేక గొప్ప విషయాలు ప్రజా దృష్టికి వచ్చాయి. వారికి నా కృతజ్ఞతలు.

**ఎన్. యతిరాజారావు**
ఛైర్మన్
ఎ.పి.ఐ.డి.సి.

పరిశ్రమ్ భవన్,
హైదరాబాద్ - 500 004.

# ధన్యజీవి

మిత్రులు శ్రీ రాజలింగం వ్రాసిన "బాపు-నేను" అనే గ్రంథాన్ని చదివే అవకాశం లభించింది. విద్యార్థి జీవితం ముగించుకొనుటతోడనే శ్రీ రాజలింగం వార్ధాకు వెళ్ళి అక్కడ శ్రీ కుమారప్పగారి ఆధ్వర్యంలో కాగితం, గానుగనూనె మరియు తేనెటీగల పరిశ్రమలలో శిక్షణపొంది సేవాగ్రాంకు వెళ్ళారు. అక్కడ అతని అనుభవాలూ, దేశనాయకుల కలిమిడితో ఏర్పడిన స్పందన వివరాలను ఉటంకిస్తూ అనేక అంశాలపై గాంధీజీ అభిప్రాయాలను సమగ్రగా ఈ గ్రంథంల పొందుపరిచారు. ఈ అంశాలను చదివిన తరువాత పాఠకులకు మహనీయుల మనస్తత్వాలు వారి ప్రభోదనలు ఆకట్టుకుంటాయి. గాంధీజీ వంటి మహానుభావులు జీవించి యున్నంతకాలంలో వారి చుట్టూ ప్రదర్శనలు చేసేవారు.

గాంధీజీ కేవలం తాత్వికవేత్తయే కాదు. వారు ఆచరణసాధ్యం అయ్యే అనేక విషయాలను కూడా సునిశితంగా పరిశీలించి ప్రభోధించారు. ఏనాటికయినా వికేంద్రీకరణ సిద్ధాంతాన్ని ప్రపంచం ఆమోదిస్తే తప్ప ప్రపంచశాంతి, నిరుద్యోగ నివారణ సాధ్యం కావు అన్న తత్వాన్ని గుర్తించక తప్పదు. ఎంతో మహానుభావుడైన గాంధీ కేవలం ఉన్నత రాజకీయాలకే పరిమితం కాక నిత్యానైమిత్తక వ్యవహారాలలో కూడా ఆచీతూచీ వ్యవహరించేవారని స్పష్టమవుతుంది.

మహానుభావులు, ఋషిపుంగవులు ఉపదేశిస్తూనే వుంటారు.

వారు ప్రబోధించిన సూక్తులు చివరి దాకా నిలుస్తవి. అంతిమంలో మానవాళికి అవే శరణ్యం. ప్రపంచం ఆమోదించి అవలంబిస్తే తప్ప ప్రపంచశాంతి నిరుద్యోగనివారణ, సాధ్యం కావు అన్నది గుర్తించక తప్పదు. ఈ సూత్రాన్ని యావత్ప్రపంచం అంగీకరించినా ఆచరణలో మాత్రం ఒక దేశం మరొక దేశానికి పోటీ పడుతూ యాంత్రీకరణను తగ్గించటం లేదు. మరొక విషయం ఆహారపు వ్యవహారాలు గురించి కూడా గాంధీజీ

స్పష్టమైన భావాలను ప్రబోధించారు. విగ్రహారాధనను వారు సమ్మతించారు. విగ్రహమే

ఆశ్రమంలో వుంటూ అనేక అనుదిన కార్యక్రమాలలో పాల్గొన్న శ్రీ రాజలింగంగారు గాంధీజీ ఆలోచనా విధానం, పనులను నిర్వహించే తీరుతెన్నులూ, సమస్యలను పరిష్కరించే విధానాలను బాగా వివరించారు.

ఈ పై విషయాలను, అనేక సంఘటనలనూ గాంధీజీ ఆశ్రమంలో వుండి వారి ముఖతః విని శిక్షణ పొందిన శ్రీ రాజలింగం ధన్యజీవి. ముఖ్యంగా చారిత్రాత్మక పురుషుడు అయిన గాంధీజీతో కలిసి మెలసి యుండి వారి ముఖతః అనేక విషయాలను నేర్చుకోగలిగిన శ్రీరాజలింగం ఎంతో అదృష్టవంతుడు. గాంధీజీని, వారి సూక్తులను మరుస్తున్న ఈ రోజులలో ఆ సిద్ధాంతాలను మననం చేసుకోనడానికి ఈ గ్రంథం ఎంతో ఉపయోగపడుతుంది.

8-4-48, శ్రీ కిషన్ కాలనీ,
వరంగల్ - 2.
ఫోన్ : 71598

**బి. హెచ్. చంద్రమౌళీశ్వరరావు,** అడ్వకేట్.
అధ్యక్షులు
వరంగల్ జిల్లా ఆం. ప్ర. స్వా. స. సంస్థ

# తానొక శక్తి

పూజ్యులు ఎం.ఎస్. రాజలింగంగారికి,

మానవుని మేధాశక్తికి, శ్రమశక్తి తోడైనప్పుడే మనం ఆశించిన ఫలితం దక్కుతుంది. ఆ ఫలితం మానవుని శారీరక పోషణకు మాత్రమేగాక జాతి సంపదను అభివృద్ధి చేయటానికి, మానసికోన్నతికి కూడ తోడ్పడుతుంది.

కార్మిక, కర్షక తదితర శ్రామిక శక్తులన్నింటి శ్రమశక్తియే జాతీయభివృద్ధికి పెట్టుబడి. ఈ శ్రమశక్తి నుండే ప్రపంచవ్యాప్తంగా పారిశ్రామికవేత్తలు తమ లాభాలను గణనీయంగా పొందుతున్నారన్నది నిర్వివాదాంశం.

శ్రమరహితమైన ఆదాయం పొందేవారు పరాన్నభుక్కులు, పరభాగ్యోపజీవులు అని గాంధీజీ భావించారు.

శ్రమశక్తియే మానవ విజయానికి మూలాధారమని రష్యన్ రచయిత 'భూర్నహం', మరో సుప్రసిద్ధ ఆంగ్ల రచయిత, తాత్విక చింతనావేత్త అయిన టాల్‌స్టాయ్ తమ రచనల్లో వ్యక్తీకరించారు.

టాల్‌స్టాయి రచనల నుండే సత్యాగ్రహ సూత్రాన్ని గ్రహించగలిగానని మహాత్ముడు తన ఆత్మకథలో పేర్కొన్నారు కదా !

మార్క్సు మహనీయుని మహత్తర గ్రంథం 'క్యాపిటల్' శ్రమైక జీవన సౌందర్యానికి అద్దం పట్టిన మహాకవి శ్రీశ్రీగారి మహాత్ముని శ్రామిక వర్గ దృక్పథానికి అతి చేరువలో నున్నవారే.

ఏ సమస్యను పరిష్కరించదలచినా, వివిధ శక్తుల కూటమి యొక్క సహాయం అత్యవసరమని గుర్తించారు.

గాంధీజీ ఉప్పు సత్యాగ్రహోద్యమాన్ని నిర్వహించినా, అహమ్మదాబాద్ మిల్లు కార్మికుల సమస్యలను పరిష్కరించబూనినా, పరిసరాలకు, మానవ శ్రమశక్తికి గాంధీజీ యిచ్చిన ప్రాధాన్యత స్పష్టమవుతుంది.

స్వాతంత్ర్య పోరాటకాలంలో పారిశ్రామిక వివాదాలను పరిష్కరించినపుడు అఖిల భారత జాతీయ కార్మిక సంఘం, అఖిల భారత రైల్వే ఫెడరేషన్,

అహమ్మదాబాదు మిల్లు కార్మిక సంఘం, అఖిల భారత పోస్టలు మరియు ఆర్.ఎమ్.ఎస్. యూనియన్‌లనీ, తదితర కార్మిక సంఘాల నాయకులతో గాంధీజీ సంప్రదించడం జరిగేది.

పరిసరాలకు, ప్రజాభిప్రాయానికి భిన్నంగా ఏ ఉద్యమం విజయం పొందలేదన్నది గాంధీజీ నిశ్చితాభిప్రాయం.

కాలమాన పరిస్థితుల కనుగుణ్యంగా శ్రామికశక్తికి ప్రాధాన్యత నిచ్చి కార్మిక ఉద్యమాన్ని విజయవంతంగా నడిపిన రష్యాలాంటి దేశాన్ని ఆదేశ నాయకుని గాంధీజీ మరువలేదు.

శరీరశ్రమ శక్తి ఆశయసిద్ధికి తోడ్పడుతుందని గాంధీజీ ప్రగాఢ విశ్వాసం. శ్రామిక వర్గ దృక్పథాన్ని గాంధేయ దృక్పథంతో మేళవించి సత్యమైన విషయాన్ని, సరళమైన భాషలో ఇతరులను బాధపెట్టని రీతిలో, అందరిని ఆసాంతం, అవిశ్రాంతంగా చదివించే విధంగా రచించిన మీ ''బాపు-నేను'' పుస్తకం సర్వజనామోదం పొందుతుందనడంలో ఏ మాత్రం సందేహం లేదు,

ఇట్టి చక్కటి రచనను విశాలాంధ్ర కందించిన మీకు నా శత సహస్ర అభినందనలు.

96/2RT
విజయనగర్ కాలనీ
హైదరాబాద్ - 500 057.
ఫోన్ : 3342029.

**ఏటుకూరి కృష్ణమూర్తి**
ప్రధాన కార్యదర్శి
ఆం.ప్ర. స్వాతంత్ర సమరయోధుల సంస్థ.

# ప్రతి స్కూలులో
# వుండదగిన గ్రంథం

ఎం.ఎస్.రాజలింగంగారు రాసిన 'బాపు–నేను' గ్రంథములోని కొన్ని భాగములు మిత్రులు నా కంటి ఇబ్బంది గ్రహించి చదివి వినిపించారు.

ఈ రచన ప్రస్తుత తరం నైతిక బాధ్యతలను పెంచడంలో ఎంతైనా తోడ్పడుతుంది. జీవకారుణ్యం, ఆదర్శం గూర్చి పొందుపరచిన అనుభవాలు నన్ను చాలా ఆకర్షించినవి. ఈ విషయంలో పోలెండు నుంచి వచ్చి ఆశ్రమవాసిగా వుండిన భారతానంద్ ప్రశంసనీయుడు. విద్యా లక్ష్యములైన సాంఘిక వైఖరుల విద్యార్థులు అలంకరించుకోవడంలో రచయిత పేర్కొనిన వార్ధా సేవాగ్రాం ఆశ్రమ అనుభవాలు ఎంతగానో తోడ్పడతాయి.

ఈ 'బాపు–నేను' పుస్తకము ప్రతి స్కూలు, కాలేజీలలో వుండదగినది. ప్రభుత్వం దీనికి ప్రోత్సహించాలని చాలా వుంది.

జీవన సంస్కరణ సమితి
హైదరాబాద్.
ఫోన్ : 7715119

**బొలుగడ్డ శ్రీధర్**
ప్రముఖ విద్యావేత్త

# ప్రశంస

పూజ్య బాపూతో మిత్రులు శ్రీ ముదిగొండ సిద్ధ రాజలింగముగారి సాహచర్యము, వారి అనుభవాలు భావితరాల వారికి హింసకు, అహింసకు వున్న అతి సూక్ష్మమైన వ్యత్యాసము ఈ గ్రంథములో ద్యోతకమవుతున్నది.

పోలండు శరణాగతుల విషయంలోను, పండిట్‌జీని కాదని వినోబా భావేను వ్యక్తి సత్యాగ్రహమునకు ఎంపిక చేసిన ఘట్టాలు అహింసా నిర్వచనానికి తార్కాణాలు.

గాంధీజీ తన నమ్మకముగాని, సిద్ధాంతములుగాని ఎవరిపై రుద్దలేదు. కాని గాంధీజీ ప్రభావము నుండి ఎవ్వరూ తప్పికోలేక పోయారు.

శ్రీ ముదిగొండ సిద్ధ రాజలింగంగారి ఈ చిన్ని సంపుటి భావితరాల వారికి ఆచరణయోగ్యము, ఆమోద యోగ్యము అవుతుందని ఆశిస్తున్నాను.

భావితరాలవారు ఈ పుస్తకరీత్యా శ్రీ రాజలింగంగారికి ఋణపడి వుంటారని నా భావన.

407, Stony Apartments
Jawahar Nagar
Hyderabad - 500 020.
Phone : 7639215

క్రొవ్విడి హనుమంతరావు
అడ్వకేట్.

# ఆమోదనం

మహాత్మాగాంధీ సిద్ధాంతాలు - జీవనసారం 'బాపు-నేను' శ్రీ రాజలింగంగారి అలనాటి జ్ఞాపకాలు అజ్ఞాతవాస అనుభవాలు చక్కగా పొందుపరచబడిన నిత్యసత్యాల మణిహారం. సరళంగా సాగిన రచనలో రచయిత గత కాలపు మధురస్మృతులు పాఠకుని జాతీయభావంతో ఒళ్ళు పులకరింప చేస్తుందంటే అతిశయోక్తికాదు.

దేశానికి ఆయువు పట్టయిన గ్రామాల అభివృద్ధికి, ప్రప్రథమంగా పూజింప దగిన గోమాత సంరక్షణవంటి ఉత్తమ ఉన్నత ఆశయాల సిద్ధికై ప్రారంభించి సాగించిన ప్రస్థానం సేవాగ్రాం. రాజకీయ, ఆర్థిక స్థోమత, నైతిక శక్తిని సవరించుటకేకాక ఆత్మోన్నతికి సత్యస్వరూపమైన బ్రహ్మము గుర్తించే సాధన కేంద్రంగా సబర్మతి సేవాగ్రాం ఆశ్రమ స్థాపన జరగడం విశేషం. నిర్మలమైన మనసుతో మహాత్ముని సన్నిధిని గడిపిన పవిత్ర కాలం శ్రీ రాజలింగంగారి జీవితంలో సువర్ణాక్షరాలతో లిఖింపదగినది.

నాటికి-నేటికి- ఎన్నటికీ గుర్తుంచుకొనదగిన ఆణిముత్యాలవంటి వాక్యాలు కొన్ని :

'' నిర్మాణ కార్యక్రమ సంస్థలలో వున్నవారు సత్యాగ్రహం వంటి రాజకీయ ప్రక్రియలలో పాల్గొనరాదు''.

''పిరికితనంతో దుష్టులకు లొంగేదానికన్నా ఎదిరించి మనం మన సంరక్షణ చేసుకోవడంలో మరణించుట మంచిది. దీనిని పాటించకపోవడం మన పిరికితనం. ధైర్యంతో యిలాంటి దశలో చేసిన ప్రతిఘటన అహింసయే''. అది బలహీనుల అహింస కావచ్చు.

''సత్యం వలన ప్రేమ సౌకుమార్యం నమ్రతవంటివి ఏర్పడుతవి. అది మనకు సహనాన్ని బోధిస్తుంది. మనలోని కాఠిన్యాన్ని పోగొడుతుంది. మనలోని లోపాలను చిన్నచిన్న మచ్చలుగా చూపుతుంది''.

''దొంగతనం లేకపోవడం సత్యంలోని అంశం. అస్తేయక నిర్వచనం ఇంకా లోతైనది. ఇతరుల ఆస్తిని వారి ఆజ్ఞతో తీసికొనుట డేనినైన తగు అవసరం లేకుండా సంగ్రహించుట దొంగతనమే.''

''దీక్ష పవిత్ర ఆశయం కావాలి. ఆమరణదీక్ష కేవలం పశ్చాత్తాపానికై ఉండరాదు. అది సత్యమును గుర్తించిన ప్రాయశ్చిత్తంగా వుండాలి''.

''దైవదత్తమైన ప్రకృతికి మనం సహకరిస్తే ప్రకృతి మనకు సహకరిస్తుంది''.

ఆనాటి నిర్మలమైన గ్రామీణ వాతావరణం, ఆశ్రమవాసుల నిరాడంబర జీవిత విధానం కన్నులకు కట్టినట్లుగా చిత్రీకరించడంతోపాటు గాంధీగారి ఆశయాలు – ఆచరణలు వివరించిన ఉత్తమ గ్రంథమిది. నాలాంటి వారికి ఇలాంటి పరిచయ వాక్యాలు వ్రాసే అదృష్టం కలుగడం నా భాగ్యంగా భావిస్తున్నాను.

హైదరాబాద్–500 013.
ఫోన్ : 7611494

డా॥ సురవరం పుష్పలత

# యువతకు స్ఫూర్తి

భారతదేశ చరిత్రలో 20వ శతాబ్దము సువర్ణ అక్షరములతో లిఖించ బడవలసినది. సూర్యుడు అస్తమించనంత విశాల సామ్రాజ్యాధినేత బ్రిటీష్ ప్రభుత్వాన్నించి, భారత దేశానికి స్వాతంత్ర్యం, కేవలం అహింసావాదంపై తెచ్చిపెట్టిన మహనీయుడు గాంధీ. మానవాళికే రాజ్యాల్ను నెత్తురు బొట్టులేకుండ, శాంతియుతంగా మార్పు జేయవచ్చు అని నిరూపించి - ప్రపంచానికి అహింసా వాదాన్ని ప్రయోగమును, భారత్‌లో ఆచరణపెట్టి విజయం సాధించిన శతాబ్దము. ఈ మహాత్ముని సిద్ధాంతం మనం ఆచరణలలో వున్నంత వరకు మన భవిష్యత్ పదిలంగా వుంటుంది.

నేను ఎన్నో కమ్యూనిస్టు దేశాలు, సామ్యవాద దేశాలు పర్యటించాను, మన దేశంలో వున్న ప్రజా స్వామ్యం అక్కడ అంతగా గోచరించలేదు. అదృష్టవశాత్తూ స్వాతంత్ర్యం వచ్చిన కొంత కాలం అన్నీ సవ్యంగానే వున్నాయి. రానురాను గాధీగారి సిద్ధాంతములు నీరుగారి పడిపోతున్నాయి. తరాలు మార్పులో, యువతరం గాంధీ అహింశావాదాన్ని మరచిపోతున్న సూచనలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. **ఆ రోజుల్లో గాంధీగారి వాక్కు పాటించి, తన సంపదలు, ప్రాణాలు కూడా త్యజించడానికి వెనుకాడని కుటుంబాలు, నేడు వారి పెద్దలు జేసిన త్యాగానికి ప్రతిఫలంగా దేశాన్ని దోచేస్తున్నారు. ఇందులో కొంతమంది మినహాయింపు వుండిన, ఎక్కువ శాతం ఆ తరం కుటుంబాలు స్వార్థమే పరమావధిగా వ్యవహిస్తున్నాయి.** దీనికి గాంధీజీ సిద్ధాంతాలు, వారి పెద్దలు త్యాగాలు మర్చిపోవుటయే! ఇలాంటి పరిస్థితులలో దేశ భవిష్యత్ కాపాడుట మనందరి కర్తవ్యం. గాంధీగారితో సన్నిహితంగా మెలిగిన వారే ఈ గురుతర బాధ్యత వహించవలసి వున్నది.

పూజ్యులు శ్రీ రాజలింగంగారు ప్రముఖ న్యాయవాది. త్యాగధనులు, స్వార్థం వారి జీవితకాలం ఎరుగరు. మహాత్మాగాంధీగారితో కొన్ని సంవత్సరములు సన్నిహితంగా వుండి గాంధీగారి మెప్పు పొందారు. శ్రీ రాజలింగంగారు తన 81వ జీవన స్రవంతిలో, ఎంతో శ్రమ తీసుకుని, ఇలాంటి పుస్తకం వ్రాయటం, చిన్న విషయం గాదు.

**దేశంలో మనముందున్న సమస్యలు అన్నిటికంటే** యువతరంలోని అశాంతి, అలజడి, అసహనం ఎన్నో వక్రమార్గాలను, అశాంతినీ కలుగుజేస్తున్న ఈ తరుణంలో యువతకు మంచి స్ఫూర్తినిచ్చి, **దేశసేవకు అంకితం చేయుగలరని ఆశిస్తున్నాను.** ఈ పుస్తకం, పాఠశాల, కళాశాల, విద్యార్థిలోకం చదివి, గాంధీ సిద్ధాంతాలు మననం జేసుకుని భారతదేశం శాంతి సౌభాగ్యాలకు తోడ్పడగలరని ఆశిస్తాను.

ఇంత గొప్ప యజ్ఞము, ఇంత పెద్ద వయస్సులో ఎంతో శ్రమకు ఓర్చి - గాంధీగారి పై విశ్వాసంతో భారత యువతకు స్ఫూర్తినిచ్చుటలో సఫలీకృతలగుదురని ఆశిస్తాను. పూజ్యులు శ్రీ రాజలింగం గార్ని, మనసా, వాచా అభినందించుచున్నాను.

డా. సుంకు బలరాం.

# ఈ రచన చదివి తీరాలి

సహృదయతతో నా అభిప్రాయం కొరకు మీరు పంపిన బాపు-నేను రచన పూర్తిగా చదివాను. చదువుతున్న కొద్దీ యింకా చదవాలనే ఉత్సుకత కల్గింది.

నీతి, మానవ విలువలు చాలావరకు అడుగంటిపోయిన ఈ రోజుల్లో మహాత్మాగాంధీ గారి జీవితం, వారి ఉద్బోధలు, ఆచరణ, ఆదర్శమవుతుందనడంలో సందేహం లేదు.

మహాత్మాగాంధీగారి సాన్నిహిత్యంలో మీ జీవిత విధానాన్ని సంస్కారాన్ని రూపొందించుకుని మీరు ధన్యులయినారు.

మీ రచనలో మహాత్మాగాంధీగారి ఉన్నత ఆశయాలు, ఆచరణలు, కళ్ళకు కట్టినట్లు వివరించారు. నేటితరంవారు ప్రతి ఒక్కరు మీ రచన చదివి వారి జీవితాలను మంచి మార్గాలలో నడుపుకొనుటకు ఎంతయినా తోడ్పడగలదని భావిస్తున్నాను.

కరవది వెంకటేశ్వర్లు
అడ్వకేట్

లాయరుపేట, ఒంగోలు.
ప్రకాశం జిల్లా

# ఈ రచన చదివి తీరాలి

సహృదయతతో నా అభిప్రాయం కొరకు మీరు పంపిన బాపు-నేను రచన పూర్తిగా చదివాను. చదువుతున్న కొద్దీ యింకా చదవాలనే ఉత్సుకత కల్గింది.

నీతి, మానవ విలువలు చాలావరకు అడుగంటిపోయిన ఈ రోజుల్లో మహాత్మాగాంధీ గారి జీవితం, వారి ఉద్బోధలు, ఆచరణ, ఆదర్శమవుతుందనడంలో సందేహం లేదు.

మహాత్మాగాంధీగారి సాన్నిహిత్యంలో మీ జీవిత విధానాన్ని సంస్కారాన్ని రూపొందించుకుని మీరు ధన్యులయినారు.

మీ రచనలో మహాత్మాగాంధీగారి ఉన్నత ఆశయాలు, ఆచరణలు, కళ్ళకు కట్టినట్లు వివరించారు. నేటితరంవారు ప్రతి ఒక్కరు మీ రచన చదివి వారి జీవితాలను మంచి మార్గాలలో నడుపుకొనుటకు ఎంతయినా తోడ్పడగలదని భావిస్తున్నాను.

**కరవది వెంకటేశ్వర్లు**
అడ్వకేట్

లాయరుపేట, ఒంగోలు.
ప్రకాశం జిల్లా

అదృష్టవశాత్తు స్వామి రామానందతీర్థ వార్ధాలో కన్పించారు రాజలింగంగారికి. స్వామిజీని కలుసుకొని వార్ధాకు తానెందుకు వచ్చానో తెలియజేసారు రాజలింగంగారు.
బజాజ్‌ట్రస్ట్ కార్యదర్శి శ్రీ దామోదరదాసు గార్కి స్వామీజీ శ్రీ రాజలింగం గూర్చి సిఫార్సు చేస్తూ లేఖను వ్రాసి యిచ్చారు. బజాజ్ ట్రస్ట్ నుండి పదిరూపాయల స్కాలర్ షిప్ పొందగలిగారు రాజలింగంగారు.
గాంధేయ ఆర్థిక తత్వవేత్త జె.సి. కుమారప్ప ఆధ్వర్యములో నిర్వహింప బడుతున్న గ్రామీణ విద్యాలయంలో విద్యార్థిగా చేరారు రాజలింగంగారు. విద్యాలయంలో గానుగ పరిశ్రమ, తేనెటీగల పరిశ్రమ, కాగితం పరిశ్రమల్లో శిక్షణ పొందడం ప్రారంభించారు రాజలింగంగారు. గాంధీజీతో సేవాగ్రామ ఆశ్రమంలో రెండు సంవత్సరాలు గడిపారు. ఆశ్రమవాసులు వంటలో ఉప్పు, కారం, మసాలా లేని ఆహారం తీసుకొనవలెను. ధనియాలు, జీలకర్ర, మెంతులు మసాలా క్రిందకు రావని వాదించారు రాజలింగంగారు. వాటిని పోపులో వాడడం కూడా మొదలుపెట్టారు, రసోయి ఇన్‌ఛార్జీగా వున్న రాజలింగంగారు. ఇంతవరకు అలా జరగలేదని, ఇది ఆశ్రమ క్రమశిక్షణకు భంగమని తన అభ్యంతరము గ్రామీణ విద్యాలయం సూపరిండెంటు చిత్రిజీ గారు తెలియజేసారు. గాంధీజీ వద్దనే తేల్చుకుందామని యిద్దరు అనుకొన్నారు. ఒకరోజు ఉదయం రాజలింగంగారు, చిత్రిజీ కలిసి గాంధీజీ వద్దకు వెళ్ళారు. గాంధీజీని దర్శించినపుడు ధనియాలు, జీలకర్ర మసాలా క్రిందకురావు కదా అని చెప్పారు రాజలింగంగారు. మసాలా పదనిర్వచనం చేసారు గాంధీజీ. అది విన్నమీదట ఆ అలవాటును మార్చుకుంటానని గాంధీజీకి వాగ్దానము చేసి గాంధీజీ అభిమానాన్ని చూరగొన్నారు, ఆశీస్సులు పొందారు రాజలింగంగారు.
కాగితపు పరిశ్రమలో శిక్షణ యిచ్చే కృష్ణమూర్తిగారితో కలసి వినోబాజీ వున్న పౌనారు గ్రామానికి రాజలింగంగారు వెళ్ళారు. సేవాగ్రాంలో డైరీఫారం మేనేజరు పార్నీకరుజీ యింటికి వెళ్ళారు. గోసేవకు తానేంతో చేసానని, యింకను చేయదలచుకున్నానని, నేర్చుకునేందుకు విద్యార్థులు రావడం లేదని పార్నీకరుజీ అన్నారు. నేర్చుకొనేందుకు సిద్ధంగా ఉన్నానని రాజలింగంగారు తన యిష్టాన్ని పార్నీకర్‌జీకు తెలియజేసారు. సరే అని అన్నారు పార్నీకర్‌జీ, సేవాగ్రాంలో యున్న ప్రభాకర్‌జీని కలుసుకొని సేవాగ్రాంనకు తానుకూడా వస్తున్నానని ప్రభాకర్‌జీకు రాజలింగంగారు చెప్పారు. ఆయన సంతోషపడ్డారు.
1941లో వినోభాజీని, వ్యక్తి సత్యాగ్రహము చేసినందుకు వార్ధాజైలులో నిర్బందించింది బ్రిటీషు ప్రభుత్వము. దానికి నిరసనగా గ్రామీణ విద్యాలయ విద్యార్థులంతా వార్ధా జైలు

వద్ద తన నిరసన తెలియజేసారు. రాజలింగంగారు ఈ నిరసన కార్యక్రమములో ప్రముఖపాత్ర వహించారు. నిర్మాణ కార్యకర్తలు ఈ విధమైన ప్రదర్శనలు చేయరాదని కుమారప్పగారు వారిని హెచ్చరించారు. నిర్మాణ కార్యక్రమము రాజకీయాలకు భిన్నముకాదని రాజలింగంగారు తన అభిప్రాయాన్ని తెలియజేసారు. జైలువద్ద ప్రదర్శనలు చేసారు. తిరిగి వచ్చిన మిదట నీవు సంస్థకు నిప్పులాంటి వాడవు అని రాజలింగంగారితో అన్నారు, కుమారప్పగారు.

సేవాగ్రాం ఆశ్రణములో చేరేందుకు వార్ధా, గ్రామీణ విద్యాలయాన్ని విడిచిపెట్టారు రాజలింగంగారు. పార్నీకర్‌జీని కలిసారు. కుమారప్పగారు పార్నీకర్‌తో కూడా రాజలింగంగారు సంస్థకు, నిప్పు వంటి వాడని చెప్పారని, పార్నీకర్‌జీ రాజలింగంగారిని తమవద్ద ఉంచుకోవడానికి వెనక ముందు అయ్యారు. అప్పుడు అచటవుండి పార్నీకర్‌జీ ఆశ్రమానికి దగ్గరవున్న కుమ్మరగుడిసెలో వుంటాననీ రాజలింగంగారు చెప్పారు. ఆయన తలవూపారు. ఆ కుమ్మరితో పార్నీకర్‌జీ మాట్లాడారు. ఆయన అంగీకరించారు. పార్నీకర్‌జీ వద్ద గోసేవా విద్యాభ్యాసం ప్రారంభించారు రాజలింగంగారు.

వెన్ననుంచి ఎక్కువ నెయ్యి తీసే పరిశోధనలో పార్నీకర్‌జీకు రాజలింగంగారు తోడ్పడ్డారు. ఈ ఫలితాల్ని మెచ్చుకొని అఖిల భారత గోసేవా సంఘం వారు రాజలింగంగార్కి రూ.20లు స్కాలర్‌షిప్ యిచ్చారు. రాజలింగంగార్కి గోసేవలో గుర్తింపు లభించింది. అసిస్టెంటు మేనేజరుగా అయ్యారు. రాజలింగంగారు తయారు చేసిన గ్లూకోజును బాబూ రాజేంద్ర ప్రసాద్, జమునాలాల్ బజాజ్ సతీమణి జానకీదేవి తప్పకుండా వాడేవారు.

గోసేవలో ప్రత్యేక గుర్తింపు లభించిన ఫలితంగా మహాత్ముని ఆశీర్వాదము పొందగలిగారు రాజలింగంగారు. వారి ఆశీర్వాదముతో ప్రార్థన రిజిస్టరులో రాజలింగంగారి పేరు నమోదయింది. పాలు, వెన్న, నేయి, గ్లూకోజ్ అమ్మకాలు పూర్తిచేసుకొని ప్రతిరోజు ప్రార్థనా సమావేశానికి హాజరయ్యే రాజలింగంగార్ని ప్రభాకర్‌జీ ఎదురొస్తూ, రా! రాజన్నా అంటూ తన పక్కనే కూర్చోపెట్టుకొనేవారు. ప్రార్థనలో వున్నంతసేపూ బాపూజీని చూస్తూ తన్మయత్వాన్ని చెందేవారు రాజలింగంగారు.

ఆశ్రమవాసులందరూ మహాత్మాగాంధీ నిర్దేశించిన ఏకాదశ వ్రతాలు నిత్యము ఆచరించాలనే నిర్ణయము కూడా రాజలింగంగారు క్రమశిక్షణతో పాటించారు. అవి (1) సత్యం, (2) అహింస, (3) బ్రహ్మచర్యం, (4) జిహ్వా నిగ్రహం, (ఆశ్వాదము) (5) ఆస్తేయము, (6) అపరిగ్రహము, (7) శరీర పరిశ్రమ, (8) స్వదేశి, (9) నిర్భయత్వం (10) అస్పృశ్యతా నివారణ (11) మత సహనం.

సేవాగ్రాం ట్రస్టు సభ్యులు ఆశ్రమంలో వున్న గుడిసెలపై మరమ్మతులకు రికరింగు ఎక్స్‌పెండిచర్ అధికమౌతున్నదని అటువంటి ఖర్చు నివారించుటకు బిల్డింగుగా మార్చాలని తలపెట్టారు. ఆ విషయం ప్రార్థనా సమావేశానంతరం ప్రస్తావించబడింది. అందరి అభిప్రాయాలు అడుగుతూ రాజలింగంగార్ని కూడా అడిగారు మహాత్మాజీ.
అదే జరిగితే మిమ్ములను, మీ ఆశయాలను మరచిపోతారేమే అని జంకు లేకుండా చెప్పారు రాజలింగంగారు. మరుసటి రోజు ట్రస్టు సభ్యులు గాంధీజీతో గుడిసెలకు బదులుగా పక్కా ఇళ్ళు నిర్మించే విషయంపై ఏకాభిప్రాయాన్ని సమిష్టిగా వెలిబుచ్చారు.
గాంధీజీ మీరంతా అలాగే చేయండి. కాని నన్ను, నా గుడిసెను మాత్రం వదిలి వేయండి అని అన్నారు. 22 సంవత్సరాల రాజలింగంగారి అభిప్రాయము ఎంత పరిణితి చెందియున్నదో అర్థమవుతుంది. గాంధీజీ కూడా అంగీకరించినందుకు రాజలింగంగారి జీవితం ధన్యత చెందినది. ఆశ్రమవాసులందరి అభిప్రాయానికి భిన్నముగా చెప్పగలిగిన రాజలింగంగారి ధైర్యము, సాహసము అసాధారణము. అప్రతిమానము. నేటికి కూడా ఇదే ధోరణి రాజలింగంగారు ప్రదర్శిస్తూయుంటారు.
గాంధేయ సిద్ధాంతాలు, ఆశయాలు, గాంధేయ జీవిత విధాము 1940 నుండి నేటివరకు ఏ రంగంలో యుండినా నిష్కళంకంగా చిత్త శుద్ధితో ఆచరించుచున్న రాజలింగంగారు ధన్యజీవి. వారికివే నా అభినందనలు.
సీనియర్ ఇంటర్మీడియట్ విజయనగర మహారాజావారి కళాశాలలో చదువుతూ 1942లో గాంధీజీ నడిపించిన క్విట్ ఇండియా ఉద్యమములో పాల్గొని ఆరు మాసాలు శిక్ష బళ్ళారి జైల్లో అనుభివించిన నేను, స్వాతంత్ర్య సమరియోధునిగా మిత్రులు రాజలింగంగారి కార్యక్రమాల పట్ల శ్రద్ధ కలిగిన వాణ్ణి. జ్యుడీషియరీలో నేను జడ్జిగా, రాజలింగంగారు పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా బాధ్యతలు నిర్వహించినప్పుడు న్యాయపరిరక్షణలో గాంధేయ సిద్ధాంత, ఆశయాలను మా యిరువురము మా పరిధులలో విడనాడలేదు. అందుకనే రాజలింగంగారి పట్ల నాకెంతో గౌరవము. పూజ్యభావం.
మహాత్మా గాంధీజీ ఆశ్రమంలో రెండు సంవత్సరాలుండి, వారి జీవన విధానాన్ని నాటినుండి నేటివరకు ఆచరిస్తూ, వారి ఆశయ సిద్ధాంతాలకు సంబంధించిన అనేక సంఘటనలను చక్కని శీర్షికలతో, రమ్యంగా గ్రంథస్తము చేసినందుకు రాజలింగంగార్ని, స్వాతంత్ర్య సమరయోధునిగా, సహ గాంధేయ వాదిగా అభినందిస్తూన్నాను. ఈ గ్రంథము గూర్చి నా అభిప్రాయము వెలిబుచ్చే అవకాశం కలిగించినందుకు, వారికి నా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

ఈ గ్రంధాన్ని హై స్కూలు, కాలేజీ విద్యార్థులకు పాఠ్యగ్రంథముగా విద్యాశాఖవారు, యూనివర్సిటీల వారు నిర్ణయించిన, జాతిపిత పూజ్య బాపూజీ ఆశయాలు, రాజకీయ, ఆర్థిక, సాంఘిక సిద్ధాంతాను వారి జీవన విధానాన్ని విద్యార్థులు తెలిసికొని ప్రభావితులయ్యే అవకాశం పొందగలుగుతారని ఆశిస్తున్నాను.

డాక్టరు న్యాయమూర్తి కొత్తపల్లి పున్నయ్య
రాజ్యాంగ సమీక్ష కమీషను సభ్యులు

**కుందన్‌బాగ్**
క్వార్టర్ నెం.3
మినిష్టరు కాలనీ, హైదరాబాదు
**ఫోన్ : 3412233**

# ఉన్నత వ్యక్తి

శ్రీ రాజలింగంగారు వ్రాసిన బాపు-నేను గ్రంథం చదివాను. గాంధీగారితో పరిచయం ఆయన చేసుకున్న అదృష్టం. నిర్మాణ కార్యకర్తలకు వారి అనుభవాలు ప్రతివారు మరో రూపంలో అనుభవించినవే. అది ఆయన పూజా ఫలితమే.

సిద్ధాంత నిబద్ధత కలిగి, తమ ఆశయ సాధనకోసం అంకితంగా పనిచేస్తున్న వారికి తమ అనుభవాలను ఈ గ్రంథం జ్ఞప్తికి తెస్తుంది.

ఆయన జీవితం స్వార్థమెరుగనిది. ఉన్నతవ్యక్తి కాబట్టి నైజాం సంస్థానంలో ఆమాత్రంగా నిలదొక్కుకొని రాగలిగారు. మన అందరికి ఆదర్శమూర్తి. ప్రతికార్యకర్త తమ అనుభవాలు జోడించుకొని ఆయనలాగా ముందుకు సాగాలి. వారికి నాశుభాకాంక్షలు.

భవదీయుడు

**పద్మభూషణ కళా ప్రపూర్ణ వావిలాల గోపాలకృష్ణయ్య**

ఫ్రీడమ్ ఫైటర్

ఆరండదల్ పేట,
గుంటూరు - 2.
ఫోన్ : 0863-55803

అధ్యక్షులు

**వావిలాల సమితి**

# నైతిక విలువలు

మాన్యమిత్రులు రాజలింగంగారికి ఆవుల సాంబశివరావు, ఆవుల జయప్రదాదేవి నమస్కరించి, ఉభయకుశలోపరి. మీరు అభిమానంతో పంపిన బాపు-నేను పుస్తకాన్ని ఆమూలాగ్రం చదివాము.

చదివిన పిమ్మట మహాత్మాగాంధీ వ్యక్తిత్వం, వారు సేవాగ్రాం ఆశ్రమాన్ని నడిపిన తీరుతెన్నులు, వారు స్థాపించి నడుపుతున్న విద్య, ఆర్థిక సంస్థలు మాకు బాగా అవగాహన అయినాయి. పర్యవసానంలో గాంధీజీ శ్రమించినది రెండు ఆదర్శాల కొరకు. ఒకటి, భారత దేశానికి స్వరాజ్య సిద్ధి, రెండు, భారతదేశానికే వెన్నెముక అయిన గ్రామాలు, గ్రామీణ ప్రజల ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక రంగాలలో గొప్ప అభివృద్ధిని సాధించడం. వాటి విజయ సాధనకు బహుముఖంగా వారు శ్రమించిన తీరును కనులకు కట్టినట్లుగా మీరు వివరించారు. ఆ ప్రయత్నంలో భాగస్వాములుగా ప్రతిభా వ్యుత్పత్తులు, అంకితభావం కలిగిన అనేకమందిని ఆయ ఏర్చికూర్చారు. అందుకనే ఒక మేధావంతుడు మట్టిలో నుండి మనుష్యులను, ఆ మనుష్యులలో నుండి మహా నాయకులను సృష్టించారు. వారికి స్ఫూర్తిని ప్రసాదించారు. అందుకనే గాంధీ తత్వాన్ని నమ్మి అనుసరించిన ఎంతమందో మహా మనీషులను ఆయన సృష్టించ గలిగారు. ఒక్కొక్క రంగంలో ఎవరు నైపుణ్యం చూపించారో వారికి నాయకత్వం పట్టాభిషేకం చేసారు. అటువంటి కార్యక్రమాన్ని నడిపించడంలో గాంధీజీ నేరపిన క్రమశిక్షణ, త్యాగ నిరతి, వీటన్నిటికీ మించి ఆయన అన్నిటికంటే ఎక్కువ ప్రాధాన్యమిచ్చిన నైతిక నిష్ఠ, మీ కలం ద్వారా మాకు బాగా అవగతమయినయి. గాంధీజీ అనగానే నైతిక విలువలు సూర్యభగవానుని లాగా ప్రకాశిస్తాయి. ఆ విలువలకు మారుపేరే మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ. అందుకనే భారతీయులు ప్రేమతో ఆయనను బాపూ అని పిలిచారు. జాతిపితగా పరిగణించారు.

ఈ వివరాలన్నీ మీ పుస్తకం తేట తెల్లంగా వివరిస్తున్నది. గాంధీ, గాంధీ తత్వంలోని అంతరంగాన్ని మీరు ఆవిష్కరించారు. తేలికయిన తెలుగులో ఈ విషయాలన్నీ తెలియజెప్పడం అతిముఖ్యమైన విషయం.

షుమారు రెండేండ్ల పాటు వారి ఆశ్రమ జీవితాన్ని పంచుకుని గాంధీజీతో సహచర్యం సాగించిన మీరు పుణ్యాత్ములు. అందరికీ లభ్యంకాని అనుభవాలు, మీ సత్యనిష్ఠతో, మీ క్రమశిక్షణతో దానిని సాధించి మీరు మీ జీవితానికి కలికి తురాయి లాంటి అనుభవాన్ని పొందారు.

మీ పుస్తకం చదివిన పిమ్మట మేమిద్దరం గాంధీజీని గురించి, గాంధీ తత్వాన్ని గురించి, మిమ్మల్ని గురించి, సరిక్రొత్త కోణంలో నుంచి చూడటం ప్రారంభించాం.

ఆవుల సాంబశివరావు, జయప్రదాదేవి

ఆంధ్రప్రదేశ్ లోకాయుక్త
రిటైర్డు
ఆంధ్ర యూనివర్సిటీ వైస్ ఛాన్సలరు
ప్లాటు నెం 1,2 కావూరి హిల్స్, జూబ్లి హిల్స్
పోస్టు,
హైదరాబాదు-500033. ఫోన్: 248324.

JUSTICE
**B. P. JEEVAN REDDY**
Chairman, Law Commission of India



LAW COMMISSION OF INDIA
SHASTRI BHAWAN
NEW DELHI - 110 001
TEL. : 3384475

Residence :
1, JANPATH
NEW DELHI - 110 011
TEL. : 3019465

January 4, 2001

Dear Shri Rajalingam-Garu,

I have read your book "**Bapu – Nenu**" with great interest. In fact, I finished it at one go, without putting it down. Your experiences at Wardha and your interaction with Mahatama Gandhi and his followers makes a very instructive reading, particularly to those who did not have the good fortune to see or interact with Gandhiji. The manner in which Vinobha Bhave was selected as the first **satyagrahi** in preference to Shri Jawahar Lal Nehru came to me as a revelation. I was deeply impressed by the letters written by Shaheed Bhagat Singh to his mother and to his friend Mr. Jehangir. In the letter addressed to his mother, Shaheed Bhagat Singh had expressed his apprehension that after India becomes free, as it is bound to, 'brown sahibs' will replace the 'white sahibs', which seems to have unfortunately come true.

Gandhiji's refusal to accede to the request of Panthji on the ground that any fast undertaken with self-interest is not to be recognized, as well as his refusal to allow his hut to be converted into a pucca house are instances of his greatness. The chapter on 'దురదృష్టము - అదృష్టము' demonstrates the great devotion of the ashramites towards Gandhiji and the manner in which Gandhiji dealt with them. It was very touching.

I am sure that the book will be found interesting, informative and instructive by every discerning reader. I must congratulate you on taking the trouble of writing this book which gives to all of us glimpses of the person and the character of Gandhiji and of those like you who had the good fortune to live with him in his ashram and partake in the activities there.

With warm regards,

Yours sincerely,

(Justice B.P. Jeevan Reddy)

Shri M.S. Rajalingam,
Former Minister P.W.D. & Labour,
Advocate,
H.No.1-1-336/18
Chikkadpally
Hyderabad 500 020

# నూతన అనుభూతి

శ్రీయుతులు యం. యస్. రాజలింగంగారు నాకన్నా వయస్సులో చాలా పెద్దవారు. అయినప్పటికి నన్ను వారి సన్నిహితులలో ఒకరిగా భావించటం చాలా సంతోషముగా యున్నది.

బాపు–నేను అను వారి అనుభవాలు ప్రచురించటంలో వారు భావితరం వారికి ఒక ఆదర్శ లక్షణములను తెలియ పరుస్తున్నారు.

నిజాం, బ్రిటీష్ దివాన పరిపాలనకు గురి అయిన ఆ రోజుల్లో ప్రజలలో ఏ విధముగా చైతన్యము వచ్చిందో, భిన్న అభిప్రాయాలు గలవారు ఒకే చోట ఎట్లా సమకూర్చినారో ఆశ్చర్యం. ప్రస్తుత పరిస్థితుల్లో అప్పటిక పరిస్థితుల తారతమ్యం కొట్టొచ్చినట్లుగా కనపడుచున్నది.

బాపు ఆశ్రమంలో ఆస్తికులు, నాస్తికులు, మత ఛాందస వాదులు, సంస్కరణ వాదులు, సంఘ సంస్కర్తలు అందరికి ఒక వేదికగా సమాయత్త పరచిన గాంధీజీ యొక్క గొప్పతనమును చూడవచ్చును.

బాపు దగ్గర క్రమశిక్షణలో మెలగడమన్నది తొలి పాఠమైతే, వ్యక్తి స్వాతంత్ర్యమునకు కూడా అంత ప్రాముఖ్యమున్నదని, విగ్రహారాధన–తీర్థ ప్రసాదాలు అను చాప్టర్ వల్ల తెలియుచున్నది. ఈ రచనల వలన శ్రీ రాజలింగంగారు, క్రమశిక్షణతో కూడిన స్వాతంత్ర సమరయోధుడుగానే కాక, ఆత్మగౌరవమును కూడా నిలుపుకున్న వ్యక్తిగా గుర్తించబడతారు.

ఈ గ్రంథములోని అంశములు ప్రస్తుత తరం వారికి, ఒక నూతన అనుభూతిని ప్రసాదించ గలదని భావిస్తాను.


– జి. యల్. యన్. శాస్త్రి
హోమియో వైద్యులు

మాజీ ప్రిన్స్‌పాలు,
గవర్నమెంటు హోమియో పతి కాలేజి.
1–4–880/20/8, గాంధీ నగర్
హైదరాబాద్ – 500 080.

# గాంధీతత్వం

బాపు–నేను పుస్తకంలోని సంఘటనలు గాంధీ ఆశ్రమంలోని మీ అనుభవాలు స్వయంగా మీ నోటితో చెప్పుతుండగా ఎన్నోసార్లు విన్నప్పటికీ, అవన్నీ పుస్తకరూపం దాల్చడం సంతోషం.

గాంధేయ తత్త్వ ప్రచారానికి నా ఆశీస్సుల విషయానికి వస్తే గాంధీగారి తత్త్వం విషయంలో నా అభిప్రాయాలు, మీకు నేను రాసిన 3.1.1945 నాటి ఉత్తరంలో స్పష్టంగానే ఉన్నాయి. అదంతా మీకు తెలిసిందే. ఆనాటి సంఘటనల్లో పాల్గొన్న నన్ను ఇన్నేండ్ల తరువాత మరువకుండా గుర్తుపెట్టుకొని పలుకరించినందుకు ఆనందం. ఆనాటి ఘటనలన్నీ మళ్లీ తలంపుకు వస్తున్నాయి.

మన యొక్క, మన దేశం యొక్క ప్రస్తుత పరిస్థితికి – అధికార రాజకీయాలలో ప్రవేశించి, అధికారం సంపాదించుకొన్నవారి అధికార దుర్వినియోగమూ, సర్వోదయం అనీ, అధికార రాజకీయాల్లో పాల్గొనం అని అనే పూర్వ స్వాతంత్ర్య సమరయోధుల మౌనముద్ర – నిద్ర–కారణం అనేది నా కచ్చితమైన అభిప్రాయం. ఈ విషయాన్నే పోయిన 40 సంవత్సరాలల్లో అప్పుడప్పుడూ బాపుతో నా గొడవ రూపంలో చెప్పుకున్నదే బాపూ, బాపూ, బాపూ, అన్న పుస్తకం అది పంపిస్తున్నాను ఈ ఉత్తరంలో.

నేను ఈ 87 ఏండ్ల వయస్సులో ఎట్లా వుండాల్నో అట్లా వున్నా నువ్వు ఈ మధ్య పెరాలిసిస్ స్ట్రోక్ వచ్చిందన్నావు. కాని 30 ఏండ్ల తర్వాత వరంగల్‌లో మళ్లీ ఒక రాజకీయ సభలో మాట్లాడటం ఇదే ప్రథమం అని నువ్వు అన్నప్పుడు నేను ఆ సభలో నీకు వేసిన ప్రశ్న జ్ఞాపకం వుండే వుంటుంది. ఆ అభిప్రాయం ఇవ్వాల్టి కీ మారలేదు. అట్లానే ఉన్నది.

ఆ నాడు సారస్వత పరిషత్ సభ పందిళ్ళు కాలబెట్టినప్పుడు నువ్వు, ఆరెళ్ళ బుచ్చయ్య, అడవాల ఇత్యాదులు గాయపడితే నిన్ను చూసి మా వరంగల్ గణేశ శంకర్ విద్యార్థి అన్న విషయంలో ఇప్పటికీ నా అభిప్రాయం మారలేదు.

ఏమైనా ఆనాటి సంఘటనలన్నీ మరొక్కసారి నెమరు వేసుకున్నాను నీ పుస్తకం చూసి, సంతోషం.

సుబేదారి
హన్మకొండ, వరంగల్.

పద్మ భూషణ కాళోజీ నారాయణరావు
సుబేదారి

# అభినందనీయులు.

ఎందరో మహానుభావులు జన్మించిన ఈ పుణ్యభూమిలో కొందరు యుగపురుషులైతే మరికొందరు కారణజన్ములైనారు. మానవతా వాదంతో అది సామాన్య జీవితం గడుపుతూ, అహింసా మహోన్నత శిఖరాలను అధిరోహించిన బాపూజీ, జన్మభూమిని గౌరవించి దేశమాత దాస్య శృంఖలాలను తెంచివేసి మహాత్ముడైనాడు.

అలాంటి మహాత్ముడి సమకాలీనత సహచర్యం, సాక్షాత్కారం లభ్యంకావడం ఎంతో పుణ్యంగా భావించాలి. గాంధీగారితో దాదాపు 2 సంవత్సరాల కాలం సేవాగ్రాం ఆశ్రమంలో గడిపిన శ్రీ యం. యస్. రాజలింగంగారు ధన్యులు.

గాంధీగారి జీవితాన్ని, తాత్వికతను, సిద్ధాంతాలను, అహింసను, నీతిని, ధర్మాన్ని నేటి సమాజానికి తమ అనుభవాలతో పొందుపరచిన గ్రంధాన్ని మనకందిస్తున్న మాన్యులు శ్రీ రాజలింగంగారు ఎంతో అభినందనీయులు.

శ్రీ రాజలింగంగారికి భగవంతుడు సంపూర్ణ ఆయురారోగ్యాలను ప్రసాదించాలని, వారి కలం నుండి సమాజ శ్రేయస్సు కొరకు అనుభవాలు వెలువడాలని కోరుకుంటున్నాను.

జెల్లా మార్కండేయ యం.ఏ., యల్.యల్.బి.

అధ్యక్షులు
ఆంధ్రప్రదేశ్ గ్రంధాలయ పరిషత్
స్టేట్ సెంట్రల్ లైబ్రరీ ఆవరణ
అఫ్జల్‌గంజ్, హైదరాబాద్ - 500 012.
Tele: 4615652

# పద్య నీరాజనము

కత్తిపట్టకుండ కదనమ్ములో దూకి
తెల్లదొరల అహము కొల్లగొట్టి
భరతమాత దాస్య బంధాలు తెగద్రుంచి
దేశమునకు స్వేచ్ఛ దెచ్చినట్టి
జాతిపితను గొలిచి జన్మసాఫల్యమ్ము
చేసుకొనిన పుణ్యశీలురందు
రాణకెక్కినట్టి "రాజలింగయతీంద్ర"
శిరసు వంచి నీకు సేతునతులు ..

బహుళార్థ సాధకమ్మై
ఇరపరముల విలువ దెలుపు ఇతిహాసమ్మున్
సహజోక్తుల వెలయించిన
మహనీయుడ వీవు బాపు మానస పుత్రా ...

బాపు-నేనను పేర పరమోన్నతములైన
నీతులు గ్రంధాన నిలిపినావు!
గాంధేయ మార్గమే కడుగొప్పదను సూక్తి
కర్థతాత్పర్యమ్ముల నదినావు!
జీవకారుణ్యమే త్రోవ ముక్తికటన్న
సత్యమ్ము పుటలందు జల్లినావు!
ఋజువర్తనమ్మను ఎనలేని వరమును
పూజ్య బాపూ నుంచి పొందినావు!
ధర్మ మార్గమే శ్వాసగా ధాత్రి జనుల
శ్రేయమే ధ్యాసగా శేషజీవితమ్ము
గతుపు చున్నట్టి నిను మెచ్చి గౌరవించి
పద్య నీరాజనమ్మిచ్చి ప్రస్తుతింతు ..

సహజకవి : మల్లెమాల

శబ్దాలయ,
ఎల్‌వి. ప్రసాద్ రోడ్డు, బంజారా హిల్స్,
హైదరాబాద్ – 500 034.

# Pioneering Work

It is a proud privilege for me to go through the Telugu Book on "Bapu and I" written by a true disciple of Gandhiji - Shri M.S.Rajalingamji himself. I have known Shri M.S.Rajalingam for over 5 decades very closely and intimately. He is among the few true Gandhians whom I have always admired and derived inspiration from his work. Whether in the field of constructive work or education, he is crystal clear in his analysis on all knotty problems of the day with a "Gandhian-touch". He has succeeded in resolving many deadlocked issues.

The book is very simple and can be easily read out by even an average person. It is again this stamp of Gandhiji that has endeared Shri Rajalingamji to write his memories of the Gandhi, his political mentor, is as simple language as Gandhiji did.

The book contains very very interesting anecdotes and the book is worth going through not once but many times to absorb the depth of love and affection that Rajalingamji has for Bapu. The book deals with Gandhiji's life and our younger generation must be enabled to know how to fight every evil of life and the value of truth and non-violence.

Shri M.S.Rajalingam deserves all praise for his pioneering work in bringing to light to the knowledge of present generation what Gandhiji meant to him and how he could do follow him in letter and spirit.

Such a marvellous book deserves to be adorned the shelves of all Libraries in the State and if necessary some excerpts from the book must be got translated in all languages to enable the younger generation in understanding Bapu in proper perspective.

We need Bapu today more then ever before. And, Shri M.S.Rajalingam has done yeoman service by bringing out this very valuable book to the benefit of the present generation.

I heartily congratulate him for this splendid work and hope that he will continue to write a few more books of the by-gone days where he has played a great role in the cause of India's Freedom Movement.

Jai Hind.

**V.H.Desai**

Bharatiya Vidya Bhavan
5-9-1105, Bhashirbagh, Hyderabad - 500 029.

Tele: 3237825
3230755

# చక్కటి గ్రంథము

భారతదేశ స్వాతంత్ర్యానికి త్యాగపురుషుడు గాంధీజీ జీవితాన్ని గురించిగాని, ఆయన చేసిన త్యాగాలను గురించిగాని మరిచిపోతున్న ఈ రోజుల్లో, ఎనుబది సంవత్సరాలు దాటిన ఈ వయస్సులో స్వాతంత్ర్య సమరయోధులు శ్రీ ముదిగొండ రాజలింగంగారు ఈ గ్రంథమును అందచేస్తున్నారు.

శ్రీ రాజలింగంగారు ఈ గ్రంథములో గాంధీజీతో తాము కలసి గడిపిన సందర్భాలను, అనుభవాలను వివరిస్తూ వాటిపట్ల ఇప్పటి వారికి శ్రద్ధాసక్తులు పెంపొందించుటకు తెలియ చేసిన విషయములు ఎంతో అభినంధనీయము. ఈ తరంవారికి ఈ గ్రంధము ఎంతో మార్గదర్శకము కాగలదనటానికి సందేహము లేదు.

ఇంత చక్కటి గ్రంధమును వ్రాసి ప్రజలకు అందచేసిన శ్రీ రాజలింగంగారు బహుధా అభినందనీయులు.

కాశీనాధుని సుబ్రమణ్యము

వాస్తు బ్రహ్మ, వాస్తు సామ్రాట్
షాపు నెం.:21, ..ఆర్. టవర్స్
చిరాగ్ – అలీ లేన్, హైదరాబాద్ – 500 001.

# సన్మార్గానికి దారి

శ్రీ యం. యస్. రాజలింగంగారి "బాపు-నేను" అనే గ్రంథం చదివే భాగ్యం కల్గింది. నేను, 1954లో వారు పి. డబ్ల్యు. డి. మంత్రిగా ఉన్నప్పటి నుంచి పరిచయమై, శాంతినికేతన్ సొసైటీలో సహజీవనం సాగిస్తున్న హితవరి, శ్రేయోభిలాషి అయిన వ్యక్తికి, ఈ పుస్తకం ద్వారా పరిచయమైన "శ్రమజీవి" కి ఏమాత్రం పొంతనలేదు. వారు సంఘంలో ఈనాటి ఉన్నతస్థితికి చేరుకోడానికి వెనుక ఉన్న కృషి, పట్టుదల, ధృడదీక్ష, బహుశః వారి నిత్య దైవచింతనాపరులైన తల్లితండ్రుల పుణ్యఫలం కారణమని తెలుసుకోగలిగాను.

అప్పటి "రాజ" ఒక పట్టుదల గల విద్యార్థిగా, కార్యకర్తగా, ఉద్యమకారునిగా, దీక్షాదక్షుడుగా, స్వాతంత్ర్య సమరయోధునిగా, లక్ష్యసాధకునిగా, తెలుసుకొని చాలా ఆనందించాను.

ఆయన, బాపుని చూడాలని, చేరాలని, సహచర్యం సాధించాలని, పడిన తపన, ఆవేదన, ఆరాటం, అది సాధించిన తర్వాత పొందిన ఆనందం చూస్తే, ఏ కార్యసాధకునికైనా కావలసిన ప్రవర్తన ఏమిటో అందరికి అర్థమౌతుంది. ఆయనే, ఒకచోట అంటారు – "కార్యాచరణకు, ధైర్య స్థైర్యాలు, ఆత్మ విశ్వాసము కావాలి", అలాగే "అపరిష్కృత సమస్యలకు సత్య స్వరూపమైన ఆదర్శగురువే సర్వం" –

బహుశః ఆ రోజుల్లో తన దినచర్య అయిన మజ్జిగ చిలికి వెన్న తీయటం, వెన్ననుండి ఎక్కువ నెయ్యి దిగుబడి అయ్యే విధానం కనుక్కోవడం, ఆయన జీవన్మథనానికి పునాది అనిపిస్తుంది. ఆనాటి విలువలు – స్నేహధర్మం, నీతినియమాలు, ఆదరణ, ఆప్యాయతలు, సేవాతత్పరత – మరుగునపడి, సుడిగుండంలో చిక్కుకున్న ఈ రోజుల్లో ఒక్కసారి వాటిని జ్ఞాపకం చేసుకుని, సన్మార్గానికి దారి తీయటానికి, ఈ పుస్తకం దోహదపడగలదని నమ్ముతున్నాను. ముఖ్యంగా, గురు శిష్యుల సంబంధం, పెద్దల యెడ గౌరవం, దేశం యెడల మన భాద్యత, లక్ష్యసాధనకు కావలసిన నడవడిక, అన్నీ దొరుకుతాయి ఈ పుస్తకంలో! ఎన్నో Historical Values గల విషయాలు కూడా ఉన్నాయి.

పూజ్య గాంధీగారిని చూడని, బహుశః ఆయన ఎవరో కూడా తెలియని ఈ తరం యువతకు, శ్రీ యం. యస్. రాజలింగంగారి పుస్తకం ఎంతో విజ్ఞానదాయకం, మార్గదర్శకం, స్ఫూర్తిదాయకం కాగలదని ఆశిస్తున్నాను.

కవిపురపు కామేశ్వరరావు
అడ్వొకేట్

1-1-336/27, వివేకనగర్ (New No.361)
చిక్కడపల్లి, హైదరాబాద్ – 500 020.
Tele: 7636825

# విలువైన అనుభవాల సంపుటి

శ్రీ ఎమ్.ఎస్. రాజలింగంగారు నన్ను తొలిసారిగా దివిసీమలో తుఫాను భీభత్సం జరిగినపుడు 1977లో కలుసుకోవడం జరిగింది. తర్వాత పునర్నిర్మాణ కార్యక్రమం సందర్భంలో నాకు పరిచితులయ్యారు. తొలుత దివిసీమ తుఫాను భీభత్సంలో దెబ్బతిన్న వారిని యుద్ధప్రాతిపదికమీద ఆదుకోవడానికి ఆ తర్వాత ఉప్పెనలో నామరూపాల్లేకుండా పోయిన పల్లెల పునర్మిర్మాణ కార్యక్రమాన్ని నిర్వహించేందుకు జిల్లా కలెక్టరుగా 1978-1982లో అధికారులు, అనధికారసంస్థలూ స్వచ్ఛంద సేవా సంస్థలతో కలిసి పనిచేసే అవకాశం నాకు లభించింది.

శ్రీ ఎం.ఎస్. రాజలింగంగారు రాసిన బాపు-నేను అనే గ్రంథాన్ని నేను ఆమూలాగ్రం చదివాను. మొట్టమొదటగా చెప్పుకోవాల్సింది రచయితకు భావవ్యక్తీకరణ మీద వున్నపట్టు గురించి. ఏ ఒక్క వాక్యం గూడా అర్థం కాకపోవటం గానీ, లేదా విషయాన్ని దాటి ప్రక్కదారి పట్టడంగానీ జరుగదు. పాఠకుడు చివరిదాకా అలా అలా చదువుకొంటూనే వెళ్ళిపోతాడు గానీ ఆగిపోయి రచయిత ఉద్దేశ్యం ఏమై వుంటుందబ్బా అన్న ఆలోచనకి తావుండదు.

రచయితగారే అన్నట్టు ఏ సంఘటన విడిగా చదువుకోవడంవల్ల ఎక్కడా విసుగనిపించదు. ఎందుకంటే పాఠకుల అదృష్టం కొద్దీ గాంధీగారిని చూడ్డమేకాదు ఆయనతో కొంతకాలం గడిపిన రాజలింగంగారు మనందరికి తెలిసిన వారవ్వడమేకాదు ఏ అనుభవానికి ఆ అనుభవం పరిపూర్ణమూ సంపూర్ణమూ అవడం వల్ల నిజానికి ఈ సంఘటనలన్నీ మనల్ని ఆ కాలానికి తీసుకెళ్తాయి. ఆ రోజుల్లో విలువలు, ఇవాళ్ల చాలా సాధారణమై పోయినవి. విషయాలపట్ల ఆ రోజుల్లో వున్న సంకోచాలు ఇత్యాది తెలుసుకునే అవకాశ, పాఠకులకు కలుగుతుంది.

తర్వాత రచన మొత్తం ఏదో ఒక్క విషయానికి పరిమితమవ్వదు. జీవితంలో మనం ఎదుర్కొనే అనేక విషయాలు - కుటుంబ విషయాలే కానివ్వండి - స్నేహాలు కానివ్వండి - ఆరోగ్య సూత్రాలు కానివ్వండి - దైవభక్తి మూఢాచారాలు కానివ్వండి -

చివరికి ఆరోగ్యపరమైన విషయాలు కూడా. ఇంత వెరయిటీ వుండటంవల్ల చదవాలన్న ఆసక్తి పెరుగుతుంది. ఈ విషయాల పట్ల ప్రత్యేకంగా జిజ్ఞాస పట్టుదల వుంటే తప్ప తేలిగ్గా అర్థం కావు. రచయితకు వాటిని అర్థం చేసుకునే ఆసక్తే కాదు, ఇతరులకు వివరించే శక్తి కూడా పుష్కలంగా వుంది.

చివరకు ఒక్కమాట ఈ పుస్తకం చదవటంవల్ల కొందరు ప్రసిద్ధ వ్యక్తుల గురించి, మరికొంత తెలుసుకునే అవకాశం కూడా లభిస్తుంది. ఉదాహరణకి సురేంద్రనాథ్ బెనర్జీ గురించి వినటమే గానీ ఆయన గురించి తెలిసిన వారు అరుదు. ఇందులో బెనర్జీ గారి గురించి క్లుప్తంగానయినా కొంత ప్రస్తావన వున్నది.

గాంధీగారు నమ్మి ఆచరించిన విలువలు ఏమిటో తెలియకుండా పోతున్న ఈ రోజుల్లో ఈ పుస్తకం రావడం ఈ తరం వారి అదృష్టంగా చెప్పుకోవాలి.

నేను కృష్ణాజిల్లా కలెక్టరుగా ఎనలేని దీక్షతో తుఫాను బాధితుల సహాయకార్యక్రమాల నిర్వహణలో మునిగి వున్నప్పుడు శ్రీ రాజలింగంగారు ఇంకా మరికొన్ని స్వచ్ఛంద సంస్థలతోపాటు సహాయ కార్యక్రమాలలో పాల్గొన్న విషయం నాకు బాగా గుర్తుంది. అతని నిరాడంబరత, దయాగుణం, లాభాపేక్షలేని మనసు నన్నెంతో ఆకట్టుకుంది. బహుశా పూజ్యబాపూజీతో ఉన్న అనుబంధం వీటన్నిటికీ కారణం అని నమ్మకతప్పదు. ఆయన ఒక మంచి గాంధేయవాదే కాకుండా, నాలుగు దశాబ్దాల క్రితం మన రాష్ట్రానికి మంత్రిగా సేవలందించిన శ్రీ రాజలింగంగారికి నా నుంచి సర్టిఫికేట్ అవసరం లేదని నా ప్రగాఢ విశ్వాసం.

ఒక నిజమైన గాంధేయవాదిగా శ్రీ ఎమ్.ఎస్. రాజలింగంగారు తన అనుభవాలను కళ్ళకు కట్టినట్లుగా వివరించిన ఈ విలువైన సంపుటి, బాపు–నేను తెలుగువారి అశేష ఆదరణ పొందగలదని, వారి ప్రయత్నం సఫలం కావాలని, ఇంకా ఇతోధిక సేవలందించడానికై వారు ఆయురారోగ్యాలతో ఉండాలని ఆకాంక్షిస్తూ.....

Revenue Department,
A.P.Secretariat,
Hyderabad.

**Dr. A.V.S.REDDY, I.A.S.**
**Principal Secretary to Govt.**

JUSTICE K. RAMASWAMY



Member
National Human Rights Commission

February 7, 2000

I have the advantage of being together with Shri M.S. Rajlingam, a veteran freedom fighter, as government pleaders in the High Court of Andhra Pradesh from October, 1974 onwards. Though he was much senior to me at the Bar, he had treated me with courtesy as his brother. Ever since, we have been in close contact. I have the advantage and benefited to read his experiences with Bapu Mahatma Gandhiji, the Father of the Nation in Sevagram in 1940 and 1941. His varied experiences as a young man with veteran freedom fighters detailed in this book not only reminiscences the conviction, commitment and dedicated service done to the Nation as freedom fighters but also a leaf to take from the book of their lives to emulate by the younger generations to discipline themselves with devotion and public service. Many among younger generation primarily concern of their rights forsaking the duty to the society. Liberty is freedom, freedom without responsibility leads to anarchy. India won freedom at the altar of sacrifice of countless precious lives of freedom fighters ultimately under the leadership of the Father of the Nation, Mahatma Gandhiji. In a free democratic polity governed by rule of law, we have adopted Republican form of government assuring to every citizen equality of status and opportunity, dignity of the individual, liberty and fraternity with justice.

Ours is a pluralistic society, in particular, Hindu social order is based on hierarchical caste structure. Bapuji, the Father-of the Nation, preached and practiced abolition of untouchability, now a constitutional right in Article 17 of our Constitution. Unequal status undermines dignity of the individual, in particular, the weaker sections of the society. Every individual is born free but is chained with societal practices hierarchical castes practices and unequal economic conditions, poverty, penury, illiteracy and squalor. The dignity of the individual is inherent in every person a basic human right. It becomes a reality only when every person is treated as equal fastering fraternity irrespective of the caste, religion, race, region or language. The culture and spirit of human rights faster human dignity, equality of status and fraternity. Unfortunately, in 52 years after the

134, SARDAR PATEL BHAWAN, PARLIAMENT STREET, NEW DELHI-110 001 (INDIA), PH : 3734986
RESIDENCE : 13, WILLINGDON CRESCENT, NEW DELHI-110011 (INDIA), PH : 3018814
HYDERABAD RESIDENCE : H.NO. 1043, "SHYAMALA SADAN", ST. NO. 14, ADVOCATES COLONY, DOMALGUDA
HYDERABAD-500029 (INDIA), PH : 040-7631235

independence, we have tended to assert only our rights and forgot to perform correlative duty towards our fellow citizens in particular, and to the society at large. Even the 10 fundamental duties (10 commandments) mentioned in the Article 51(A) of the Constitution more often are observed in breach than obeying as fundamental duties, namely, every Indian citizen owes fundamental duties to (1) abide by the Constitution and respect its ideals and institutions, the National Flag and the National Anthem; (2) cherish and follow the noble ideals which inspired our national struggle for freedom; (3) uphold and protect the sovereignty, unity and integrity of India; (4) defend the country and render national service when called upon to do so; (5) promote harmony and the spirit of common brotherhood amongst all the people of India transcending religious, linguistic and regional or sectional diversities; to renounce practices derogatory to the dignity of women; (6) value and preserve the rich heritage of our composite culture; (7) protect and improve the natural environment including forests, lakes, rivers and wild life, and to have compassion for living creatures; (8) to develop scientific temper, humanism and the spirit of inquiry and reform; (9) safeguard public property and to abjure violence; (10) strive towards excellence in all spheres of individual and collective activity, so that the nation constantly rises to higher levels of endeavour and achievement. Therefore, with a view to inculcate the need for observance of duties and to abide by the fundamental freedoms and human rights, the human right education and observance of human rights culture are absolutely necessary. They should be made as a part of our educational curriculum which is now gradually being made part of educational programme of action. .This book though short contained wealth of details on every facet of life, in particular, duty with dedication and pursuit. This book, therefore, fills the gap and serves as a useful guide to the reader to emulate the lives of the freedom fighters for developing spirit of sacrifice, devotion, duty and dedication.

Since I am younger to Shri M.S. Rajlingam Garu, I only pray Lord Almighty to shower His blessings for good health and long life so that the era of genuine and dedicated freedom fighters will be emulated by the younger generation to tread their path and serve the society. This book also will be a useful edition not only to Telugu literature but also to freedom movement as a historical peace of evidence.

**( DR. JUSTICE K. RAMASWAMY )**

# శాంతి, సౌభాగ్యాలకు మార్గం

ప్రజాహితాన్ని మాత్రమే పరమధ్యేయంగా భావించకలిగినవారే ఉత్తమ నాయకులు అలాంటివారు తమ దైనందిన ప్రవృత్తిలో అత్యున్నతమైన నైతిక ప్రమాణాలు నెలకొల్పి తదనుసారం తాము ప్రవర్తిస్తూ ఇతరులను ఆ మార్గంలో నడపకలుగుతారు. మాన్యులు శ్రీ యమ్.యస్. రాజలింగంగారు అలాంటి ఉత్తమ కోటికి చెందిన రాజకీయ నాయకులలో ఒకరుగా వివిధ రంగాలలో సమాజాభ్యున్నతికి ఎంతో కృషి చేసిన వ్యక్తి. ప్రజా నాయకులకుండవలసిన ఇలాంటి ఉత్తమ లక్షణాలను వీరు ఎలా పెంపొందించుకొన కలిగారో వారి ఈ 'బాపు-నేను' అనే రచన ద్వారా కొంతవరకు మనం తెలుసుకొనకలుగుతాం.

కొందరు స్వీయ చరిత్రలు వ్రాసుకొంటారు. మరికొందరు తమకు గౌరవపాత్రులైన వారి జీవిత చరిత్ర వ్రాస్తారు. ఆ రెండు రకాల గ్రంథాలలో కథానాయకుడు వాని జీవితంలో సాధించిన కొన్ని ఘనకార్యాల వర్ణనకు ప్రాధాన్యం ఉంటుంది. వారు ఆ కార్యాలు సాధించారంటే అందుకు ఎన్నో పరిస్థితులు వారికి తోడ్పడి ఉండాలి. అలాంటి పరిస్థితులు, అవకాశాలు అందరికీ లభించకపోవచ్చును. అందుచేత, అన్యదా సమర్థులైనా వారు అలాంటి కార్యాలు సాధించి ఉండకపోవచ్చును. అలాంటి రచనలలో అద్భుతానికి అధిక ప్రాధాన్యం ఉంటుంది. అనుకరణకు, అనుసరణకు అవకాశం తక్కువగా ఉంటుంది.

ఈ గ్రంథం ఆ రెండింటిలో ఏ ఒక్కదాని కోవకి చెందిన గ్రంథం కాదు. స్వీయచరిత్ర కాదు. స్వీయుని చరిత్రాకాదు. స్వ-స్వీయచరిత్ర. ఉభయవిధ గ్రంథం, ఉభయాతీత గ్రంథం. దీని స్వరూపాన్ని పట్టి చెప్పాలంటే స్వధర్మ చరిత్ర. మానవ ధర్మ చరిత్ర మానవుడు తనదిగా గ్రహించి ఆచరించవలసిన ధర్మము చరిత్ర. ఒక మహాపురుషుడు కేవలం మాటలతో కాక స్వీయచరణ పూర్వకంగా ఉపదేశించిన లక్షలాది జనులను ప్రభావితం చేసిన ధర్మము చరిత్ర.

ఎన్నో సంఘటనలతో నాడి ఉన్న మహాత్మాగాంధీ జీవిత చరిత్రను వారి బాల్యం మొదలు చివరివరకు అతి సంక్షిప్తంగా వ్రాసినా కూడ వెయ్యిపేజీలకు మించిన గ్రంథం అవుతుంది. అలాంటి గ్రంథం రచించడానికి మహాత్మునితో సన్నిహిత సంబంధం ఉండవలసిన పనిలేదు. ఆయనను ఒక్కమారు చూడడానికి అవకాశం కూడా లేని, కాలాదులచేత ఆయనకు సుదూరంగా ఉన్న రచయిత కూడ అలాంటి గ్రంథం వ్రాయవచ్చు. అయితే అలాంటి గ్రంథం చదివినవారికి

ఆయా చారిత్రక సంఘటనల జ్ఞానమే కలగవచ్చునేమో గాని ఆ సంఘటనలతో సంబంధించి ఉన్న ఆ మహాత్ముడు మహాత్ముడెట్లయ్యాడో, సరియైన జ్ఞానం కలగకపోవచ్చును. మహారణ్యం కనబడుతుంది. కాని చెట్లు సరిగా కనబడవు. ఇది సంఘటనలకు మాత్రం ప్రాధాన్యం ఇచ్చిన గ్రంథం కాదు. మహాత్మునికి మహాత్మత్వాన్ని సంపాదించిపెట్టిన వారి మహోన్నత లక్షణాలను, ఇతరులపై వాటి చిరస్థాయియైన ప్రభావాన్ని స్పష్టంగా ప్రతిపాదించే గ్రంథం. ఆయా పత్రాదుల ద్వారా విషయాలు సంచయనం చేసి వ్రాసిన గ్రంథం కాదు. స్వానుభవపూర్వకంగా వ్రాసిన గ్రంథం. అందుచేత ఇది ప్రమాణం చేత అల్పకాయమే అయినా ప్రామాణికతచేత, ఉత్తమ ప్రయోజన సంపాదకతచేత మహాగ్రంథం.

అచంచలమైన దేశభక్తితో, దృఢమైన ఆత్మ విశ్వాసంతో శ్రీ రాజలింగం గారు నవయువకుడుగా మొట్టమొదట వార్ధాలో కాలిడి క్రమక్రమంగా గాంధీ మహాత్మునికి సన్నిహితత్వాన్ని పొంది ఏ విధంగా వారి సిద్ధాంతాల చేత ప్రభావితులయ్యారో ఈ గ్రంథం మనకు స్పష్టంగా చెపుతుంది. అహింస, సత్యం, అస్తేయం, బ్రహ్మచర్యం, అసంగ్రహం, శరీరశ్రమ, అస్వాదం, సర్వత్రభయవర్జనం, సర్వధర్మ సమానత్వం, స్వదేశీయభావన, అస్పృశ్యతా నివారణం, అనేవి మహాత్ముడు తాను స్వయంగా ఆచరించి, తద్వారా అందరికీ బోధించిన ఏకాదశవ్రతాలు. శ్రీ రాజలింగంగారు ఒక విధంగా వీటిని ఒక విషయసూచికగా గ్రహించి ఈ వ్రతాలను గాంధీజీ ఏ విధంగా పాటించేవారో, ఇతరులచేత ఏ విధంగా పాటింపచేసేవారో అనేకమైన ఉదాహరణలతో ఈ గ్రంథంలో విశదీకరించారు. అందుచేతనే ఇది మానవ ధర్మ చరిత్ర అయింది. ఈ వ్రతాలు అన్ని కాలాలలోను, అన్ని దేశాలలోను ఆచరించవలసిన వ్రతాలు, శాంతి సౌఖ్యాలను నెలకొల్పే వ్రతాలు. ఈ వ్రతాలను ఆచరించడం చేతనే గాంధీజీ మహాత్ముడైనాడు. నైతికంగా తనతో సమానమైన ఔన్నత్యంగల ఎంతోమందిని తయారుచేశారు. అలాంటి వారిలో శ్రీ రాజలింగంగారు ఒకరు.

రాజకీయాలలో, రాజకీయ నాయకులలో అవినీతి చాలా ప్రబలిపోయింది అని ఆక్షేపించడం ఈనాడు ఒక అలవాటయింది. ఒక ఫేషన్ అయింది. అయితే రాజకీయాలలో అవినీతి చోటుచేసికొనడం సత్యం అయితే అవవచ్చును కాని, అది రాజకీయలకు మాత్రమే పరిమితంగా లేదు. అవినీతి ప్రళయతాండవంచేయని, అశాంతిని వృద్ధి పొందించని స్థానం ఈనాడు భారతదేశంలోనే కాదు, ఏ దేశంలోనూ కూడా లేదు. అందరి అధికారాలను, ప్రతీవృత్తిలోను,

ప్రతీ జీవన విధానంలోను ఈ అవినీతి ప్రబలి ఉన్నపుడు తామేమో ధర్మమూర్తులం అన్నట్లు రాజకీయాలను రాజకీయనాయకులను మాత్రమే దూషించడం ఆత్మ వంచనం అవుతుంది. ఇట్టి స్థితి మారాలంటే మానవధర్మ ప్రచారం ఒక్కటే మార్గం. అలాంటి గ్రంథాలను ప్రతీ ఒక్కరూ చదివితే, గాంధీ మహాత్ముడు నెలకొల్పిన ఉన్నత ధర్మాలను కొంతవరకైనా ఆచరించడానికి ప్రతి ఒక్కరూ ప్రయత్నిస్తే సమాజం తనంతట తానే శాంతి సౌఖ్య ప్రదమైన మార్గంలో నడుస్తుంది. ఈ నైతిక పతనానికి కారణం నువ్వంటే నువ్వని ఒకరినొకరు తప్పు పట్టడానికి అవకాశం ఉండదు. ఇలాంటి అత్యుత్తమ గ్రంథాన్ని, స్వానుభూతితో ద్విగుణీకృత ప్రభావంగల గ్రంథాన్ని ఆంధ్రలోకానికి అందించిన శ్రీ రాజలింగం గారు సర్వధా తెలుగువారి కృతజ్ఞతకు పాత్రులు.

డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు

నందనం
7-1-324/పి - 2,
లీలానగర్, బేగంపేట
హైదరాబాదు - 500 016.
ఫోన్ : 291200

DANDU SIVARAM RAJU
MINISTER FOR ENDOWMENTS



HYDERABAD

DATE........

శ్రీ రాజలింగం గారికి,

మీరు వృద్ధాప్యదశలో వుండికూడా ఎంతో శ్రమ తీసుకుని గాంధేయ సిద్ధాంతములపై, పూజ్య బాపుపై మీకుగల శ్రద్ధాభక్తులతో వ్రాసిన 'బాపు - నేను' గ్రంథాన్ని ఎంతో శ్రద్ధతో చదివాను. కాదు, ఆ పుస్తకమే నన్ను చదివించేలా చేసినది.

మీ అనుభవాలను వినుటకు చెవిలకింపుగా సులభశైలిలో ప్రతి ఒక్కరికి అర్థమయ్యేలా వ్రాయబడిన ఈ పుస్తకం ఒక అమూల్య గ్రంథమని చెప్పవచ్చు. మీకు సేవాగ్రాంలోని ఆశ్రమంలో మహాత్మాగాంధీగారితో పరిచర్యం ఏర్పడుటయేగాక, అక్కడి అనుభవాలూ, అనుభూతులను ఈ పుస్తకంలో పొందుపరచి అది చదివినవారు విజ్ఞానవంతులయ్యేలా చేశారు. భారతీయ సంస్కృతి విలువలూ, సత్య అహింసలూ, ఏకాదశ సూత్రముల ద్వారా విద్యార్థులకూ, యువతకూ మీరందించదలచిన సందేశం చేరాలని నేను మనసార ఆకాంక్షిస్తున్నాను.

ఈ పుస్తకం చదివిన ప్రతి ఒక్కరిలో ఆలోచననూ, స్ఫూర్తినీ, చైతన్యమును కలిగించగలదని నమ్మకం కలిగింది. సమాజంలో దిగజారుతున్న మానవ విలువలను తిరిగి సంపాదించుకొనటమేగాక అధికారం, పదవీ వ్యామోహంలో మునకలు వేస్తున్న అవకాశ రాజకీయ వాదులకు మంచి సందేశంను మీ నిస్వార్థ సేవ, త్యాగంవల్ల తెలివిడికాగలదనే విశ్వాసం ఈ పుస్తకం ద్వారా ఏర్పడినది.

కృతజ్ఞతలతో,

భవదీయ

(దండు శివరామరాజు)

# ఉత్కంఠభరిత గ్రంథం

మీరు నాకు పంపించిన బాపు–నేను అనే గ్రంథ ప్రతిని చదివినాను. నా మీద వున్న అనిమానానికి కృతజ్ఞతలు.

మీరు వ్రాసిన గ్రంథంలోని ప్రతీ సంఘటన ఉత్కంఠభరితంగా వుంది. మహాత్ముడు, మహాత్ముని దగ్గర పనిచేసినవారు ఎంతటి త్యాగధనులో ఈ సంఘటనలు వ్యక్తీకరిస్తున్నాయి. చక్కటి శైలితో, అమూల్యమైన సమాచారంతో పుస్తకాన్ని తీర్చిదిద్దినందుకు ఈతరం, వచ్చే తరాలు మీకు ఎంతో రుణపడి వుంటాయి. మహాత్ముని గురించి ఇప్పటివరకూ భారత దేశంలోని వివిధ భాషల్లో వెలువడిన మంచి పుస్తకాల్లో ఇదొకటి. నేను ఆకాశవాణిలో ప్రోగ్రామ్ ఎక్సిక్యూటివ్‌గా వున్నప్పుడు గాంధీమార్గం కార్యక్రమాన్ని దాదాపు ఐదారు సంవత్సరాలు నిర్వహించాను. ఆ సందర్భంలో గాంధీగారు వ్రాసిన పుస్తకాలను, వారి గురించి అనేకమంది ప్రముఖులు వ్రాసిన గ్రంథాలను చదవడం తటస్థించింది.

ఆ గ్రంథాలలో లేని అనేక కొత్త విషయాలు బాపూ జీవితానికి, ఆలోచనా విధానానికి సంబంధించినవి మీరు వ్రాసిన, బాపు–నేను పుస్తకంలో వున్నాయి. మహాత్ముడితో అతి సన్నిహితంగా వుండే అవకాశం, అదృష్టం మీకూ, మీ పుస్తకం ద్వారా ఆ మహనీయుని సందేశాత్మక జీవితాన్ని దర్శించే అదృష్టం మాకు కలిగినందుకు ఎంతో ఆనందంగా వుంది. ఈ పుస్తకం ఒక రకంగా మీ జీవితచరిత్ర అనే చెప్పాలి. బాపు వారసులుగా మీరు చేసిన ఈ ప్రయత్నం స్వాతంత్ర్య సమరయోధులుగా మీ ఔన్నత్యాన్ని మరోమారు చాటి చెప్పింది.

డా. పాలకుర్తి మధుసూధనరావు.
హైదరాబాద్. దూరదర్శన్ కేంద్రం.

# ఏకలవ్య దృష్టి

మహాభారతంలో ఏకాగ్రతతో సాధించిన అస్త్రవిద్యను గురుహోలికహోసం ఆ విద్యకే ఆధారమైన బొటనవ్రేలును అర్పించిన సాధకుడు ఏకలవ్యుడు. నేటి భారతంలో తను గాంధీజీ స్ఫూర్తితో నిండు తపస్సు తో సాధించిన జ్ఞానసంభావాన్ని నిర్మాణ కార్యం కోసమే వెచ్చించి ఫలితాన్ని తన గురువైప గాంధీజీకే వదిలిన వినయశీలి ఈ రచయిత. అందుకే ఈ రయుచన ఆయన త్యాగాలకు, అనుపమ ధైర్యానికి ప్రతీకయేకాక నాటి సామాజిక న్యాయం, రాజకీయ సంస్కృతులకు దర్పణంగా అగుపిస్తున్నది.

ఆయన ఓరుగల్లు సామ్రాజ్యాన్ని అమితంగా ప్రేమించిన తండ్రిని, అప్పుడప్పుడే నీడయైన భార్యని వదిలి స్వాతంత్ర్యస్ఫూర్తి కోసం బాపూ సన్నిధికి నిరాడంబరంగా సాగిన ఆయన ప్రయాణం, జ్ఞానసుధకోసం సామ్రాజ్యాన్ని, శుద్ధోదన సార్వభౌముని నీడలా నిలచిన యశోధన వదిలి నడిరేయి నిష్క్రమించిన తథాగతుని నిష్క్రమణం గుర్తుకు వస్తుంది.

ఈ పుస్తకంలో మనకు చరిత్రలో కనిపించని కొన్ని కమనీయ దృశ్యాలు కనిపిస్తాయి. నెహ్రూయే తొలి సత్యా గ్రహిఅని భావించి కస్తూరిబా పాయసాన్ని తినిపించింది. కాని నిగంతర సేవాపరాయణుడు, నిరాడంబరి వినోబాజీకి లభించింది ఆ అదృష్టం. కురుక్షేత్ర సంగ్రామంలో రారాజు లెందరో వుండగా నిరంతరం కురు సామ్రాజ్య ఉన్నతి కోసం తపించిన భీష్మునికీ, సర్వ సేనాధిపత్యం లభించినట్లు. ఇది బాపూ విజ్ఞత ఎందరికి తెలుసు ఈ ధర్మసూక్ష్మం. అలాగే భారతయుద్ధం తరువాత నీతి ఈ భూమిపై ఎంతవరకు అన్వయింపబడిందో తెలియదు కాని, తన సిద్ధాంతభాగాన్ని తన దగ్గర నేర్చుకొని తన ముందే గాంధీజీ ఆశ్రమంలో అమలుజరపబడితే అమిత ఆనందాన్ని పొందాడట.

త్రేతాయుగంలో తన అన్న భార్య గడపదాట కూడదని లక్ష్మణ రేఖ గీసాడు, అది దాటి ఆ తల్లి అష్టకష్టాలు పడింది. తన భార్యకు ఆశ్రమ ప్రవేశం అడిగితే తిరస్కరించబడ్డ సంఘటన రామాయణం లోని ఘట్టాన్ని సూచిస్తున్నది. నాడు ధృవుడు తపస్సుకు వెళుతున్నపుడుడు ఆయన తల్లి, ఆత్మీయులు, పడ్డ క్షోభ కు తలవొగ్గి తను కల్పపట్టి లక్ష్మణ రేఖదాటి సీతలా పరిధి దాటక రాజలింగంగారితో కష్టాలు పడ్డాడు. రాజలింగంగారు ఆశ్రమాన్ని వదిలి వెళ్ళుతున్నప్పుడు కస్తూరిబా, మిగతా ఆశ్రమంలోని ఆత్మీయుల మనోక్షోభ గోచరించింది.

ఈ గ్రంథం రాజలింగంగారి రచనా శిల్పం, రాజకీయ పరిపక్వత, నైతిక విలువలు, రాజకీయ చదరంగంలో యితరులు వేసిన పాచికలు ఈ అక్షరాల మధ్య కన్పిస్తాయి.

అమ్మ తినిపించే గోరుముద్దల వంటి ఈ రచనా పలుకులు తినే వారికి తృప్తిని, శాంతి యివ్వాలని ఆకాంక్షస్తూ,

1-1-336/16,
చిక్కడపల్లి,
హైదరాబాద్-20.
Tele: 7636980

కె. యశోధర

# ఆప్త బంధువు - మాకు భీష్ముడు

రాజలింగంగారు ఎందరికో ఆప్త బంధువు

శ్రీ ఎం.ఎస్. రాజలింగంగారు కురువృద్ధులు. గాంధీ పరిచయాలను గాంధీతో అనుభవాలను పునాదిగా వేసుకుని ఈనాటి రాజకీయాలకు అంటీ అంటనంత దూరంగా ఉంటున్న భీష్ముడు. ఒకనాటి మంత్రినన్న అహంభావం పొడ సోపకుండా మామూలు మనిషిగా నిశ్చింతగా ముందడుగు వేస్తున్న మంచి వ్యక్తి. మెడిసిటీ ఇంటెన్సివ్ కేర్ యూనిట్‌లో ఉంటూ తన పుస్తక రచన గురించి ఆలోచిస్తూ అందులో నన్ను గుర్తు చేసుకోవడం నా సుకృతంగా భావిస్తున్నాను. బావు-నేను అనే చాలా సూటిగా, తేటలా దూసుకుపోయే పేరుతో ఆయన పుస్తకం రాయడానికి మా నాన్నగారు, తెలుగు పత్రికా రంగంగో స్వేచ్ఛా సమరశీలి జిల్లా స్థాయి దిన పత్రికలకు ఆద్యుడనదగిన సంపాదకుడు.కీర్తి శేషులు శ్రీ యం.ఎస్. ఆచార్య ప్రేరణ ఉందని, నాన్నగారితో పాటు కీర్తిశేషులు, ఆయన సహచర జర్నలిస్ట్ అయిన శ్రీ చి. నాగేశ్వరరావు తదితర మిత్రులను రాజలింగంగారు గుర్తు తెచ్చుకున్నారు.

రాజలింగంగారు ఒక ఆప్తబంధువు. ఎందరికో ఆత్మబంధువు. మా నాన్నగారు ఎంతో గౌరవంతో స్ఫురణకు తెచ్చుకున్న వ్యక్తులలో రాజలింగంగారు ముఖ్యులు. నాన్నగారికి రాజలింగంగారికి ఉన్న ఆత్మీయత మాటల్లో చెప్పలేనిది. నేను అసలే చెప్పలేను. నాన్న జీవిత కాలమంతా నడిపిన జనధర్మ వారపత్రికతో ఆయనకున్న అనుబంధం అంతకన్నా సన్నిహితమయింది. నాన్నగారు పరమపదించి అయిదేళ్ళయినా, ఆయనలో నాన్నగారి జ్ఞాపకాలు దొంతరలు కదలడం, అప్పుడు నన్ను అక్కున చేర్చి ఓదార్చి కురిపించిన ఆదరాభిమానాలు ఈ అభిప్రాయం అడగడం ద్వారా మళ్ళీ కురిపించడం నిజంగా మరువరాని అనుభూతులు. అంతటి విశాల హృదయం, మంచి మనసు ఉన్న మనిషి మనకు మళ్ళీ దొరకరు.

ఆంధ్రపత్రిక పేరెన్నికగన్న పత్రిక. ఆ పత్రిక సంపాదకుడు శంభుప్రసాద్‌కు రాజలింగంగారు సన్నిహితులు. నాన్న జర్నలిజం కలం ధగధగలు తెలంగాణా శ్రేయస్సుకు అంకితం కావడానికి జనధర్మ పత్రిక వెనుకబడిన తెలంగాణా అభివృద్ధి నినాదంగా ప్రతిధ్వనించడానికి పునాది - నాన్న ఆంధ్ర పత్రిక విలేఖరిగా ఉద్యోగం చేయడం. అందుకు శ్రీ రాజలింగంగారి చేయూత మరువరాని మరో మధుర స్మృతి. నాన్నకు వృత్తిపరంగా, వ్యక్తిపరంగా చేరువై, ఆదరువై, ఆదరణీయుడై అభిమానించిన రాజలింగంగారు తన అనుభవాలు ఎవరితో పంచుకున్నా, ఎవరి జ్ఞాపకాలను గుర్తు చేసుకున్నా అవి చదవ దగినవే, వినతగినవే. ఎందుకంటే ఏవీ వ్యక్తిగతమైనవి కాదు. దేనికీ స్వార్థం లేదు. అన్నీ పరోపకారం కోసం, సమాజం కోసం, మరొకరి కోసం. స్వప్రయోజనం అంటే ఏమిటో ఆయనకు తెలియదు. అంతటి సమున్నతుడు గాంధీతో కలిగిన జ్ఞాపకాలు, సంఘటనలు గుర్తు తెచ్చుకుంటే అంతకన్నా కావలసినదేముంది. గాంధీగురించి చదవడం వినడమేగాని చూడలేని నావంటి వారికి రాజలింగంగారి కళ్ళద్వారా చూసుకునే అవకాశం కలిగించే ఈ పుస్తకం విలువ ఎంత అని చెప్పాలి?

- మాడభూషి శ్రీధర్,

అసోసియేట్ ప్రొఫెసర్, నల్సార్ లా యూనివర్సిటీ

ప్లాటు నెం. 23, బ్లాకు నెం.2,

బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్.

# నూలు పోగు

ఒకరయినా నీ కేకకు
ఓ యని రాకున్నా
ఒక్కడవే బయలుదేరు !
ఒక్కడవే బయలుదేరు !
ఒక్కడవే ఒక్కడవే
ఒక్కడవే బయలుదేరు !!

అంటూ పదిమంది మెచ్చినా, నచ్చినా లెక్కించక కర్తవ్యాన్ని పాలించి తీరాలనే ప్రబోధించే ఏక్లాచలోరే అనే విశ్వకవి రవీంద్రుని ప్రసిద్ధగీతాన్ని గాంధీ మహాత్ముడు మార్గదర్శకంగా తీసుకొని, హితులు వలదని వారించినా వినక నౌఖాలిలో హింసోన్మత వాతావరణంలో పర్యటించి శాంతిసామరస్యాలు సాధించారు.

మాజీమంత్రి, మాన్యశ్రీ ఎం.ఎస్. రాజలింగంగారు గాంధేయమార్గానుగామి. బంధుమిత్రులు వారించినా వినక ప్రభుత్వ న్యాయవాది పదవి ప్రక్కనపెట్టి, 1977 దివిసీమ ఉప్పెన – తుఫాను బాధితుల సేవకు నడుం కట్టారు. పూజ్య ప్రభాకర్‌జీ. మా నాన్న స్వర్గీయ మండలి వెంకటకృష్ణారావుగార్లతో కలసి సహాతు, పునరావాస, పునర్నిర్మాణ కార్యక్రమాలు నిర్వహించారు. తన స్వపక్షలాన్ని, తన కుటుంబాన్ని మరచి నెలల తరబడి బాధిత ప్రజానీకం మధ్య గడిపి వారికి స్వాంతన చేకూర్చారు. కష్మనమోలు గ్రామాన్ని ఖాదీ కమీషన్ సహాయంతో పునర్నిర్మింపజేసి, గాంధీగ్రామ్ అని పేరెట్టి బాపూజీ పట్ల తనకున్న భక్తిప్రపత్తులు చాటుకున్నారు.

ప్రతి నేత్రం నుంచి జారే బాష్పకణాన్ని తుడవడం తన జీవితాశయమని మహాత్ముడు చెప్పారు. నిజమైన గాంధేయవాది అయిన రాజలింగంగారు అదేబాటలో ఆర్తజన సేవచేశారు.

ఏకాలంలో నైనా ప్రబుద్ధ మనస్కులైన మహనీయులు ప్రపంచంలో అరుదుగా ఉంటారని, వారి పరిచయం అమూల్యమైన అనుభవమని ష్లీటో పేర్కొన్నారు.

అట్టి అమూల్యానుభవాన్ని గాంధీ మహాత్ముని ద్వారా రాజలింగం గారు పొందారు. ఆ అనుభవసారమే రాజలింగంగారు రచించిన బాపూ-నేను. గాంధేయ జీవన దృక్పథాన్ని అర్థం చేసుకోవడానికి ఆయన జీవితం - బోధ రెండూ తోడ్పడతాయి. ఆ రెంటినీ గ్రంథస్తం చేసి మన కందించారు రాజలింగంగారు. ఈ గ్రంథమొక అమృత భాండం.

గాంధీజీని చూచే అదృష్టం దక్కని తరానికి చెందిన వాడినైన నాకు గాంధీగారి శిష్యులు రాజలింగంగారి ప్రేమాభిమానాలు పొందే అదృష్టం లభించింది. దివిసీమలో ఉన్న రెండేళ్లు వారు నన్ను తన బిడ్డగా భావించి ఎన్నో మంచి విషయాలు బోధించారు. వారిది సునిశిత పరిశీలన దృష్టి. ప్రతి విషయాన్ని విమర్శనాత్మకంగా చూడటం, మంచి-చెడూ తర్కించి నిర్ణయాలు తీసుకునేవారు. నాకు ఒకరకంగా వారు గురుతుల్యులు. వారి ప్రభావం నాపై ఎంతో పడింది.

విద్యావివేక సంపన్నుడు, జాతీయవాది, నిష్కళంక దేశభక్తులు అయిన యం.ఎస్. రాజలింగంగారికి భగవంతుడు సంపూర్ణ ఆయురారోగ్యాన్నిచ్చి చుక్కాని లేని నావ లా ఉన్న మా తరానికి మార్గదర్శకులుగ ఉంచాలని ప్రార్థిస్తున్నాను.

గాంధీ క్షేత్రం
అవనిగడ్డ
కృష్ణా జిల్లా.

మండలి బుద్ధ ప్రసాద్.
ఎం.ఎల్.ఏ.

# పరిశోధనకే చుక్కాని

బాపు నేను ఎంత చక్కటి పేరు. ఆ పేరు చూడగానే ఆ గ్రంధాన్ని చదవాలనిపిస్తుంది. మొదలు పెట్టాను. ఒక్కో పేజీ ఒక్కో అనుభూతి. పూర్తి అయ్యేదాకా వేరే ధ్యాస లేదు. అప్పుడే అయిపోయిందా అనిపించింది. రాజలింగంగారు ధన్యజీవి. ఆనాటి దేశభక్తి, నిస్వార్థ ప్రజాసేవ, నీతి, నిజాయితీ, ధైర్యం, ఆర్థిక, రాజకీయ, సామాజిక, ప్రాంతీయ పరిస్థితులను ఆయన వివరించిన తీరు అమోఘం. ఆయనలో ఒక పరిశోధకుడు కూడా వున్నాడనడానికి నిదర్శనం ఈ గ్రంథం. అసలు గాంధీజీ, వినోబాగార్లను ప్రత్యక్షంగా చూడలేదన్నాను కాని రాజలింగంగారిని చూస్తే, గాంధీజీని చూసినట్లే వుంటుంది నాకు. నిజం. రాజలింగంగారితో పరిచయం ఓ అదృష్టం నాకు. అది 1997, భారత స్వాతంత్ర్య స్వర్ణోత్సవాలను ఘనంగా నిర్వహించాలని, ఆ సందర్భంగా ఓ 50 మంది స్వాతంత్ర్య సమరయోధులను సన్మానించుకోవాలని, సమైక్యభారతి నిర్ణయించడం జరిగింది. ఆసంస్థ ప్రత్యేక సలహాదారులు శ్రీ కె.వి.రమణ, ఐ.ఎ.ఎస్. గారు నాతో శ్రీ యం.ఎస్. రాజలింగంగారని వున్నారు. వారు సహకరిస్తే ఈ కార్యక్రమాన్ని చేయగలం. వెళ్ళి వారిని కలువు అన్నారు. మార్చి 1997లో వారిని కలిసాను. ఆ తరువాత ఎన్నోసార్లు కలిసాను, కలుస్తూనే వున్నాను. వారితో కలిసిన ప్రతిసారీ కొత్త కొత్త విషయాలు తెలుసుకొనే అదృష్టం నాకు కలుగుతుంది. వారి సాంగత్యఫలితమే జూన్-20, 1997 నాడు యాభై మంది స్వాతంత్ర్య సమరయోధులకు, దంపతులతో సహా, రాష్ట్రం నలుమూలల నుండి రప్పించి రవీంద్ర భారతిలో పెద్దల సమక్షంలో సన్మానించుకొనే అదృష్టం కలిగింది.

శ్రీ రాజలింగంగారి పరిచయంతో నాకు తెలిసింది ఒక్కటే. స్వార్థం కంటే బాధ్యత గొప్పది. బాధ్యతను విస్మరిస్తే స్వార్థపరుడు కూడా పైకిరాలేడు అని. వారు వ్రాసిన ఈ గ్రంథం ప్రతి ఇంటా, ప్రతి లైబ్రరీలో వుండవలసిందే. ముఖ్యంగా నేటి యువతకు ఇది ఎంతో అవసరం. అంతేకాక గాంధేయ తత్వ పరిశోధనకు ఒక దిక్సూచి. శ్రీ రాజలింగంగారు మరిన్ని గ్రంథాలు వ్రాయాలని, వారికి ఆ దేవుడు వయస్సును, శక్తిని ఇవ్వాలని ప్రార్థిస్తూ,

జి. సత్యనారాయణ
ఫౌండర్ సెక్రటరీ
సమైక్యభారతి.

నెం.22-74/1, సరస్వతీనగర్ కాలనీ,
దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్-60. ఫోన్: 4043828

మాన్యులు గాంధీ సేవాశ్రమ నివాసి, గాంధేయవాది
శ్రీయం. యస్. రాజలింగంగారు బాపు-నేను గ్రంథాన్ని ప్రచురిస్తున్న సందర్భాన

# ప్రశంశాగ్రంథం

పూవు పుట్టగనే తావియబ్బిన రీతి,
బాల్యమందె, దేశ భక్తి నిన్ను
ఆవహించెనయ్య, అర్పించినావు నీ
జీవితమ్ము దేశ సేవకొరకు.

పిట్టలు పట్టువానివలె వేషము గట్టి, నిజాము రాజ్యముం
గుట్టుగ దాటి, దాస్యమున గ్రుంగి తపించెడు భారతాంబ, యి
క్కట్టులు తీర్ప దీక్షగొని, గాంధి మహాత్ముని ఆశ్రమాన, కాల్
పెట్టిన నీదు సాహసము, వారగుణంబు, ప్రశంస నీయముల్

కత్తి చేపట్టక, నెత్తురు చిందక, స్వాతంత్ర్య సమరమ్ము సలిపెనెవడు,
రవిక్రుంకనట్టి సామ్రాజ్యమ్మునేలు ఆంగ్లేయుల నెదిరించి గెలిచెనెవడు,
పల్లెలాయువు పట్లు భరత జాతికటంచు, దేశ సౌభాగ్యము తీర్చెనెవడు,
జాతి మతాతీత సౌభ్రాత్ర సౌహార్ద పరిమళమ్ములు భువిన్ పరిచెనెవడు,
అట్టి మహనీయుడైన మహాత్మగాంధి పాదసన్నిధి, పెక్కేండ్లు బ్రదుకు గడపి
మాతృ భూమిని గొలిచిన మాన్యుడీవు రాజలింగమ! నీకు నా ప్రణతులివియే

బాపు-నేను పేర బాపూజి పావన స్మృతుల నొక్క చోట జేర్చినావు,
సర్వ జనులు వాని జదివి, సన్మార్గాన నడవవలయు, శుభము బడయవలయు.

పదవులెక్కినావు, ప్రభుత నడిపినావు, మంచి చెడుల ననుభవించినావు
నీతి నియతిలేని నేటి నాయకులకు గాంధి సూత్రములను గరపుమయ్య!

డా. ఉండేల్ల మాలకొండా రెడ్డి
B.E., M.Sc.(Struct.Engg.), Ph.D.(Edinburgh)
F.E.(India) MIHS (USA)
Balasaraswathi, Kavikireeti

8-2-693/2/26&27, Mithila Nagar
Behind C.R.P., R.No.12, Banjara Hills
Hyderabad - 500 034.
Ph: (O) 7633300, 3237644; (R) 3399188

# దొడ్డ మనసు

కొన్ని సంవత్సరాల పాటు సాగిన మనదేశ స్వాతంత్ర్య సమరంలో ఆసేతు హిమాచలం లెక్కకు మించిన దేశభక్తులు పాల్గొన్నారు. వారంతా స్వాతంత్ర్య సమరయోధులుగా దేశ ప్రజల నుండి గౌరవాభిమానాలని అందుకుంటున్నారు. ఆనాడు వారు చేసిన త్యాగాలూ, అనుభవించిన శిక్షలూ ఈ తరంవారు రాబోవు తరాల వారూ మనదేశ స్వాతంత్ర్యోద్యమ చరిత్రగా చదువుకుంటారు. అయితే ఆ ఉద్యమంలో స్వయంగా పాల్గొన్న ఒక దేశ భక్తుని నోటంట వారి అనుభవాలూ, జ్ఞాపకాలూ వినటం, చదవటం ఒకలాంటి థ్రిల్‌ని, ఒక చిత్రమైన అనుభూతిని కలిగిస్తుంది. శ్రీ యం.యస్.రాజలింగం అనుభవాలని గురించి చదివితే పాఠకులకి కొన్ని కొత్త విషయాలు కూడా తెలుస్తాయని నేననుకుంటున్నాను.

శ్రీ రాజలింగంగారిని నేను ఒక్కసారే కలుసుకున్నాను. స్వాతంత్ర్యోద్యమ చరిత్ర నేపథ్యంగా నేను వ్రాసిన శుభోదయం నవల వారికివ్వటానికి వెళ్ళాను. ఆ స్వల్ప పరిచయంతోనే వారు తమ పుస్తకం గురించి అభిప్రాయం అడగటం వారి దొడ్డ మనసుకి ఒక తార్కాణం.

పెద్దలూ, స్వాతంత్ర్య సమరయోధులూ శ్రీ యం.యస్.రాజలింగ్‌గారికి నా కృతజ్ఞతాభి వందనాలు.

- ఉన్నవ విజయలక్ష్మి

23/4, ఎల్.ఐ.జి.హెచ్., బరకత్‌పుర,
హైదరాబాద్ - 500 027.

# అనుభవ సూత్రాలు.

శ్రీ రాజలింగంగారికి

నమస్కారములు.
అత్యంత అనురాగంతో మీరు పంపిన మీ గ్రంథం బాపు–నేను అందుకున్నాను. ఆమూలాగ్రం చదివాను.

ఈ గ్రంథాన్ని చదువుతూంటే, నేను స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్న సంఘటలను ఆనాటి నా హితులు, సన్నిహితులు జ్ఞప్తికి వచ్చారు. మనస్సు పులకరించింది.

కాలం మారలేదు. విలువలే మారాయి. మహాత్మాగాంధీ ప్రవచించిన సిద్ధాంతాలు - అహింస, సత్యం కనుమరుగవుతున్నాయన్న తరుణంలో, మీ గ్రంథం, నేటి తరానికే కాక, రాబోవు తరాలకు కూడా మిక్కిలి ఉపయోగపడుతుందని, గాంధేయ అనుభవ సూత్రాలు, ఆచరణ విధానాలు భారతీయుల జీవితాలలో వెలుగు నింపుటకు మీ గ్రంథం ఉపకరిస్తుందని ఆశిస్తూ, ఈ గ్రంథం అందించుటలో మీ విశేష కృషికి ఆనందిస్తున్నాను. మనసారా మిమ్మలను అభినందిస్తున్నాను.

బాదం రామస్వామి

బి.ఆర్.అసోసియేట్ బిల్డింగు
6–1–1081, లకడీ–కా–పూల్
ఖైరతాబాద్, హైదరాబాద్ – 4.

# పూర్ణ పురుషుడు

## శ్రీ ఎం. ఎస్. రాజలింగం

స్వాతంత్ర్యోద్యమంలో ఆంధ్రుల పాత్ర గణనీయం. ఉద్యమాలను గురించీ, జాతీయ నాయకులను గురించీ గతంలో చాలా గ్రంథాలు వచ్చాయి. అందునా జాతిపిత గాంధీ చరిత్రను వ్రాసిన వారెందరో ఉన్నారు. సమస్త విశ్వంచేత కీర్తింపబడిన శాంతికాముడు, అహింసావాది, స్వచ్ఛ జీవనుడు గాంధీ! ఆయనచే ప్రభావితులైన వ్యక్తులెందరో! ఆయనతో విభేధించిన వ్యక్తులూ లేకపోలేదు. ఏమైనా గాంధీజీ జీవితాన్ని ఆదర్శంగా తీసుకొని పయనిస్తున్న వాళ్ళు ఈనాటికీ కొంతమంది సజీవులై సంపూర్ణాయురారోగ్యాలతో వుండడం విశేషం. అటువంటి వారి సేవలు అవసరం గూడా. నిన్న మొన్నటి వరకూ జీవించియున్న తల్లాప్రెగడ ప్రకాశరాయుడి గారిని నేనెరుగుదును. అదే కోవకు చెందిన శ్రీ ఎం.ఎస్. రాజలింగంగారిని చూస్తున్నాను.

"బాపు–నేను" అనే ఈ గ్రంథంలో రాజలింగంగారు తన జీవితంలో గాంధీజీతో తనకున్న సాహచర్యం ఎటువంటిదో కన్నులకు గట్టినట్లు చిత్రించారు. ఈ పుస్తకం చదువుతుంటే జాతిపిత ఆదర్శాలు, జీవన సరళి ఆశ్చర్యాన్నీ, ఆనందాన్నీ రేకెత్తిస్తాయి. గాంధీగారి తోటి పలు సందర్భాలలో ప్రముఖులైన మహామహులు ఎలా మాట్లాడారో, ఆమాటలకు గాంధీగారి అనుయాయులుగా వారెలా మారిపోయారో, ఇవన్నీ చదివితే ఈతరంవారికి కొంచెం అనుమానం రావచ్చును. కానీ, అవన్నీ యథార్థాలే అని తేలికగా గ్రహిస్తారు. ఈ గ్రంథం మహాత్ముడేగాక వినోబా, ప్రభాకర్‌జీ, బన్సాలీకాక మొదలైన వారిని గూర్చి చదువుతున్నప్పుడు గొప్ప ఆనందం, సంతృప్తి మనకు కలుగుతుంది. పంక్చుయాలిటీ, కాకాజీ వద్ద నేర్చుకోండీ అని గాంధీయే స్వయంగా అన్నాడంటే, అతనెంత గొప్ప వ్యక్తి అయి వుంటాడో మనం ఊహించుకోవచ్చు.

ఈ గ్రంథంలో అన్నిటికంటే ఆశ్చర్యమేమిటంటే, *"He is a fire to the Institution, Don't admit into Ashram"* అని అభియోగం పొందిన రాజలింగంగారు సంపూర్ణమైన గాంధేయవాదిగా జీవితాంతం పయనిస్తూ ఉండడం, తన జీవిత ఘట్టాలన్నీ ఇంతగా గుర్తు పెటుకుని ఈ తరానికి అందించడం చాలా ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.

ఈ గ్రంథం చదవడం వలన ముఖ్యంగా యువతరానికి గొప్ప కనువిప్పు కలుగుతుందని నా అభిప్రాయం. ఈనాటి రాజకీయ నాయకుల కందరికీ యిది ఒక్కొక్క అధ్యాయం చొప్పున చదివి వినిపించినట్లయితే ఎలా వుంటుందో అని నా మనస్సు ఎందుకో ప్రశ్నిస్తున్నది. నిజంగా రాజలింగంగారు పొందిన స్ఫూర్తి, అనుభూతీ, అనుభవమూ మనకందరికీ వారసత్వంగా మిగిల్చారనుకుంటాను. గ్రంథం చాలా తేలిక భాషలో వ్రాయబడింది. బాపూ దహన సంస్కారాలకు రాజలింగంగారు వెళ్ళలేకపోవడం, పరిస్థితులు అనుకూలించక పోవడం చదువువరులమైన మనకే ఒకబాధను కలుగజేస్తుంది. ఏమైనా ఒకమంచి గ్రంథాన్ని అందించిన రాజలింగంగారిని అభినందించడం విధిగా భావిస్తున్నాను. ఇటువంటి పుస్తకం అందించిన రాజలింగంగారు ధన్యులు.

1-8-702/1/1,
నల్లకుంట,                    **డా. అక్కిరాజు సుందరరామకృష్ణ.**
హైదరాబాదు - 44.                    తెలుగు లెక్చరర్.

# నిరంతర కృషి.

పూజ్యులు రాజలింగంగారికి నమస్కారం.

మీరు వ్రాసిన గ్రంథం చదివే అదృష్టం కలిగింది.

వార్ధాలోనూ, సేవాగ్రాంలోనూ మీ అనుభవాలకు అక్షర రూపంగా యీ గ్రంథం నేటి తరం ముందు నిలిచింది. పారిశ్రామిక శిక్షణకోసం వార్ధా వెళ్ళి శ్రీరామానంద తీర్థ గారి సహాయంతో గ్రామీణ విద్యాలయంలో విద్యార్థిగా చేరి, శిక్షణ పొందుచున్న సమయంలో మీ జీవితంలో గొప్ప మలుపు సంభవించి మీరు సేవాగ్రాం వెళ్ళడం, తదనంతరం అక్కడ మీరు పూజ్య బాపూజీ గారి దృష్టిలో పడడం మీ అదృష్టం. గాంధీజీ ఆశ్రమంలో గడిపిన వ్యక్తి అయిన మీతో మాట్లాడే, మిమ్మల్ని చూసే భాగ్యం కలగడం నా అదృష్టంగా భావిస్తున్నాను. ఒక ఆశయంపై సరైన ఆసక్తి, అవగాహన లేకపోతే ఆశయ సిద్ధి కలగడం చాలా కష్టసాధ్యం. కఠోర నియమాలతో, గాంధీజీ క్రమశిక్షణ నలవరచుకోడం, సేవాగ్రాం ఆశ్రమంలో మంచి వ్యక్తిగా పేరు పొందడం మీ దృఢ సంకల్పానికి ప్రతీకగా భావిస్తున్నాను. బాపూజీని అతి దగ్గరగా చూసే అవకాశము, బాపూ మనస్తత్వాన్ని అర్థం చేసుకుని మసలే అదృష్టమూ మీకు లభించాయి. మీ దస్తూరిలో వ్రాసిన ఒక స్టేట్‌మెంట్ బాపూజీ చదివే అదృష్టం మీకు కలిగింది. బాపూజీ ఆశ్రమంలో అనేకానేక అనుభవాలను గ్రంథస్థం చేయడం ద్వారా మీ వ్యక్తిత్వం, మీ క్రమశిక్షణ, మీ ఆశయ సిద్ధి నేటి తరానికే గాక భావి తరాలకు అందించి మంచి మేలు చేశారు. సేవాగ్రాంలో బాపూజీతో కలసి భజన చేయడం, Home of Lard Member గా మిమ్మల్ని కొందరు అభినందించడం మీ అదృష్టం. చిమన్‌లాల్జీ, ఆశ్రమ నియమాలకు విరుద్ధంగా ఆశ్రమంలో రాత్రంతా వుండటానికి వీలుకాదు అని చెప్పడంతో జరిగిన పరిణామక్రమంలో, తిరుగు ప్రయాణం కట్టడం కస్తూరిబా చెప్పినా వినకుండా మనసులేని చోట పనిచేయజాలమని మీరు తీసుకున్న నిర్ణయం నిజంగా సాహసోపేతమైంది. ఎవరు సహకరించినా, లేకపోయినా మీరు నమ్మిన సిద్ధాంతం కోసం నిరంతరం తపించారు. బాపూజీ బాటలో క్రమశిక్షణతో జీవితాన్ని సాగిస్తున్నారు.

ఈ గ్రంథం చదువుతుంటే మేము కూడా సేవాగ్రాంలో గడుపుచున్న అనుభూతిని కలుగు చేశారు. మీకు సదా కృతజ్ఞతలు.

వై.కె. నాగేశ్వరరావు

అధ్యక్షులు
యువ కళావాహిని.
11-4-416, చిలకలగూడ
సికింద్రాబాద్ - 500 061.

# స్ఫూర్తిదాత

శ్రీ యం. యస్. రాజలింగం గారు దేశ స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న జాతీయ కార్యకర్త. జాతీయ నాయకులు అనే పదానికి బాగా పరిచితమైన పాఠకలోకానికి జాతీయ కార్యకర్త అనడం విశేషంగా అనిపించవచ్చు. గాంధీజీ మహోద్యమ కాలం నాటికి ఆయన కార్యకర్తే, అయితే జాతీయ సమస్యలు జాతీయ భావాలు కలిగిన నిష్కళంక కార్యకర్త కాబట్టే ఆయనకు జాతీయ కార్యకర్త అనడం జరిగింది.

ఒక జాతీయ కార్యకర్తగా, నాయకత్వ పరిచయాలు కలిగిన వ్యక్తిగా శ్రీ రాజలింగంగారు ఏర్చి కూర్చిన జాతీయ, సంఘటనా, జాతీయ భావాలు పరంపరలు, నిజంగా జాతి ముత్యాల సరాలే. హింస, హింసావాదనల కాలంలో ఆయన జవసత్వాలు బాగా కలిగిన ఆవేశపూరిత కార్యకర్త అందువల్ల జలియన్ వాలాబాగ్ ఉదంతం విన్న తర్వాత తను అదే వరవడిలో .... పరకాలలో నిజాం పాలకులు జరిపిన కాల్పుల తర్వాతను హింస కూడా అవసరమన్న మార్గాన్ని అధిక్షేపించలేదు. అవసరమైన చోట తనదైన మార్గంలో స్ఫూర్తి నిచ్చారు.

అందువల్ల శ్రీ రాజలింగంగారి ఈ పుస్తకం జాతీయోద్యమ చరిత్రాంశాల ప్రాయోజిత సూచికగా అభిప్రాయ పడవచ్చు. శ్రీ రాజలింగంగారిని పరిచయం చేస్తూ శ్రీ రామానంద తీర్థగారు దామోదర్ దాసుకు వ్రాసిన లేఖలో పేర్కొన్న విధంగా ఆయన కాగితం తయారీ, అత్తరు పరిశ్రమలో తర్ఫీదుకు వెళ్ళినా, ఈ వయసు మళ్ళిన తరుణంలో జాతీయోద్యమ సుగంధాలు వెదజల్లే సంఘటనలు కాగితంపై పెట్టి గ్రంథస్తం చేయడం ఎంతో శ్లాఘనీయం. ఆయన సమకాలీనుల్లో ఒకడ్నైన నేను ఈ పుస్తకం భావితరాలకు ఉపకరిస్తుందని గట్టిగా విశ్వసిస్తున్నాను.

-కె. నరసింహారెడ్డి

అధ్యక్షులు
నేషనల్ అసెంబ్లీ ఆఫ్ ఫ్రీడమ్ ఫైటర్స్

# స్పందన

మీరు ఆదరంతో పంపిన బాపు-నేను అనే పుస్తకం అందింది. నా పరిపాలనా పరమైన పని ఒత్తిడివల్ల దీన్ని ఆమూలాగ్రం చదివే భాగ్యం కలగదేమో అనుకున్నాను. కానీ ఈ మధ్య యింట్లోనే ఉండడం వల్ల దీన్ని ఆమూలాగ్రం చదివే భాగ్యం కలిగినందుకు సంతోషిస్తున్నాను. కారణం గాంధీగారిపై నాకున్న అపారమైన గౌరవప్రపత్తులు, ప్రేమాభిమానాలు. ఈ భక్తి ప్రపత్తులతోనే నేను పూనాలో 1966-68లో దక్కను కాలేజీలో చదువుకుంటున్నప్పుడు పూర్వం బాపూ వున్న ఎరవాడ జైలును చూడ్డానికి మూడుసార్లు వెళ్లాను.

బాపు-నేను అని మీరు ప్రచురించిన ఈ పుస్తకం మహోన్నతమైన బాపూ వ్యక్తిత్వానికి ఉన్నతమైన మీ వ్యక్తిత్వానికి అద్దం పడుతుంది. మీరు మీ అనుభవాలు వివరించిన తీరుతో యీ రచన చాలా ఆసక్తికరంగా నడిచింది. చదువుతున్నంతసేపు ఆపకుండా యింకా, యింకా బాపూతో మీ అనుభవాలేమిటో, వాటి నుండి తెలుసుకోదగిన బాపూ వ్యక్తిత్వం ఏమిటో అనే ఉత్కంఠతను కలిగిస్తుంది ఈ రచన. బాపూతో మీరు పనిచేసే భాగ్యం కలగడం మీజీవితంలో గొప్ప అదృష్టం. మనల్ని జీవితంలో ప్రభావితం చేసేవి మనతో సహజీవనం చేసే మిత్రులు, ఆప్తులు, పెద్దలే కదా. ఈ అనుభవాలతో దేశ స్వాతంత్ర్యానికి, రాష్ట్రాభివృద్ధికి, మానవ విలువల పరిరక్షణకు మీరు చేసిన కృషి అపారం. మానవ విలువలు రోజు రోజుకూ దిగజారుతున్న ఈ తరుణంలో దేశానికి బాపూ సలహాలు ఎంతో అవసరం. ఇటువంటి సమయంలో తెలుగు సమాజానికి అందిస్తున్న ఈ కానుక బాపూతో మీ అనుభవాలు ప్రజల్ని, ముఖ్యంగా యువకుల్ని స్పందింపజేస్తాయని నమ్ముతున్నాను. ఈ వయసులో చాలా ఓపిగ్గా యింత మంచి పుస్తకాన్ని రచించిన మీకు సగౌరవంగా అభినందనలు తెలుపుకుంటున్నాను. దీన్ని చదివే అవకాశం నాకు కలిగించినందుకు కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.


ఎన్. శివరామమూర్తి
రిజిస్ట్రార్
తెలుగు విశ్వవిద్యాలయం.

పబ్లిక్ గార్డెన్స్
హైదరాబాద్-4.
ఫోన్: 234676

# ప్రశంస

ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు, విఖ్యాత గాంధేయవాది విశిష్ట నిర్మాణ కార్యకర్త మాజీ మంత్రివర్యులు పెద్దలు గౌరవనీయులు శ్రీ యం.ఎస్. రాజలింగంగారు రచించిన ఈ గ్రంధమును సాంతము చదివినారు.

ఈ గ్రంధములో వారి ఉన్నతమైన వ్యక్తిత్వము ప్రస్ఫుటంగా గోచరమగుచున్నధి. వారి కాలేజీ విద్యాభ్యాసము ముగించుకొని సేవా గ్రామమునకు వెళ్ళి గడిపిన ఆశ్రమ జీవన అంశములన్నియు వీరు సహజ సుందరంగాను, సులభశైలిలోను, స్వచ్ఛముగాను విశదీకరించినారు. వారు నిజముగా ధన్యజీవులు. ఆశ్రమంలో పూజ్య బాపూజీతోను, వినోబాజీతోను సరిసమానముగా కూర్చొని సహపంక్తి భోజనము చేసారు. చాలా ముఖ్యమైన చర్చలలో పాల్గొన్నారు. క్లిష్ట పరిస్థితులలో నిర్భయంగా తమ అభిప్రాయాలను వెలిబుచ్చారు. ఆత్మహననం ఎక్కడ చేయలేదు. తాను సతయము అనుకున్నది చెప్పారు, ఆచరించారు.

ఆనాటి మహోన్నతమైన వ్యక్తులు బాపూజీ రాజకీయ వారసులు పండిత జవహర్ లాల్ నెహ్రూ మేధావి రాజనీతి చతురులు అయిన రాజగోపాలాచారి, గాంధేయ ఆర్థిక శాస్త్రవేత్త జె.సి.కుమారప్ప వంటి మహనీయులతో తన యౌవ్వన జీవితాన్ని గడపటం ఎంతో అదృష్టం.

ఈ గ్రంథంలో రాసి చిన్నదైన వాసి మహోత్కృష్టమైనది మన దేశ స్వాతంత్ర్య సమరము గూర్చి సమర యోధులను గూర్చి ఎన్నో మరుగున పడిన విషయాలను శ్రీ రాజలింగంగారు యిందు పొందుపరిచారు. ఈ గ్రంథము మన స్వాతంత్ర్య సమరచరిత్రను అనుసంధానము, విశ్లేషణము చేయగోరు, రిసెర్చి స్కాలర్లకు చాలా ఉపయోగపడుతుంది.

డా. టి. వి. నారాయణ
ఫార్మర్ మెంబర్
ఎ.పి.పి.ఎస్.సి.

58, త్రి.ఆర్.టి.
పి.ఎస్.నగర్, విజయనగర్ కాలనీ,
హైదరాబాద్-57. ఫోన్: 3346388

# తపస్వి

గాంధీగారు ఎందరినో ఆకర్షించినారు. వారందరూ అదృష్టవంతులే. భరతమాతకు సేవచేసే భాగ్యం వారికి దొరికింది. తోటివారిని ప్రేమించే తత్వం వారిలో కల్గింది. త్యాగంచేయగల మనస్సును పెంచుకోగల్గినారు. అలాంటివారిలో శ్రీ యం.యస్. రాజలింగంగారు ఒకరుగానే గాక ప్రముఖంగా గుర్తింపబడి "గాంధేయవాది"గా నిలబడినారు.

ప్రతి వాఖ్యములో, శ్రీ రాజలింగంగారి చిత్తశుద్ధి, గాంధీజీ పట్ల వారి అపారమైన భక్తి మనం చవిచూడటం మన అదృష్టం. గాంధీజీ సిద్ధాంతాలను, వారి ఆలోచనలను శ్రీ రాజలింగంగారు ఆరాధనతో అధ్యయనం చేసినట్లు స్పష్టం అవుతుంది. శ్రీ రాజలింగంగారికి "శివుడు" ఎంత పూజనీయుడో, "గాంధీ" గార్ని అంతగానే చూసినారు.
"బాపు" మరియు "బా" లు శ్రీ రాజలింగంగారి జీవితంలో జీవనంలో పెనవేసుకొని పోవుట కాక, వారి వ్యక్తి వికాసమునకు అంతర్ జ్యోతులుగా వెలుగుతూనే వున్నారు.

బాపు మరియు ఏకాదశ సూత్రాలు శ్రీ రాజలింగం నడవడిలో మనకు సదా గుర్తుండమే గాక స్ఫూర్తిని యిస్తూ వుంటాయి. మనం కూడా అదృష్టవంతులమే. శ్రీ రాజలింగంగారి తపస్సు యొక్క పుణ్యాన్ని అందరికి దక్కేలా చేసారు. ధన్యులు మీరు. ప్రేమమూర్తులు మీరు. పుణ్యమూర్తులు మీరు.

పెమ్మరాజు పూర్ణచంద్రరావు

కార్యదర్శి
ఆంధ్ర మహిళాసభ ట్రస్టుబోర్డు,
హైదరాబాదు.

1988 : నేషనల్ ఫోరముఫేర్ హ్యూమన్ రిసోర్సు డెవలప్‌మెంటు మెంబరు.

1986 : విజయవాడలో రాష్ట్రపతి వెంకట్రామన్ గారిచే సన్మానం.

1988 : ఆంధ్రజ్యోతిలో తలవంచని తెలంగాణా వీరుల (ముఖవ్యాసం) అలాగే వివిధ పత్రికలలో వ్యాసాలు.

1992 : క్విట్ ఇండియా రజితోత్సవ సందర్భంలో శాసన సభలో శ్రీయుతులు కాసు బ్రహ్మానందరెడ్డి, వావిలాల గోపాలక్రిష్ణయ్య, గౌతులచ్చన్నతో పాటు అమ్మన్నరాజా, ఎన్.టి. రామారావు గారిచే సన్మానింపబడుట.

1994 : రాష్ట్రంలో మద్యనిసేధం అమలు అయిన మీదట Post Prohibition Survey గంటూరిపల్లిలో జరుపుట.

1994 : భారతీయ విద్యాభవన్‌లో గౌ॥ గవర్నరు క్రిష్ణకాంత్ గారిచే సన్మానం.

1995 : ఉస్మానియా యూనివర్సిటిలో Social Transformation సెమినారుకు అధ్యక్షత వహించుట. గవర్నర్లు శ్రీ క్రిష్ణకాంత్, రఘునాథరెడ్డిగారు ముఖ్య అతిథులుగా పాల్గొనుట.

1995 : స్వతంత్ర సంగ్రామ, సైనిక గృహ నిర్మాణ సొసైటి (రిజిష్టరు నెం. 603/95) నెలకొల్పుట.

1996 : తెలుగు విశ్వవిద్యాలయం వారిచే యం.ఎస్. జీవిత విశేషాల చిత్రీకరణ.

మార్చి 1997 : మోతీలాల్ నెహ్రూ స్మారకోపన్యాసం తెలుగు యూనివర్సిటిలో.

- ఆంధ్ర సారస్వత పరిషత్ 32వ వార్షికోత్సవానికి అధ్యక్షత వహించుట - డిసెంబరు 1997 తెలంగాణా స్వాతంత్ర సమరయోధుల. సభలో కేంద్ర హోంశాఖమంత్రి ఇంద్రజిత్ గుప్త గారిచే సన్మానం.
- 9 నవంబరు 97 రాష్ట్ర అవతరణ సందర్భంలో రాష్ట్రపతిచే సన్మానింప బడుట.

1998 : 19 సెప్టెంబరు 98 హైదరాబాదు విమోచన స్వర్ణోత్సవాల సందర్భంలో గవర్నరు శ్రీ రంగారాజన్ గారితో సన్మానింపబడుట.

1999 : కొత్తపట్నం మంతెనవారి పాలెంలో వేసంగి పాఠశాల 69 వార్సికోత్సవ ఉత్సవాలకు అధ్యక్షత వహించుట.

మీ అనుభావాలకు ఇంతకు ముందే గ్రంథరూపం ఇచ్చారు. నేను దాన్ని కూడా చదివాను. ఈ రెండు పుస్తకాల లోనూ మీ జీవన ప్రవంతిలో మీ రనుభవించిన స్వచ్ఛమైన అనుభవ శకలాలనూ క్రోడీకరించారు. ఇందులో నేను గమనించిందీ, నన్నాకర్షించిందీ ఒక్కటే. మీరు మీ సుదీర్ఘమైన జీవన పథంలో మీకు మధురానుభూతిని మిగిల్చిన ఘట్టాల్ని, ఎన్నో గుణపాఠాలు నేర్పిన ఘటనల్నీ మనసారా పునరుశ్చరణ చేసుకుని మీరు జీవించిన విధానాల్ని ప్రపంచానికి వెల్లడి చేసుకోవాలనే ఉద్వేగపూరితమైన ఆకాంక్ష, అభిలాష, ఆత్రుత. ఇది చాలా అతిసహజమైన, అర్థమైన వాంఛ. ఇందులో మీరు సఫలీకృతులయ్యారు.

జాతీయోద్యమంలో పాల్గొని, మహాత్మునికి అతి సన్నిహితంగా మెలిగి, కలిసి పనిచేసే మహదవకాశం పొందిన స్వాతంత్ర సమరయోధుల జీవితాలు చరితార్థం. ఇలాంటి జీవితాలే భావి తరాలకు ఉద్దీపనలూ, ఆశాకిరణాలు. మిమ్మల్ని చూడటం, మీతో చాలా కొద్దిసేపైనా ముచ్చటించి గడపటం, మీ జీవితంలోని అతి ముఖ్యమైన కోణాలను ఈ పుస్తకార ద్వారా ముఖ్యంగా, బాపు-నేను ద్వారా తెలుసుకోగలగటం నా అదృష్టంగా భావిస్తున్నాను. మీది నిజంగా చరితార్థమైన నిండు జీవితం. మీకు మనసారా నమస్కరిస్తున్నాను.

భవదీయుడు,

**వేంకటేశ్వరల్లు, బి.**

డిపార్టుమెంటు - పొలిటికల్ సైన్సు,

కాకతీయ యూనివర్సిటీ.

2-7-1059,

కనకదుర్గ కాలనీ,

వడ్డేపల్లి, వరంగల్ - 506370.

# ప్రయత్నసాఫల్యం

శ్రీ రాజలింగంగారు 40 సంవత్సరాలుగా నాకు పరిచితులు. భాంధవ్యం కన్నా మిత్రత్వ ప్రభావం ఎక్కువ.

'బాపు-నేను' 1-7-40 నుండి 7-7-41 వరకు కొద్ది కాలంలో, బాపు సాన్నిధ్యంలో, సేవాగ్రామ ఆశ్రమాలలో వీరికి మరువైన అనుభవాలు, వీరి రాజకీయ జీవితానికి పునాది రాళ్ళు.

మానవులందరికి వారి వారి జీవితాలలో ఎన్నో ఘటనలు అనుభవంలోకి వస్తాయి. కాని ఆ అనుభవాలను విశ్లేషించి, వాటి నుండి కొన్ని జీవిత సత్యాలను తెలుసుకొనే ప్రక్రియ అందరిలో కనపడదు. రాజలింగం గారిలోని ప్రత్యేకత అదే. తన అనుభవాలను ఎంతో జాగ్రత్తగా విశ్లేషించి కొన్ని జీవిత సూత్రాలను సిద్ధాంతీకరించ గలిగే శక్తి వీరిలో ఎక్కువ. అలా చేయగలిగినపుడే జీవితం కొందరికి ఆదర్శప్రాయంకాగలదు.

"అపరిగ్రహ సిద్ధాంతానికి ఆదర్శం కష్ట జీవితమే"

" బాహ్య భౌతిక చౌర్యాని మించింది, మానసికంగా తనది కాని దానిని ఆశించడం."

"మనసు తేల్చుకోలేని సమస్యలను కాలమే పరిష్కరిస్తుంది"

"స్త్రీ మాతృమూర్తి; సత్య అహింసలకు ప్రతీక"

"నమ్రత, వ్యక్తికి, జాతికి, తగు క్రమ శిక్షణ నేర్పు ఆయుధం",

గాంధీ గారి సహచర్యంలో గడిపిన కొద్దికాలంలో రాజలింగం గారి అనుభవాలు నేర్పిన కొన్ని జీవిత సత్యాలు యివి.

పోలీసుల బారినుండి తప్పించుకొనుటకై పిట్టలవాని వేషంలో వార్ధా వెళ్ళడం వారి జీవితంలో ఒక చక్కని మలుపైతే, తన యిల్లాలు సేవాగ్రామం చేరినపుడు చిమన్‌లాల్జీ ప్రవర్తించిన తీరు మహాశక్తివంతమైన మలుపు.

"బాపు-నేను" అనాటి గాంధిగారి ఆశ్రమ జీవితానికి అద్దంపడుతుంది. 60 సంవత్సరాల తరువాత, ఈ పుస్తకం రచించి, ఈనాటి తరానికి, అప్పటి రాజకీయ, జీవిత విలువలను గూర్చి రాజలింగం గారు తెలియ చేసే ప్రయత్నం సఫలమయినది.

శివప్రియ
1-1-419/ఇ/5/1,
గాంధినగర్, హైదరాబాదు - 20.
ఫోన్ : 7644354

యమ్. హనుమంతరావు
సీనియర్ రీజియన్ మేనేజరు
యఫ్.ఐ.సి

# విశిష్ట వ్యక్తిత్వం

1. బాపు-నేను అనే గ్రంథాన్ని శ్రీ రాజలింగం గారు, వారి జీవితంలో ఎన్నో విషయాలు తెలియచేస్తూ మన అందరిని ఆశ్చర్యచకితులు చేశారు.

2. మనుష్యత్వం, ముముక్షత్వం, మహాపురుష దర్శనం, యీ మూడు దుర్లభమని దైవానుగ్రహం ఉంటేగాని లభ్యం కావని పెద్దలు చెప్తారు. శ్రీ రాజలింగంగారువి జన్మతః శివపూజా దురంధులు. రాజకీయాల్లో వున్నా, గాంధీజీ ఆశ్రమంలో ఉన్నా శివారాధన విడిచిపెట్టినట్లు కనపడదు.

3. 1940 ప్రాంతంలో నిజాంకాలేజి చదువు పూర్తిచేసిన తరువాత, యేదో ఉద్యోగం చేసి సంసారాన్ని పోషించాలని తండ్రిగారు చెప్పినప్పటికి, ఆ మాట తిరస్కరించి, భార్యను కూడా గమనించకుండ, ఆయనలోని విప్లవకారుడు మార్గదర్శంకొరకు గాంధీజీ ఆశ్రమానికి బయలుదేరాడు. తాను ఉన్న స్థితిగతులు మారాలి, అని కోరే వారందరు విప్లవకారులే. వారికి వేరు వేరు పేర్లు ఉండవచ్చు.

4. నిజాం రాజ్యంలోని, అరాచకత్వాన్ని, అసమానతను, యెదిరించడానికి. తండ్రిగారి మాట కూడ లెక్క చేయకుండా. మారువేషం వేసుకొని నిజాం రాజ్యంలో నుండి, బయటపడి గాంధీజి ఆశ్రమం చేరుకోకలిగారు. దైవానుగ్రహం వల్ల స్వామి రామానందతీర్థ గారి దర్శనం అయింది. అయన దగ్గర ఉత్తరం తీసుకొని ఒక చిన్ని స్కాలర్‌షిప్ సంపాదించుకొని, గ్రామీణ విద్యాలయంలో శిక్షణ కొరకు చేరకలిగారు.

5. నిర్మాణాత్మక కార్యక్రమంలో నిమగ్నులైన వారు రాజకీయాలతో సంబంధం ఉంచుకోవాలా లేదా, అన్న ప్రశ్న ఆయన్ను వెంటనే ఎదుర్కొన్నది. స్వాతంత్ర్యం తరువాత కూడా ఈ సమస్య, వినోభా భావేను, జయ ప్రకాశ్ నారాయణను వేధించుకు తిన్నది. కాని, ఈ విషయంలో రాజలింగం గారికి ఏ విధమైన సందిగ్ధం ఎదుర్కొన్నట్లు లేదు. ఆయన రాజకీయాలతో సంబంధం పెట్టుకొనే ఉన్నారు.

6. ఆశ్రమంలో చేరిన తరువాత గాంధీజి దృష్టిలో పడ్డారు. ఆ వీక్షణంతో రాజలింగంగారు తన్మయత్వం చెందినట్లు కనపడుతుంది. గాంధీజీ ఎప్పుడు యివి నా సిద్ధాంతాలు, అని చెప్పలేదు.

7. ఆయన నమ్ముకున్న విషయాలు అమలు చేయటమే ఆయన విశిష్టత ఆశ్రమంలో కూడ ఎవరిని పురమాయిస్తున్నట్లు కనపడదు. అందుకనే గాంధీజి "My life is my message" అన్నారు.

8. ఆశ్రమంతో ఉన్న సంవత్సరం రోజులు బాపూజీ వీక్షణలో ఎన్నో సూక్ష్మాతి సూక్ష్మాలు శ్రీ రాజలింగం గారు గ్రహించగలిగారు. అది ఆయన అదృష్టం.

9. మహిళా విద్యాలయంలో చేరాలని సంకల్పంతో వచ్చిన ఆయన భార్య పట్ల జరిగిన ప్రవర్తనతో చకితులైనాడు. ఆరాత్రి బయట ఎక్కడో Hotel కు పోయి ఉండవలసి వచ్చింది. ఆ రోజు రాత్రి ఆశ్రమంలో తావులేదన్న వ్యక్తిమీద గాంధీజి నోటివెంట మాట చెప్పకుండానే ఎదుటివారి భాద్యత చెప్పకలిగిన మహా మనీషి. ఆ సంఘటనో లేక తాను స్వంతంగా నిర్మాణాత్మక కార్యక్రమం నడుపగలుగుతాననే ధైర్యమో, ఆశ్రమం విడిచి పెట్టాలనే నిర్ణయానికి తెచ్చింది. రాజాజీ, ప్రభాకర్‌జీ, తదితరుల సలహా తిరస్కరించి బాపూజీ కస్తూరిబా ఆశీస్సులు తీసుకొని స్వయంగా కార్యక్రమం నడపాలని కృత నిశ్చయం చేసుకొని ఆశ్రమం విడిచిపెట్టాడు రాజలింగంగారు.

10. స్వగ్రామమైన వరంగల్లులోని దగ్గర ఉన్న స్థంబంపల్లిలో, కరీంనగరులోని ముస్తాబాదులో నిర్మాణాత్మక కార్యక్రమం ఖాదీ ప్రచారం ప్రారంభించి జయప్రదంగా పని నడుపసాగారు.

11. ఇంతలో 1942 ఉద్యమం, దాని తర్వాత 1947-48 నిజాం రాజ్య విలీన ఉద్యమం రానే వచ్చినవి. వాటిలో నిమగ్నమై కారాగార శిక్ష అనుభవించాలసి వచ్చింది. పోలీసుచర్య జరిగిన తర్వాత మంత్రి పదవి అలంకరించినప్పటికి రాజలింగంగారి పట్టుదల, అయనను మరల కాలేజిలో చేర్చి ఎల్.ఎల్.బి పరీక్షకు హాజరు పరిచింది. దాని తర్వాత గవర్నమెంటు ప్లీడరుగా పనిచేసి అటు నిర్మాణాత్మక కార్యకర్తలకు స్వాతంత్ర సమర యోధులకు, ఆదర్శప్రాయంగా నిలిచినారు. 1947-48 లోని నిజాంరాజ్య విలీన ఉద్యమం కూడా భారత స్వాతంత్ర ఉద్యమ భాగమేనని భారత ప్రభుత్వం చేత ఒప్పించిన ఘనత రాజలింగం గారికి దక్కుతుంది.

12. దాదాపు 80 సంవత్సరాల వయస్సులో 60 సంవత్సరాలనాటి సంఘటనలను విపులంగా తెలియజేస్తూ గాంధీజి వ్యక్తిత్వాన్ని విశదీకరిస్తూ, శ్రీ రాజలింగంగారు తన విశిష్ట వ్యక్తిత్వాన్ని నిరూపించుకున్నారు. ఈ గ్రంథంలో "సంతో తపసా ధారయంతి విశ్వం" అన్నట్లు

సత్పురుషులు వారి తపశక్తితో ఈ ప్రపంచాన్ని ఉద్ధరిస్తూ ఉంటారు. ఆ కోవకు చెందినవారు శ్రీ రాజలింగంగారు.

13. ఈ గ్రంథంలో పొందుపరచిన విషయాలే కాకుండా ఇంకా ఎన్నో అనుభవాలు, జ్ఞాపకాలు, శ్రీ రాజలింగం గారు మన అందరికీ అందిస్తారని ఆశిస్తున్నాను.


యడవల్లి శివారామశాస్త్రి
సీనియరు అడ్వకేటు

భాగీరథి
3-6-288/3,
హైదరుగూడ,
హైదరాబాదు - 500 029.
ఫోన్ : 3224098

## ఏకాదశ వ్రతములు

పూజ్యులు రాజలింగం గారి పుస్తకం చదవటం ఒక ఆనందమైన అనుభూతి. రాజలింగం గారితో నా పరిచయం స్వాతంత్ర్య సమర యోధులుగా, మంత్రిగా, న్యాయవాదిగా, సంఘ శ్రేయోభిలాషిగా, చక్కని వక్తగా మాత్రమే. వారు (సంస్కర్త) ఇంత గొప్ప రచయిత కూడా అని నేను ఊహించలేదు.

అప్పట్లో (1947 లో) బాపూజీని ఒకే ఒక్కసారి బాల్యంలో దూరం నుండి దర్శించగల్గిన నేను, నా జన్మ ధన్యమయిందని భావించాను. అటువంటిది రెండు సంవత్సరాల కాలం బాపూ సన్నిధిలో జీవితం, ఆ అనుభవాలు స్మృతి పథంలో, డైరీలలో బహు జాగ్రత్తగా పదిల పరచుకోటం, సామాన్య కార్యకర్తగా ప్రారంభించి, కష్టనష్టాలు సంతోషంగా స్వీకరించటం, అవన్ని అరవై సంవత్సరాల అనంతరం అందరికీ అందివ్వడం అనేది అత్యంత అపరూపం.

వార్ధాలోని గ్రామీణ విద్యాలయానికి వారు చేసిన సేవల ద్వారా జవహర్‌లాల్, పట్టాభి, ఆజాద్, పంత్ రాజాజీ, కుమారప్ప మొదలైన మహామహులతో వారి సన్నిహితత్వం మనకు తెలుస్తున్నది తప్ప, వారి ఇప్పటి సామాన్య జీవన సరళి, అసామాన్య మేధాసంపత్తి చూస్తున్న మనం ఇవేవీ ఊహించలేం.

చివరి వరకు మహాత్ముని ఏకాదశి వ్రతములకు తగినట్లు జీవించాలనే వారి ప్రయత్నం అభినందనీయం. రాజలింగం గారు నిజంగా ధన్యజీవి.

డాక్టర్ కె. యం. సుబ్రహ్మణ్యం. IAS (Retd)

**1-8-702/44, నల్లకుంట,**

**హైదరాబాద్.**

**ఫోన్ 7637220**

# యం.యస్.కు మరో పేరు సాధన

1) "బాపు-నేను" చివరిదాకా చదివాక నాకు ఒకటి జ్ఞాపకం వచ్చింది. శ్రీ అడవి బాపిరాజుగారు సంపాదకులుగా తెలుగు "మీజాన్" లో నా రచనలు సాధన సమితి రచయితగా అచ్చు అయ్యేవి. (నేను అప్పుడు డిఫెన్స్ అకౌంట్స్‌లో పని చేస్తుండే వాడిని (1942-1949) ఒకసారి నేను మా అన్నగారు బాపిరాజు గార్ని కలవాలని వారి ఆఫీసుకు వెళ్ళాము. అక్కడ శ్రీ తల్లావఝ్ఝుల శివశంకర శాస్త్రిగారు (సభాపతి) గారున్నారు. సోదర తుల్యుడైన శ్రీనివాస చక్రవర్తి (సహాయ సంపాదకుడు) మా అన్నదమ్ములు "సూర్యచంద్రులను" పరిచయం) చేశారు. శ్రీ శాస్త్రిగారు మాటల మధ్యలో మాకొక చిన్న కథ చెప్తామన్నారు. సరే అన్నాం. Once There was a hermit అన్న తరువాత ఒక్క క్షణం ఆగి Now, There is no longer a hermit నాకు ఆ టెక్నిక్‌కు (భావకుశలత) ఆశ్చర్యమేసింది. ఇటువంటి అనుభవాలు మా సాధన సమితి సభ్యులం పంచుకుంటూ ఉండేవాళ్ళం.

2) శ్రీ రాజలింగంగారు కన్వీనరుగా, దర్శకులుగా మా సాధన సమితి (1939-1964) నిర్వహించబడింది. వీరి రచనలు యింకా చాలా ఉన్నాయి. మా వ్రాత పత్రిక 'ప్రత్యూష'లో, సాధక పేరుతో 'కృష్ణాపత్రిక' మొదలైన అనేక పత్రికలో ప్రచురించబడ్డాయి. పుస్తక రూపంలో కూడా చాలా వచ్చాయి. ఇంకా వస్తున్నాయి. నాకు అన్పిస్తుంది. రాజలింగంగారి డైరీలలో పోలీసు భయంతో తగలబెట్టిన ఎంతో చరిత్ర దాగి ఉన్నది వీరి శైలి ఏ విషయానైనా చిన్నగా సూక్ష్మంగా చెప్పడం. ఏదైనా కథానిక, ఏకాంకిక, గేయం చిన్న వ్యాసం లాంటి లఘువులకే గాని ఆధునిక ప్రచార యుగంలో గురువులకు స్కోపు లేదనుకున్నారేమో నా అనుమానం. డాక్టరు పి.వి. నరసింహారావుగారి "ఇన్సైడర్" ప్రస్తుత 'బాపు-నేను' రచనకు ప్రేరణ యిచ్చిందేమో 'బాపు-నేను' పుస్తకం సత్యజిత్‌రే టెలిఫిల్మ్‌లా ఉంది.

2-1-513/2, గురుచరన్ విలాస్,
న్యూ నల్లకుంట,
హైదరాబాదు - 500 044.

జె. సూర్యప్రకాశరావు

# బాపూజీతో సాన్నిహిత్యం

శ్రీ యం.ఎస్. రాజలింగం అన్నగారు వ్రాసిన "బాపు-నేను" అనే ఆత్మకథ లాంటి యీ ఉత్తమ గ్రంధానికి నాలుగు మాటలు వ్రాసే అవకాశం కల్పించిన మా అన్నగారికి కృతజ్ఞతలు. 1941-42 ప్రాంతంలో దాదాపు రెండు సంవత్సరాల పాటు సేవాగ్రాంలోని జాతిపిత మహాత్ముని ఆశ్రమంలో వారి సన్నిహితులలో ఒకరుగా ఉండి నిగూఢ భావ గర్భితములైన వారి కనుసన్నలలో మెలగి బాపూజీ భావాలను ఆదర్శాలను ఆశయాలను ఆకళింపు చేసుకొని వాటికి భావి కాలంలో ఎన్నో రంగాలలోరూపు దిద్దిన ప్రతిభావంతులు రాజలింగంగారు.

అఖిల భారత గ్రామోద్యోగ సంఘ కార్యదర్శి జె.సి. కుమారప్ప ఆధ్వర్యంలో నిర్వహింపబడుచున్న గ్రామీణ విద్యాలయంలో విద్యార్థిగా చేరి కాగితము, నూనె మొదలగు గ్రామ పరిశ్రమలలో శిక్షణ పొందుచున్న కాలంలో "నిప్పువంటివాడి" వని కుమారప్ప అన్నమాట ప్రశంసా వాక్యమే కాని హెచ్చరిక అనటానికి ఆస్కారం లేదు. సేవాగ్రంలో పార్నీకర్‌జీ నడుపుతున్న గోశాలలో అసిస్టెంట్ మేనేరుగా పనిచేసి పాలు, వెన్న నెయ్యి అమ్మటమే కాక, వెన్న నుంచి యెక్కువ నేయి తీసే పరిశోధనలో విజయం సాధించగా ఈ పరిశోధనా ఫలితాలు అఖిల భారతస్థాయిలో ప్రచారము చెంది వార్తా పత్రికలలో ప్రచురింపబడినవి. ముఖ్యముగా వారు ఎంతగానో యెదురుచూసిన బాపూజీతో సహపంక్తి భోజనము చేసే అవకాశము లభించినందుకు పరమానంద భరితులయ్యారు. మధురానుభూతిని కలిగించే ఇటువంటి అపూర్వ సన్నివేశాలను రాజలింగం గారు తన సహజమైన రచనా కౌశల్యముతో చిత్రీకరించి పాఠకులకు ఆసక్తిని పెంపొందించారు.

విశ్వవిఖ్యాతి గాంచిన బాపూజీ సిద్ధాంతాలను ప్రమాణాలనే కాకుండా సేవాగ్రాం ఆశ్రమంలో బాపూజీ సన్నిహితులలో ఒకరుగా ఉండి రాజలింగంగారు ఆర్జించుకొన్న అనుభవాలను కూడ అర్థం చేసుకొని స్వార్థ రహితంగా దేశ సేవ సమాజసేవ చేయదలచిన వారికి ఈ గ్రంథము తప్పక ఉపయోగపడగలదని నా విశ్వాసం.


రోడ్ నెం. 2,
ప్లాటు నెం. 43,
వెస్టు మారేడుపల్లి,
సికింద్రాబాదు - 500 026.

ముదిగొండ మార్కండేయ
రిటైర్డు డిస్ట్రిక్టు మరియు సెషన్సు జడ్జి

# అపురూప గ్రంథం

యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః
సయత్ప్రమాణం కురుతే లోకస్తదను వర్తతే.

అని గీతాకారుని వాక్యము. లోకమునకు మార్గదర్శన మవసరము. శ్రేష్ఠుల మార్గదర్శనము, వారి నడవడి, చేష్టలు, భావములు, లోకమంతయు అనుసరించదగిన వి. ఈ భావములను మనసునందుంచుకొని పూజ్యులు శ్రీ ఎం.ఎస్. రాజలింగంగారు వ్రాసిన, బాపు-నేను అను గ్రంథము అపురూపమైనది. ఈ గ్రంథము ఆరు అధ్యాయములతో, అపురూప వ్యక్తుల అభిప్రాయములతో, పూర్వ విషయముల అపూర్వ ఖండికలతో కూడుకొన్న ఉత్తమ గ్రంథము. ప్రజ్ఞాధురీణులు, సహృదయులు, రాజనీతిజ్ఞులైన శ్రీ రాజలింగంగారు శివాంఘ్రి పూజా తత్పరులు. దేశాభిమాని.

మహాత్మాగాంధీ గారి సమర్మతీ ఆశ్రమములో నుండి ప్రభాకర్‌జీ సహచరులుగా గాంధీజీ అడుగుజాడలలో నుండి దేశసేవా కార్యక్రమములందు పాల్గొని, తమ అనుభవములకు బాపూతో గడిపిన కాలములో జరిగిన సంఘటనలను, నీతి సూక్తులను, పౌనార్ ఆశ్రమములో వినోబాజీ కార్యక్రమాలను, గాంధీజీ సిద్ధాంతముల నవగతము చేసుకొని అసాధారణ జీవితమును గడిపిన శ్రీ రాజలింగంగారు ఈ రచన భావితరముల వారికే, ఈనాటి యువతరమునకు ఆదర్శప్రాయముగా నున్నవి.

శ్రీ రాజలింగంగరు తమ జీవితానుభవములను స్వీయచరిత్రగా రచించి నేటి తరమునకు మార్గదర్శనము చేయుటకు, దిశా దర్శనము చేయుట కొరకు ఉపయోగపడగలదని ఆశించుచున్నాను. ఈ నిస్వార్థ స్వాతంత్ర్య సమరయోధుని, ఉత్తమ రాజకీయ నాయకునికి, ఉత్తమ సమాజపు మార్గదర్శికి భగవంతుడు ఆయురారోగ్యములను ప్రసాదించవలెనని కోరుచున్నాను.

3-4-245/1
ఫోన్:0091 -40-7560616

బి.ఎన్. శాస్త్రి
ఎపిగ్రాఫిస్టు, హిస్టోరియన్

# నేటి సమస్యలకు పరిష్కారం

పూజ్యులు యం.ఎస్. రాజలింగం గారికి హృదయపూర్వక నమస్కారాలు. మీరు ఆదరముతో పంపిన బాపు-నేను అను గ్రంథము అందినది.

నాటి మీ అనుభవాలతోను, కార్యక్రమాలతోను, ప్రత్యక్షంగా సంబంధంలేని వాణ్ణి. ఆ అనుభవాలపై స్పందించడం సాహసం కాగలదు. ఆ రోజులల్లో స్వాతంత్రోద్యమాలలో పాల్గొన్న మీలాంటివారు, దేశభక్తిని, త్యాగాన్ని, సత్యాన్ని అహింసను జీర్ణించుకొన్న సేవాతత్పరులు.

మీరు వ్రాసిన గ్రంథంలో ఒకటి మీరు ప్రత్యక్షంగా చూసిన విషయాలను, ఆ రోజులలో గాంధీగారితోను ఇతర నాయకులతో మీకు గల సంబంధాన్ని ఆ సందర్భాలలో మీరు భిన్న, భిన్న వ్యక్తులు మాట్లాడిన మాటలు, మీరు స్పందించిన తీరు అప్పటి ఇతివృత్తాలకు చదువరుల కళ్ళ ముందుంచినారు.

అంతేకాదు, హరిజన్, యంగ్ ఇండియాలో ప్రచురించినటువంటి ఆ జ్ఞాపకాలను మీ అనుభవాలతో జోడించి చెప్పే విధానం ఈ తరం పిల్లలకు ఈ గ్రంథాన్ని చదవడానికి ఉత్సాహ ప్రోత్సాహాన్ని ఇచ్చినారు.

మీ తరంలో విలువలు లేని వ్యక్తి మనుగడ కష్టం. కాని ఈ తరంలో విలువలు గల వ్యక్తి మనుగడ కష్టం.

బాపు-నేను అనే పుస్తకం ఆధునిక సమాజంలో కొంతమందికైనా విషవలయంలో వుంటూ విషవలయాన్ని ఛేదించటానికి ఉపయోగపడుతుందని ఆశిస్తున్నాను.

176 ఎ/సి, ఎం.ఎల్.ఏ.కాలనీ,
రోడ్డు నెం.12, బంజారా కాలనీ,
హైదరాబాదు - 34.

టి. పురుషోత్తమరావు
మాజీమంత్రి.

# మెచ్చుతునక

"ప్రభాకర్‌జీ" అవార్డు, "శివానందగురు" అవార్డు, "గాంధియన్" అవార్డు అందుకొన్న యం.యస్. రాజలింగంగారు రచయితగా ప్రసిద్ధులు. (అనేక పదవులు నిర్వహించి ఎంతో అనుభవం గడించిన వారి రచనలలో ఎంతో వాస్తవికత కనిపిస్తోంది. ఆయన రచనల రాశిలో తక్కువయినా వాసి గలవే. వాటిలో బాపు-నేను అనే రచన ఒక మెచ్చుతునక.)

బాపు-నేను అనే పుస్తకంలో శ్రీ యమ్. రాజలింగంగారు గాంధీగారితో తన అనుభవాల్ని కళ్లకు కన్పించినట్లుగ రచించారు. గాంధీగారి వ్యక్తిత్వాన్ని, దేశాభిమానాన్ని, సత్యాన్వేషణను, గురుభక్తిని ఆయన సూచించిన స్త్రీ ప్రాముఖ్యతను, ఆయన జీవితాదర్శాలను ఆరు అధ్యాయాలలో హృదయానికి హత్తుకునేటట్లుగ కూర్చారు. పుస్తకం మొదటిలో బాపు బొమ్మక్రింద యిచ్చిన వాక్యాలు "నేను కొత్త సిద్ధాంతాన్ని దీన్ని ప్రతిపాదించలేదు. . . . సాహిత్య ప్రభావం అక్కరలేదు - అనే విషయం ఎంతో సూచనప్రాయంగ ఉంది.

రచయిత మొదటి అధ్యాయంలో తన వ్యక్తిత్వానికి అనుగుణంగ జీవితాన్ని మలుచుకోవడానికి "కాలేజి పుస్తకాలు అమ్మి" వార్ధకి ఎలా పయనమయ్యారో సూచించారు. ఆయన అకుంఠిత దీక్ష, గాంధీగారి పట్ల ఆయనకున్న అభిమానం ఈ అధ్యాయంలో స్పష్టంగా కనిపిస్తుంది.

రచయిత రెండవ అధ్యాయంలో "వార్ధా గ్రామీణ విద్యాలయం గురించి, గాంధీజీకి నిర్మాణాత్మక కార్యక్రమాలపై ఉన్న శ్రద్ధ, దీక్ష గురించి సూక్ష్మంగా సూచించారు. శ్రీ రాజలింగంగారు "వంటశాల" ఇన్‌ఛార్జీగా వున్నప్పుడు గాంధీగారి ఆశీస్సులకోసం ప్రయత్నించిన విధానం గమ్మత్తుగ వుంది.

మూడవ అధ్యాయం "సౌనారు వినోభా"లో రచయిత వినోభా ఆశ్రమంలో విశేషాలు, ప్రభాకర్‌జీ గోసేవకై చేసిన కృషి, గోశాల, గోసేవ ప్రాముఖ్యత, ఉపయోగం గురించి వివరించారు. ఇదే కాక చిన్న చిన్న వంటింటి చిట్కాలు కూడ సూచించారు.

నాల్గవ అధ్యాయంలో రచయిత సత్యాగ్రహం, స్వాతంత్ర్య సమరంలో ముఖ్యపాత్ర వహించిన అనే ప్రముఖుల ప్రస్తావన, గాంధీజీ నమ్రత గురించి విశదంగా వివరించారు. ఈ అధ్యాయం, పాఠకులలో మానసిక పరివర్తన కల్గించే విధంగా ఉంది.

ఐదవ అధ్యాయంలో రచయిత బాపూజీ ఆశ్రమ నియమాలు, సమాజ వ్యవస్థలో శాంతి సౌభాగ్యాలు నెలకొల్పబడడానికి గాంధీజీ సూచించిన నియమాలు, కస్తూరిబా వ్యక్తిత్వం గురించి ప్రస్తావించారు. మిగతా అధ్యాయాలలో అనేక ముఖ్య అంశాలు అనుబంధాలు రూపొందించబడినవి.

బాపూజీ అభిమానులందరూ ఈ పుస్తకాన్ని తప్పక చదివి భద్రపరుచుకోవలసింది. పుస్తకం పాఠకులను ఆసక్తికరంగా చదివించగల్గుతుంది.

**సుగుణమణి**

ఆంధ్రమహిళాసభ మాజీ అధ్యక్షురాలు

1-8-167, చిక్కడపల్లి,

హైదరాబాదు - 24.

# మహోత్తమ వృక్షం

శ్రీ ఎం.ఎస్ రాజలింగం గారు రాజకీయ తపస్వి.రాజకీయ పదం నేటిది కాదు,స్వాతంత్ర్యో ద్యమం నాటిది.వీరు ఆనాటి వారే.లౌకిక ప్రవాహంలో కొట్టుకు పోకుండా,ఆనాటి నుండి నేటి వరకు గాంధీ బాటలోనే నిలిచిన మహోత్తమ వృక్షం.ఆదర్శంకూడా స్వార్ధమే,కాని అది దీర్ఘస్వార్ధం,తాత్కాలిక స్వార్ధాలవైపు మొగ్గే వ్యక్తులు స్వప్రయోజనాలను గూడా పూర్తిగా పొందలేని అమాయకులు.వారిపై జాలి పడడం తప్ప మరోకృత్యం మనకు లేదు.అనే ఆదర్శ గాంధీయవాది మన రాజలింగంగారు.గాంధీ అనే మహాత్ముడుండే వాడు.అంటే నేటి పిల్లలు గాంధీ గారి గాధలను చందమామ కధలులా భావిస్తున్నారు కారణం,వారిని పెంచే తల్లి తండ్రులు ప్రవర్తించే తీరు.

ఆ సమయంలో గాంధీ గారిని అనుస రించిన వ్యక్తి ప్రత్యక్ష సంబంధం కలవ్యక్తి గాంధీ గారితో తన అనుభ వాలను తనతరువాతి 3వ తరం వారికి అందించాలను కోవడం జాతిపై విడదీయలేని ఆత్మీయతను పంచుకోవడం వలననే సాధ్యమైంది.ఈ గ్రంథం చదువుతుంటే ఆనాటి అనుభవాలు మన అనుభూతి లోనికి ప్రవేశిస్తూ ఆనాటికి మనను తీసుకెడుతూ మనసును పవిత్రం చేస్తుంది.

సి.వి.బి సుబ్రహ్మణ్యం.

# ఆణిముత్యాలు

భగవంతుడిలో లీనం కావడనికి విగ్రహం ఒక సాధన అని బాపు మాటలలో ఆస్తికత్వాన్ని పోషించిన భారతీయ సంస్కృతికి వన్నె తెచ్చిన రాజలింగం గారికి హర్షనీయాలు.

**- ముదుంబై రామానుజాచారి**

గీతాభవనం, జె.పి.ఎన్ రోడ్,
వరంగల్లు

★ ★ ★

భారతీయ సంస్కృతిలోని శాశ్వత విలువలను, ఆర్థిక సమానత్వ సిద్ధాంతాలను గాంధేయ పద్ధతిలో సాగిన ఉద్గంధము.

**- ఎస్.పి. రాజేశ్వరరావు**

పరిశ్రమ సంపాదకులు
వరంగల్లు

★ ★ ★

గాంధీజీ రోజు స్మరించు, హింస, అహింసా, ఏకాదశ సూత్రముల స్వభావ స్వరూపములు బాలురకు సహితము తేలికగా అర్థమగునట్లు ఉదాహరణ సహితంగా రచించిన ఈ గ్రంథము ప్రతి పాఠశాలలో ఉండతగినది.

**- కొంపెల్లి ఆంజనేయశాస్త్రి**

తెలుగు పండిత్
కృష్ణాకాలని, స్టేషన్ రోడ్డు, వరంగల్లు.

★ ★ ★

గ్రంథం ముట్టుకుంటే వృద్ధుల బుద్ధి పుట్టదు. ఈ రచన అపార అనుభవములతో, ఆదర్శములతో, అంశములకు, పరిశోధనకు దిక్సూచిగా ఉన్నది వేయడం రాజలింగంగారి వంతు దానిని ఆచరింప చేయుట మనవంతు దానిని ఆచరింపచేయుట మన వంతు అని గుర్తించిన, మన జన్మసాఫల్యం కాగలదు. దేశ కళ్యాణం కాగలదు. ఇట్టి మహోత్తమ గ్రంథము మన కందచేసిన రాజలింగంగారు ధన్యులు.

హరిహర నామ సంస్థ అధ్యక్షులు — **- యం.యన్. రంగాచార్యులు**
సికింద్రాబాద్ — స్వాతంత్ర సమరయోధుడు

★ ★ ★

రచయిత స్వాతంత్ర్యోద్యమ కాలంలో కొంతకాలము సేవాగ్రాం ఆశ్రమంలో ఉండిన ఆంధ్రుడు. సుదీర్ఘ అనుభవముతో స్వాతంత్ర్య సమరయోధుడు చేసిన విశిష్టమైన ప్రమాణికమైన రచన. ఆంధ్రులు తప్పక చదువ వలసిన గ్రంథము.

**- కాశీవఝ్జల సాంబయ్య**

స్వాతంత్ర్య సమరయోధుడు.
సి-17, సి.ఆర్.పి. క్వార్టర్స్
ఒంగోలు - 523 001.

1942 : గాంధీ ఆశ్రమవాసుని సభ్యునిగా అక్టోబరు 40 నుంచి 42 అక్టోబరు వరకు.

1942 : దక్కను క్రానికల్ ఆంధ్రపత్రికా విలేఖరిగా

1942 : ఓరుగల్లు రాక క్విట్ ఇండియా ఉద్యమ నిర్వహణ

1942 : సత్యాగ్రహం - అరెస్టు

1943 : విడుదల

1943 : విడుదలయిన వారిపోషణకె. జాతీయాభ్యుదయ సమితి ఏర్పాటు - తద్వారా సుభాను చేతి పరిశ్రమల పేరుతో గ్రామపరిశ్రమల నిర్వహణ.

1944 : జాయింటు కో ఆర్డినేషన్ కమిటి J.C.C.కి తోడ్పాటు.

1944 : స్థంభంపల్లిలో వద్దిరాజు రాజేశ్వరరావు గారి భూదానం

- సర్వోదయ సంఘం - ఆశ్రమ స్థాపన.

1944 : ఆజాంజాహి మిల్లు కార్మిక ఉద్యమాలు, డిమాండ్ల సాధనకై సమ్మెలు, ట్రిబునల్ కేసులు నిర్వహించుట

1944 : ఆంధ్ర విద్యాభివృద్ధి వర్దని హైస్కూలు తెలుగు మీడియంతో, స్థాపనలో ఒకరుగాను ప్రథమ కార్యదర్శిగా స్కూలు నిర్వహణ.

- ఆంధ్ర జాతీయ పక్ష వరంగల్లు జిల్లా కార్యదర్శిగా

1944 : కాలోజి - కాంగ్రెస్ కమ్యూనిస్టు ఐక్యవేదిక యత్నంలో పాత్ర

1944 : ఆంధ్రమహాసభ వరంగల్లు జిల్లా సంఘకార్యదర్శిగా ఎన్నిక

1944 : ఓరుగల్లు కోటలో సారస్వత పరిషత్తు కవి సమ్మేళన ఏర్పాట్లు

- జాతీయ విద్రోహశక్తులు, సభామంటపం - పెందాలు తగులపెట్టుట.

- జాతీయ విద్రోహశక్తుల దౌర్జన్యం, స్పృహతప్పి పడేటంతవరకు

- గాంధీజీ జోక్యం - దౌర్జన్యవాదులపై చర్య తీసుకోవలదని గాంధీజీ సలహా - దాని అమలు.

- స్థంబంపల్లిలో బేసిక్ విద్యా పాఠశాల.

- ఆనాటి విద్యాశాఖమంత్రి ధోండే రాజబహద్దూరుచే ప్రారంభోత్సవము.

ధర్మారం నుంచి స్థంబంపల్లి వరకు ఐచ్ఛిక శ్రమదానంతో రోడ్డు నిర్మాణం.

- గవర్నరు భీమసేను సచార్ ఆశ్రమానికి రాక.
- ఆంధ్రజాతీయ పక్ష కార్యాలయం ఖమ్మం నుంచి వరంగల్లుకు మార్పిడి

1946 : ఓరుగల్లు కోటలో జాతీయ పతాకావరోహణ

- కాశీం షరీఫు నాయకత్వంలో మొగులయ్యను బల్లెముతో పొడచి హత్య గావించుట.
- నేరస్థుల పట్టించి, శిక్షించు యత్నములు.
- వరంగల్లు జిల్లా నుంచి 6 నెలలు బహిష్కరింపబడుట.

1946 : బహిష్కరణ ఉల్లంఘన -. చెంచల్‌గూడ జైలులో నిర్బంధము.

1946 : తిరిగి వరంగల్లు జైలులో 14-10-46 నుంచి 17-9-48 వరకు నిర్బంధం.

1947 : బీదరు స్థాయి సంఘ సమావేశం స్వామీజీ, మతవాదుల రాజీ నామా, ప్రతిష్టంబన తొలగించుటకై రాజీ తీర్మాన యత్నం. తుదకు స్వామీజీ మితవాదులు తీర్మానాన్ని అంగీకరించడం. ప్రతిష్టంబన తొలగడం.

1948 : జమీందారు పోలీసు దౌర్జన్యాలు పండిత్‌జీ - కార్యదర్శి కర్చూ రాక వారితో వివిధ ప్రాంతాల పర్యటన - రిపోర్టు,

1948 : వినోబాజి, రజాకార్లచే తగులపెట్టబడిన స్థంబపల్లి ఆశ్రమానికి రాక

1948 : ప్రగతివారపత్రిక ఏర్పాటు సంపాదక వర్గంలో సభ్యత్వం

1949 : మొగులయ్య హాలుకై ఏర్పాటు - నిర్మాణ యత్నాలు

1949 : కమ్యూనిస్టు కల్లోలలిత ప్రాంతాలైన మానుకోటలోని చెట్ల ముప్పారానికి భూసమస్యల అవగాహనకై - ప్రయాణం - కమ్యూనిస్టు కాల్పులు.

1950 : విశాలాంధ్ర మహాసభ ఓరుగల్లులో జరుపుట. ప్రథమ కార్యదర్శిగా ఎన్నుకోబడుట.

1951 : I.N.T.U.C. (కార్యవర్గ సభ్యునిగా (ప్రముఖపాత్ర - హైదరాబాదులో జనరల్ కౌన్సిలు సమావేశం జరిపించుట.

1952 : హైదరాబాదు శాసనసభ ఎన్నికలు ఓరుగల్లు నుంచి యం.ఎల్.ఏ. గా ఎన్నిక - పండిత్‌జీ రాక.

1952 : పొట్టి శ్రీరాములు ఆమరణదీక్ష విరమించుటకై యత్నం. 18 మంది యం.ఎల్.ఏ లచే 18-2-52న జాయింటు స్టేటుమెంటు.

1952 : స్వామీజీ - దేశాయి కాంగ్రెసు అధ్యక్షతకై... స్వామీజిని గెలిపించిన యత్నం.

1952 : వామపక్షములు ఎన్నికలలో ఆయుధాలు వాడుతున్నారని ఋజువుచేయు యత్నం. వారినుంచి కోమటి కొత్తపల్లి గ్రామములో తుపాకిలాగుకొని ఎలెక్షను కమిటీకి అందచేయుట.

1952 : శాసనసభ భూ సంస్కరణ కమిటీ సభ్యులుగా

1953 : హైదరాబాదు బూర్గుల రాంకిషన్‌రావు గారి మంత్రిత్వంలో డిప్యూటి మినిస్టరుగా పి.డబ్ల్యూ.డి లేబరు శాఖకు నియమించ బడుట.

- పి.డబ్ల్యూ.డి లేఖరు మినిస్టరు డా॥ మేల్కోల్ విదేశాలకు పోయినపుడు మినిస్టరు ఇన్‌చార్జిగా పనిచేయుట.

1953 : ముఖ్యమంత్రి బూర్గుల రాంకిషన్‌రావు గారి పట్ల విశ్వాస తీర్మానాన్ని అసెంబ్లీలో ప్రవేశపెట్టి గెలిపించు యత్నం - సాఫల్యత.

1954 : హైదరాబాదు వాలంటరి స్కీము సర్క్యులరు P.W.D.1.B.229/G.V.F/5730/84 D : 4-10-1954 అమలు ఐచ్ఛిక, విరాళ శ్రమదానంతో దేశాయిపేట రోడ్డు ఇల్లెందు చెరువు ఇత్యాది కార్యక్రమాలు చేపట్టుట.

1954 : పోచంపాడును హైడ్రో ఎలక్ట్రిక్ ప్రాజెక్టుగా రూపొందించమని ఆందోళన.

1955 : తుంగభద్రా ప్రాజెక్టు గెస్టు హౌజ్ ప్రారంభోత్సవము - రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్‌కు ప్రభుత్వము తరపున మునీరాబాదులో స్వాగతము.

1955 : కల్లుగీత పారిశ్రామిక సహకార సంఘం సత్యాగ్రహ ఆందోళన నిర్వహణ.

1955 : నాగార్జునసాగర్ ప్రాజెక్టు శంఖుస్థాపన - నెహ్రూ రాక పి. డబ్ల్యూ.డి లేబరు శాఖ మంత్రిగా పాల్గొనుట.

1956 : సిరిపూరు, - సిరిసిల్క్ కార్మిక ఆందోళనపై నేటికి పునాదిగా ఉన్న అకేలికరు-యం.యస్. జాయింటు రిపోర్టు.

1957 : వరంగల్లు బాలికా పాఠశాలకు ఆకారపు అనంతలక్ష్మి భూదానం - భారత ప్రభుత్వ విద్యాశాఖ మంత్రి శ్రీమాలిచే శంఖుస్థాపన.

1957 : భారత ప్రభుత్వ ఇండస్ట్రియలు డెవలప్‌మెంటు కౌన్సిలు మెంబరు.

1957 : శాసనసభ ఎన్నికలు చల్లంచర్ల నియోజకవర్గంనుంచి గెలుపు

1957 : కాంగ్రెసు లెజిస్లేచరు పార్టీ కార్యదర్శిగా

1958 : అసెంబ్లీకి ఉన్న అధికారాలు తెలంగాణ ప్రాంతీయ కమిటి కుండాలని ఆందోళన

- తెలంగాణ సమస్యలపై అసెంబ్లీలో తీర్మానం ప్రవేశపెట్టుట.
- I.E.S Specialist Trade Uhion Deligation - 18 దేశాల ప్రతినిధులతో - భారతప్రతినిధిగా అమెరికా యూరపు దేశాల పర్యటన.

1958 : ఉస్మానియా యూనివర్సిటిని హింది యూనివర్సిటిగా మార్చవద్దని ఆందోళన.

1961 : తెలంగాణ సర్వీసెస్ రిపోర్టు వ్రాయుటకు కాబినెటు రాజలింగంగారిని నియమించుట అట్టి రిపోర్టుపై యం.ఎస్. రాజలింగం గారి స్వగ్రహమున శ్రీయుతులు పి.వి. నర్సింహ్మారావు, డా॥ చెన్నారెడ్డి, గోపాలరావు, ఏక్బోటే బద్దం ఎల్లారెడ్డి సంతకాలు చేయుట తెలంగాణ ప్రాంతీయ కమిటి అట్టి రిపోర్టును ఏకగ్రీవంగా ఆమోదించుట.

1963 : వరంగల్లు నియోజకవర్గానికి కాంగ్రెసు టికెటుకై దరఖాస్తు - నిరాకరణ- ఆ అనుభవాల రచన ఇంగ్లీషులో All over Congress Ticket వ్రాయుట కోదాటి వారు తెలుగులో అనువదించుట, కృష్ణాపత్రికలో 1964, 1999లో సీరియల్‌గా ప్రకటించబడుట.

1964 : చీఫ్ గవర్నమెంటు మరియు చీఫ్ పబ్లిక్ ప్రాసిక్యూటరు సిటిసివిల్ కోర్టులో దాదాపు 9 1/2 సంవత్సరాలు.

1969 : తెలంగాణ ఆంధ్ర ప్రాంతీయ ఐక్యతకై అష్టసూత్ర ప్రణాళిక

1972 : తామ్రపత్ర గ్రహిత

1974 : హైకోర్టు గవర్నమెంటు ప్లీడరు (రెవెన్యూ) గా నియామకం.

1977 : దివిసీమ తుఫానులో సహాయ, పునరావస కార్యక్రమం - తుడిచి పెట్టుకొని పోయిన కమ్మనవోలులో 200- ఇండ్ల నిర్మాణం కమ్మనవోలును గాంధిగ్రాం పేర నామకరణం. ఆనాటి విదేశాంగ శాఖ అమాత్యులు పి.వి. నర్సింహారావుగారిచే గాంధీగాం ఆవిష్కరణ.

1977 : వరంగల్లు జిల్లాలో స్థంబంపల్లి గ్రామంలో గ్రామ సేవకుల శిక్షణ ద్వారా ఐచ్ఛిక శ్రమదానంతో హసనపర్తి - గంటూరుపల్లికి రోడ్డు వేయుట - శ్రీ పి.వి. నర్సింహారావుగారి ప్రారంభోత్సవము

1977 : శ్రీ ఎ.వి.ఎస్. రెడ్డి ఐ.ఎ.ఎస్, కృష్ణాజిల్లా కలెక్టరు శ్రీ చెంగప్ప ఐ.ఎ.ఎస్ జాయింట్ కలెక్టరు, చీఫ్ జస్టిసు అల్లాడి కుప్పుస్వామి, కనుగాంధి గారలచే వివిధ బ్లాకులకు శంఖుస్థాపన. అఖిలభారత ఖాధీ కమీషను చైర్మన్ సోంబాయిచే House cum Shelter ప్రారంభోత్సవము.

1980 : హైదరాబాదు కవాడిగూడ లోని శంకరారాధ్యమఠం ఫిట్ పర్సన్‌గా నియామకం.

1980 : గౌ॥ స్టేట్ హోంశాఖామాత్యులు వెంకట సుబ్బయ్య, హోం సెక్రటరి అగర్వాలుతో చర్చలు. బార్డరు క్యాంపు అజ్ఞాత స్వాతంత్ర సమర యోదులకు పెన్షను స్కీము తయారుచేసి కేంద్ర ప్రభుత్వంచే ఆయోదింపచేయుట.

1981 : కోలాలంపూరులో జరిగిన ద్వితీయ ప్రపంచ తెలుగు మహాసభ లకు ప్రతినిధిగా.

1982 : నుంచి నేటివరకు ఆంధ్రప్రదేశ్ స్వాతంత్ర సమరయోదుల సంస్థకు వేర్వేరు హోదాలలో డా॥ తిరుమలరావు శ్రీ కందుల ఓబులరెడ్డి, రావి నారాయణ రెడ్డితో కలిసి పనిచేయుట సంస్థను 1166/82 నెం.తో రిజిష్టరు చేయించుట.

1984 : ఉస్మానియా యూనివర్సిటి లా కాలేజిలో పార్టు టైం లెక్చరరు.

1985 : ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు కమిటి లీగల్ సెల్ బులెటిన్‌కు 6 సంవత్సరాలు సంపాదకులు.

1986 : భారతీయ విద్యా భవన్ హైదరాబాదులో Faculty Member

1988 : నేషనల్ ఫోరముఫేర్ హ్యూమన్ రిసోర్సు డెవలప్‌మెంటు మెంబరు.

1986 : విజయవాడలో రాష్ట్రపతి వెంకట్రామన్ గారిచే సన్మానం.

1988 : ఆంధ్రజ్యోతిలో తలవంచని తెలంగాణా వీరుల (ముఖవ్యాసం) అలాగే వివిధ పత్రికలలో వ్యాసాలు.

1992 : క్విట్ ఇండియా రజితోత్సవ సందర్భంలో శాసన సభలో శ్రీయుతులు కాసు బ్రహ్మానందరెడ్డి, వావిలాల గోపాలక్రిష్ణయ్య, గౌతులచ్చన్నతో పాటు అమ్మన్నరాజా, ఎన్.టి. రామారావు గారిచే సన్మానింపబడుట.

1994 : రాష్ట్రంలో మద్యనిసేధం అమలు అయిన మీదట Post Prohibition Survey గంటూరిపల్లిలో జరుపుట.

1994 : భారతీయ విద్యాభవన్‌లో గౌ॥ గవర్నరు క్రిష్ణకాంత్ గారిచే సన్మానం.

1995 : ఉస్మానియా యూనివర్సిటిలో Social Transformation సెమినారుకు అధ్యక్షత వహించుట. గవర్నర్లు శ్రీ క్రిష్ణకాంత్, రఘునాథరెడ్డిగారు ముఖ్య అతిథులుగా పాల్గొనుట.

1995 : స్వతంత్ర సంగ్రామ, సైనిక గృహ నిర్మాణ సొసైటి (రిజిష్టరు నెం. 603/95) నెలకొల్పుట.

1996 : తెలుగు విశ్వవిద్యాలయం వారిచే యం.ఎస్. జీవిత విశేషాల చిత్రీకరణ.

మార్చి 1997 : మోతీలాల్ నెహ్రూ స్మారకోపన్యాసం తెలుగు యూనివర్సిటిలో.

- ఆంధ్ర సారస్వత పరిషత్ 32వ వార్షికోత్సవానికి అధ్యక్షత వహించుట
- డిసెంబరు 1997 తెలంగాణా స్వాతంత్ర సమరయోధుల. సభలో కేంద్ర హోంశాఖమంత్రి ఇంద్రజిత్ గుప్త గారిచే సన్మానం.
- 9 నవంబరు 97 రాష్ట్ర అవతరణ సందర్భంలో రాష్ట్రపతిచే సన్మానింపబడుట.

1998 : 19 సెప్టెంబరు 98 హైదరాబాదు విమోచన స్వర్ణోత్సవాల సందర్భంలో గవర్నరు శ్రీ రంగారాజన్ గారితో సన్మానింపబడుట.

1999 : కొత్తపట్నం మంతెనవారి పాలెంలో వేసంగి పాఠశాల 69 వార్సికోత్సవ ఉత్సవాలకు అధ్యక్షత వహించుట.

# మహోత్తమ వృక్షం

శ్రీ ఎం.ఎస్ రాజలింగం గారు రాజకీయ తపస్వి.రాజకీయ పదం నేటిది కాదు,స్వాతంత్ర్యో ద్యమం నాటిది.వీరు అనాటి వారే.లౌకిక ప్రవాహంలో కొట్టుకు పోకుండా,అనాటి నుండి నేటి వరకు గాంధీ బాటలోనే నిలిచిన మహోత్తమ వృక్షం.ఆదర్శంకూడా స్వార్ధమే,కాని అది దీర్ఘస్వార్ధం,తాత్కాలిక స్వార్ధాలవైపు మొగ్గే వ్యక్తులు స్వప్రయోజనాలను గూడా పూర్తిగా పొందలేని అమాయకులు.వారిపై జాలి పడడం తప్ప మరోకృత్యం మనకు లేదు.అనే ఆదర్శ గాంధీయవాది మన రాజలింగంగారు.గాంధీ అనే మహాత్ముడుండే వాడు.అంటే నేటి పిల్లలు గాంధీ గారి గాధలను చందమామ కధలులా భావిస్తున్నారు కారణం,వారిని పెంచే తల్లి తండ్రులు ప్రవర్తించే తీరు.

ఆ సమయంలో గాంధీ గారిని అనుసరించిన వ్యక్తి ప్రత్యక్ష సంబంధం కలవ్యక్తి గాంధీ గారితో తన అనుభవాలను తనతరువాతి 3వ తరం వారికి అందించాలను కోవడం జాతిపై విడదీయలేని ఆత్మీయతను పంచుకోవడం వలననే సాధ్యమైంది.ఈ గ్రంథం చదువుతుంటే ఆనాటి అనుభవాలు మన అనుభూతి లోనికి ప్రవేశిస్తూ ఆనాటికి మనను తీసుకెడుతూ మనసును పవిత్రం చేస్తుంది.

సి.వి.బి సుబ్రహ్మణ్యం.